


## సంచార పరిశోధనాలయం

నా రచనని పేర్కొంటూ, జి.డి.యస్. విజయ కుమార్‌గారి, ప్రచురించిన లేఖ చూసాను. అందులోని విషయాలని మూడు భాగాలుగా విభజిస్తున్నాను.

1. నా రచన "సంచారపరిశోధనాలయం" గురించిన విమర్శ.
2. నాకు సుపీరియారిటీ కాంప్లెక్సు ఉందనిచేసిన వ్యక్తిగతమైన విమర్శ.
3 నా కథలో నేనుచర్చించని రిజర్వేషన్ల మంచి చెడ్డలు.

వీటి గురించి వ్యతిరేక క్రమంలో వీలైనంత క్లుప్తంగా సమాధానాలు చెప్తాను.

1. రిజర్వేషన్ల సమస్య :—

సిద్దయ్య లాంటి కొందరు తమ కులాని కొక డొనేషన్ కాలేజీ పెట్టుకోవాలనిఅనుకోడానికితమకి గల కారణం ఇప్పుడున్న విపరీతమైనరిజర్వేషన్లు అని అనడం నేను విన్నాను.అవి"కూతలు"కావచ్చు. సమస్య అనే పిట్ట పెద్దదయి పట్టిన "కూతలు" అయి ఉండవచ్చు. అందరికీ ఈ విషయంలోరక రకాల అభిప్రాయాలు వాటికి తగ్గ "కూతలు" ఉండవచ్చు. కాని సత్యం ఏమిటంటే ఈనాడుమన దేశంలో రిజర్వేషన్లు ఉన్నా యన్నది. వాటివల్ల ఎడ్వాంటేజి పొందుతున్న వాళ్ళు ఆ ఎడ్వాంటేజిని త్వరగా వదులుకోరన్నది అందరు తేలికగా పోల్చుకో గలిగిన "నీతే!'

రాజ్యాంగంలో ఈ రిజర్వేషన్లు ఏ ఉద్దేశంతో ఎవరి ప్రగతి కోసం పెట్టారు? ఆ ఉద్దేశంనెర వేరుతోందా? వారి ప్రగతి సాధిస్తున్నామా అన్నది ముఖ్య ప్రశ్నలు. అసలు ఈ రిజర్వేషన్ల పద్ధతి మంచిదా?కాదా?దీనికి కాలపరిమితి ఉండాలా? అన్న విషయాలు పక్కన పెడ్దాం.

సానుభూతి సహకారాలు అర్హులైన వెనుకబడిన వారికి అందిస్తే (మోతాదులో) పైకి వచ్చిఆత్మ విశ్వాసంఏర్పరచు కొంటారని పైకి వచ్చిన వారు తమ తోటివారిని పైకి తెస్తారని ఉద్దేశించినవీ రిజర్వేషన్లు. ఇన్‌పీరియారిటీ కాంప్లెక్సుతో,ఆత్మ విశ్వాసం పెంపొందించుకోకుండా ఎప్పుడూచేయూత కోరుతూ ఉండేలా వారి నుంచడాని కేర్పాటైనవి కావని విజయకుమార్‌గారు కూడా ఒప్పుకుంటారను కొంటాను.

ఇకపోతే ఈ రిజర్వేషన్లు ఎవరి కోసం అయితే ఉద్దేశింపబడ్డాయో వారి ప్రగతికి ఎక్కువగా వినియోగపడటం లేదని నా అభిప్రాయం. నిష్పక్షికమైన ఎంక్వైరీ కమిషన్ వేస్తే తేల్తుంది. క్షామ నిధులు, వరద నిధులుమొదలైన అన్నింటిలాగానే ఇవి మధ్యలో మాయ మవుతున్నాయి.వీటినిఅమలు జరిపే ప్రభుత్వ యంత్రాంగంలోని వ్యక్తులకి, స్వార్థపరులైన ప్రజా ప్రతినిధులకి, అయిన వారికి ఈ రిజర్వేషన్లు అందుబాటులో ఉంటున్నాయి. స్వంత కులాలకి "కొండ" "ఆది" లాంటిప్రిఫిక్స్‌లు చేర్చేసుకొని అర్జెంటుగా "వెనుకబడ వారు"న్న అవకాశ వాదులకి తోడ్పడుతున్నాయి. ఆర్థికంగాను అధికారంలోనుముందుగా ఉన్న కొద్దిమంది "వెనక బడిన వారు" నిజమైన వెనుకబడిన వారికోసం నిర్ణయింపబడినఈ రిజర్వేషన్లు వారికిచెందకుండా పోగేసు కొంటున్నారు. అ ఉపమానంతోచెప్పాలంటే బస్సుల్లో స్త్రీల కోసం కేటాయించిన స్థలాన్ని, చేతిలో బరువుల్తో చంకలో పిల్లతోనిలబడ్డస్త్రీని, నిలబడలేని వృద్ధురాల్ని, అడ్డు కొట్టి ఆరోగ్య మైన ఏ బరువులు లేని స్మార్ట్ స్త్రీఆక్రమించడం లాంటిది. అందుచేత విజయకుమార్‌గారూ! ఏసీలు, బిసిలు ఏకమై ముందుఎదుర్కోవాలిసింది మరీ ముందుకు పోతున్న 'వెనుకబడిన" వర్గాన్ని తరువాత తీరుబడిగా మా సుపీరియారిటీ కాంప్లెక్సును ఎదుర్కోందురు గాని.

మంచి చెడూ అన్ని వర్గాల్లోను ఉంటాయి. బీద హరిజనులకి స్కాలర్‌షిప్‌లు ఇవ్వద్దని ఎవరూ అనరు. అల్లాంటి వారు లేరని ఎవరూ అనరు. నాతో ఇంజినీరింగ్ చదువుతూ ఉండిన వోహరిజనమిత్రుడు హటాత్తుగ జ్వరం వచ్చి చనిపోతే మట్టిచేయటానికి రైలు చార్జీలు లేక అతని తండ్రి రాలేకపోవటం నాకు తెలుసు. అటువంటి వారు కోట్ల కొలదిభారత దేశంలో ఉన్నారు. వాళ్ళకి ఏం మేలుజరుగుతోంది? హరిజనులు గిరిజనుల్ని స్వంత రాష్ట్రం అయిన బీహార్‌నుంచి పంజాబ్, హర్యానా, రాష్ట్రాలకి తీసుకుపోయి బానిసలుగా మారుస్తుంటే (నవంబర్ 9, 1980 హిందూ) ఏ నాయకులు ఏ నిర్మాణాత్మకమైన కార్యక్రమం ద్వారా వారిని విముక్తులను చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు? పతితులు, భ్రష్టులు, బాధా సర్పద్రష్టులు ఆంధ్ర పత్రికలకి, కాలేజీ చదువులకి అందని దూరంలో ఉన్నారు. దేశం నిరుద్యోగులతో నిండి పోతుంటే ఉద్యోగాలున్న వాళ్ళు, ఎడిషనల్ డియే సరిపోలేదని గోల పెడ్తారు కదా! నా బాధ కొద్దిగా నైనా ముందుకు రాలేక పోయిన వెనుకబడిన వాళ్ల గురించి. చెప్పుకో దగ్గంత ముందుకు వచ్చి మరీ ముందుకు పోలేని వారి గురించి కాదు. వాళ్ళు మిగిలిన అందరితో పాటే! తల్లిదండ్రులుపెద్ద ఉద్యోగస్థులు, వ్యాపారస్తులు అయిఉండి కూడా స్కాలర్‌షిప్పుల మీద చదువుకొనే వెనుకబడిన వారి మీద సానుభూతి ఎవరికీ ఉండదు! స్కాలర్‌షిప్పులు పొందుతూ మెస్సు బిల్లులు కట్టక జల్సాగా తిరుగుతుండే వారిని ఎవరూ హర్షించరు! పరీక్షల వరకు క్లాసులకి రాక పరీక్ష ముందు రాత్రి వో గుంపును వెంటేసుకొని ప్రశ్నా పత్రాలకై మేష్టర్లింటికి దాడి చేసే విద్యా (క్షమించాలి) . . . ప్రశ్నార్థులను ఏంచెయ్యాలంటారు?

ఇటువంటి పనులు చేసే వారు అన్ని కులాల్లోను ఉంటారు. వెనుకబడిన కులాల వారిలోను ఉంటారు. అయితే ఈ విద్యార్థి వేషధారలు తమ తప్పును ఎవరైనా ఎత్తి చూపితే తమ కులాన్ని ఒక ఆయుధంగా ధరించి తమ శత్రువుల "కుల తత్వాన్ని" చీల్చి చండాడ్తారు. లబ్ధి తాము మాత్రమే పొందుతూ ఎవరితోను పంచుకోక, తమ అక్రమ ప్రవర్తన వల్ల కలిగే తమ ఇబ్బందులకి మాత్రం తమ కులాన్నంతా ముగ్గులోకి దింపాలని చూస్తారు. అయ్యా వీళ్లే ఎక్కువగా మాకు అన్యాయం జరిగిందోయ్ అని గోలచేస్తూ ఉండేది. నిజంగా అన్యాయం అయిపోతున్న పీడితులు తాడితులు అన్నీ మవునంగా భరిస్తున్నారు మన దేశంలో.

మనం రాళ్లము రప్పలముకాము. అందుకని రాజ్యాంగంలో ఉన్న సూత్రాల అక్షరాలకి విలువనిచ్చే వారిలా కాక భావాన్ని ఆచరణలో పెడ్దాం.

2. నా సుపీరియారిటీ కాంప్లెక్సు :—

నాతో పనిచేసిన, చేస్తున్న సహోద్యోగులు, నాతో చదువుకొన్న సహాధ్యాయులు నాకు "గీర", ఉంది అంటే బాధపడాలి గాని, నా గురించి ఏమీ తెలియని విజయకుమార్ గారంటే పట్టించుకోడం అనవసరం. వెనుకబడ్డ వారిని వెనకేసుకు వస్తున్న విజయకుమార్ గారి క్రెడెన్షియల్స్ ఏమిటో! నేను వెనుకబడిన వారిపట్ల సానుభూతిలేని వాడినని, వాళ్ళకి ఏమీచెయ్యడానికి ఇష్టపడని వాడినని ఆయన అనుకోడానికి కారణం ఏమిటో! బహుశహ నా రచన "సంచార పరిశోధనాలయం" కాబోలు.

3. నా రచన :—

పాత్రల అభిప్రాయాలు రచయిత అభిప్రాయాలు ఒక్కటేనన్న నిర్ణయానికి ఎల్లా వచ్చారు విజయ్‌కుమార్‌గారూ? మీరు హేళనేదో వ్యంగ్యం ఏదో తెలియని వారని మీ ఉత్తరం చూస్తే అనిపించ లేదే! "సంచార పరిశోధనాలయం"గా మారిన మీ మెదడుకి కాస్త రెస్టిచ్చి మరోసారి నా రచన చదవండి. మీథాంక్స్‌కి ఏ మన గలను! అర్థంచేసుకోకుండా "మెన్షన్ నాట్ మై ఆర్టికల్ ప్లీజ్!" అనటం తప్పించి.

కవనశర్మ (బెంగుళూరు)

(66 వ పేజీ చూడండి)

## మ న వి

విద్యార్థిలోకం వ్యాసరచన పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన కుమారి డి. వి. ఎస్. ఎస్ ఎస్ లక్ష్మి (శ్రీ డి. ఎస్. ఆర్. మూర్తి గారి కుమార్తె, హైదరాబాదు) తమ ఫోటో, జీవిత వివరాలని పంపుతూ, ప్రస్తుత చిరునామాని వెంటనే తెలియజేయ గోరుతున్నాము. — సం.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938—1972]

శుక్రవారం : 24-12-'82
దుందుభినామ సం॥ మార్గశిర శు. నవమి
సంపుటము 75 : సంచిక 17

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడి ప్రతి వెల రు 1-50
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక





## * లోకంపోకడ — డోమెక్ *















# ఫారిన్ తప్పు వాడని స్వదేశీవాదులు!

ఫారిన్ పిచ్చిని ప్రత్యక్షంగా చూడాలంటే గుర్‌గావ్ రోడ్‌కి వెళ్ళండి– పాలంలోని ఢిల్లీ విమానాశ్రయానికి రెండు మైళ్ళ దూరంలో వుంటుంది. ఇక్కడ దాదాపు 4000 టి. వి. సెట్లు, వాటితోబాటు ఏవేవో ఎలెక్ట్రానిక్ యంత్ర సామగ్రి కనిపిస్తాయి. దాదాపు 4000 మంది భారతీయులు అక్కడ తిరుగుతూ ఉంటారు. అందరూ మైకం కమ్మిన కళ్ళతో ఇటూ అటూ తిరుగుతూ వుంటారు. వీరికేమయిందని ఈ రకంగా తయారవటానికి, అనిపిస్తుంది చూసేవాళ్ళకి.

ఏమవటమేమిటి ? రంగుల టి. వి సెట్ల దిగుమతి పథకాన్ని పెట్టారు కదా ? మీకు బహుమతిగా రంగుల టి. వి. ని ఎవరయినా పంపితే దాని మీద మామూలు దిగుమతి సుంకంలో సగం కన్నా కొంచెం ఎక్కువ ఇచ్చి దాన్ని తీసుకోవచ్చు ఇక్కడికి వచ్చేవాళ్ళంతా ఫారిన్ టి. వి పిచ్చి పట్టుకున్నాళ్ళే చిన్న టి. వి. మీద దిగుమతి సుంకంకూడా రు.7200 వుంటుంది, పెద్ద వాటి మీద రు. 12000 దాకా ఉండవచ్చు. అంబాలా రైతులు, జలందర్ లారీ డ్రయివర్‌లు, సిర్సా దుకాణం దారులు, చండీగర్ గుమాస్తాలు – ఢిల్లీలో ప్రభుత్వోద్యోగాలు చేసేవారి సంగతి సరేసరి– ఇక్కడ గుమిగూడి ఉంటారు. ఒక్కొక్కళ్ళ దగ్గిర 10,000 రూపాయల రొక్కం వుంటుంది. ఎంత కట్టాలో ముందే తెలీదు. ఇంటికి వెళ్ళి డబ్బు తీసుకు వద్దామనుకుంటే పెళ్ళాము, పిల్లలు ఆలస్యాన్ని సహించరు.




లూఢియానా నుంచి వచ్చిన ఒక ముసిలి రైతు తన పెద్ద పయిజామా జేబులలో నుంచి వందరూపాయల కట్టలు తీసి అక్కడ బాంకు గుమాస్తాకి జాగ్రత్తగా ఇచ్చుకోవటం నేను నా కళ్ళారా చూశాను, దేవుడి గుళ్ళో డబ్బు సమర్పించుకునే వాడిలాగ ఇస్తున్నాడా రైతు. ఆయన మూడు రోజుల నుంచి పాలమ్‌లో టి. వి. లు పెట్టిన గోడవును బయట తిష్ఠ వేసి వున్నాడు. ఎందుకంటే, ఆలస్యాలు అలాగ వున్నాయి; మన రైతుకి చదవటం – రాయటం రాదు. అయినా ఫరవాలేదని అన్నాడాయన. ఆయనకి కావలిసింది ఒక కొత్త 'ఫారిన్' టి వి; అంతే. దాన్ని ఇంటికి తీసికెళ్ళి అందరికీ చూపిస్తే అదొక సంతృప్తి.

మన భారతీయులకి ఏమిటీ 'ఫారిన్ పిచ్చి ?' పిచ్చికి కారణాలు లేకపోలేదు. కొన్ని బలమయినవే, మరికొన్ని అర్థంలేనివి. భారతదేశంలో తయారయ్యే సరుకులో చాలా భాగం మొదటి తరగతి సరుకు కాదు. మేలురకం బట్టలు, అద్దాలు, బహుశ స్కూటర్‌లు – ఈ దేశంలో తయారయినవి చాలా బాగా వుంటాయి. తక్కినవి లాభం లేదు. మన టి. వి. సెట్లు కొన్ని వారాలలోనో, నెలలోనో పనిచెయ్యటం మానేస్తాయి. కొన్నప్పుడు వాటిని పెద్ద మరమ్మత్తుల కోసం తయారు చేసిన వాళ్ళకే పంపవలసి వస్తూ వుంటుంది. మన మోటారు కారుల సంగతి వేరే చెప్పాలా ? కరాచీలోని మన రాయబారి కార్యాలయంలో ఒకాయన అంబాసడర్ కారు వాడుతాడు. దాన్ని ఏదో మ్యూసియమ్ నుంచి కొట్టుకొచ్చాడు. ఈయన అనుకుంటూ వుంటారు స్థానికులు. రొట్టె కాల్చే "టోస్టర్" మంచిది మన దేశంలో తయారు కాదు కదా ? గ్యాస్ సిలిండర్‌లు పగులుతూ వుంటాయి, స్టవ్‌లు కాలిపోతూ వుంటాయి, వంటిళ్ళలో ప్రమాదాలు జరుగుతూనే వుంటాయి. పోనీ ధరలు తక్కువా అంటే అదీలేదు. భారత దేశంలో ఒక నలుపు – తెలుపు టి. వి. సెట్‌కి ఎంత అవుతుందో జపాన్, హాంకాంగ్ లలో ఒక రంగుల సెట్టుకి అంతకన్నా తక్కువే అవుతుంది. అందుకనే, జనం సరుకు బాగా వుంటే చాలు ఎంతయినా ఇవ్వచ్చు అనుకుంటూ వుంటారు

ఇంకా చెప్పాలి; మన పారిశ్రామికోత్పత్తి చాలావరకు విదేశీ సరుకుకి నకిలీ, దానిని ఇక్కడివారు కనిపెట్టి అభివృద్ధి చేసినది కాదని అందరికీ తెలుసు. మనదంతా నకిలీ సరుకు. మన నాగరికత నకిలీ నాగరికతగా



తయారవుతోంది. భారతదేశంలో దేనిని గురించో ప్రకటనలు వస్తాయి. "సరికొత్త" అంటారు. నిజానికి అది పాత సరుకే అని మనకి తెలుసు. మన పారిశామికోత్పత్తీ అంతే. మన రాజకీయ భావాలూ అంతే. మన ఆర్థిక సిద్ధాంతాలూ అంతే. మార్క్సిసమ్ తీసుకోండి, అదొక విదేశీ వాదం అందుకనే డబ్బున్న వాళ్ళ సంతానం దానికోసం ఎగబడుతూ వుంటుంది.

మార్క్స్ భారత దేశంలో జన్మించి వుంటే ఎవరయినా అతన్ని పట్టించుకునే వాళ్ళా? [ ఎవరో కొందరు చాదస్తులు తప్ప ? ] ఆర్థిక సిద్ధాంతాల సంగతే తీసుకోండి. ఎందరో ఆర్థిక వేత్తలు — ఒక్క మంచి ఆర్థిక సిద్ధాంతం ఇక్కడ తయారు కాలేదు. మన ఆర్థిక వేత్తలు ఏవయినా పుస్తకాలు రాస్తే, వ్యాసాలు రాస్తే అంతా విదేశీ ఆర్థికవేత్తల రచనలనే ఉదాహరిస్తూ ఉంటారు. కొంతకాలం కింద భారత దేశానికి ప్రధాన ఆర్థిక సలహాదారుగా వున్న ఆయన శ్రీమతి గాంధీ కోసం ఒక ప్రసంగం రాసిపెట్టి నవ్వుల పాలయ్యారు. [ ఈయన ఒక పాకిస్తానీ ఆర్థిక వేత్త వ్యాసాన్ని తస్కరించి చెప్పకుండా ప్రధాన మంత్రికి 'అంతా తన రచనే' అన్నట్లు రాసి ఇచ్చాడు. ఆయన్ని వుద్యోగంలో నుంచి తీసేశారనుకోండి. కాని నిపుణుడనుకున్న వాడు దొంగ అని తెలిసిపోయింది కదా ?]

నకిలీ సరుకుని కొనుక్కుని సంతోషించమని మనమూ మన వాళ్లకి చెప్పలేము ! ఫారిన్ పిచ్చి వుందంటే వుండకేం చేస్తుంది ? జపాన్ వాళ్ళు ముందు పాశ్చాత్యులని కాపీ కొట్టారు కాని ఇప్పుడు వాళ్ళ తయారీలు జపాన్ విశిష్టతని చాటి గలుగుతున్నాయి. జపాన్ కారులు ఎంత అందంగా వుంటాయి ! అవి జపాన్‌లో తయారయినవే అమెరికాలోనో, బ్రిటన్‌లోనో తయారయినవి కావని చూడగానే తెలిసిపోతుందే ? జపాన్ గడియారాలూ అంతే. వారి ఇతర యంత్రాలూ అంతే. ఒక జపాన్ వాడు ఎప్పుడయినా స్విట్సర్‌లాండ్ గడియారాన్ని కాని, అమెరికా కారుని కాని కొంటాడా, అనుకుంటూ వుంటాము ఎందుకు కొనాలి అసలు ? వాళ్ల సరుకే బాగున్నప్పుడు ? ఇక మన దేశంలోనా? ఇంకా హాయిగా యూరోపు, అమెరికాలలో పాతబడి పోయాయని వదిలేసిన వాటినే తయారు చేసుకుంటూ కూర్చుంటున్నాము. తయారీ కర్మాగారాలలో కానివ్వండి, ఆర్థిక శాస్త్రంలో కానివ్వండి ! ఒక భారతీయుడు తనకి నకిలీ వద్దు అసలే కావాలంటే తప్పేమిటి ? ఆ భారతీయుడు ఎంత చదువు రాని రైతు అయితే మాత్రం... తప్పెవరిదంటే, నకిలీ సరుకునీ, నకిలీ సిద్ధాంతాలనీ తయారుచేసే వాళ్ళదే. రాజకీయ వాదుల సంగతి సరే సరి. వీళ్ళలో కొందరు స్వదేశీని గురించి ఊకదంపుడు ఉపన్యాసాలు చేస్తారు. తమ ఇళ్లని మాత్రం టోక్యో, హాంకాంగ్‌లలో తయారయిన సరుకుతో నింపుతారు — వాళ్ళకి దిగుమతి అయిన మెర్సిడీస్ కారులో వెడితేనే గొప్ప, స్కాచ్ విస్కీ తాగితేనే గొప్ప !

# కోరిక

## పాలకోడేటి సత్యనారాయణ రావు



కరడుగట్టిన హృదయంతో దారిదోపిడీలు చేసినవాడు క్షణకాలంలో మంచివాడయి, చెట్టుమీది పిట్టలపట్ల జాలితో 'మానిషాద !' అంటూ కవిత్వంచెప్తాడని ఎవరూహించారు ? శోకంతోశ్లోకం పెల్లుబికిరావటం ఆ మనిషి మనీషిగా ఎదగటంలోని ఓ అవస్థ. ఆ తర్వాత వాల్మీకిగాథ మనకెంతో సుపరిచితంఅయింది. ఆయన రాసినకావ్యం పారాయణగ్రంథం అయింది.

వనమాలినిచూసినపుడు నాకు ఆ వాల్మీకే గుర్తుకొచ్చాడు. లేకుంటే వనమాలిఏమిటి, వేదాంతం చెప్పడంఏమిటి ?

వేదాంతం చెప్పగలిగేవాడికి, పోనీ, చెప్పే వాడికి కొన్నిఅర్హతలుఉండాలని రూలేమీలేదు, ఉన్నట్టూలేదు. ఈ రోజుల్లో, రోజుకో స్వామీజీయో, ఇద్దరో ముగ్గురో బాబాలో అక్కడో ఇక్కడో ఆవిర్భవిస్తున్నట్టు మన కెన్నోవార్తలుదాఖలాలు ఉంటున్నాయి. 'గీత' బాగుండి కొందరు, వారి 'చేత'లుబాగుండి మరికొందరూ పాంకోళ్లలో పాదవారులై తిరగాల్సినవాళ్లు హెలికాప్టర్లలో సంచారం చేసేస్థితికి ఎదిగిపోతున్నారు. ఆ తర్వాత వారేదిచెప్పినా, దానికి పేరుమాత్రం అటు వేదాంతమో, ఇటు ప్రవచనమో అయిఉండి తీరాలి. ఇంతఎత్తుకు ఎదిగేందుకు ఆస్వాముల వాళ్లు జీవితంలో ఎంతకృషిచేశారో, ఎన్ని పరీక్షలలో కృశించారో నాకుతెలీదు.

వనమాలిమాత్రం ఈ స్థితికి ఎదిగేందుకు ఎంతగానో కృషిచేశాడు. బోలెడంతజీవితాన్ని, బోలెడురూపాయిల్ని త్యాగంచేశాడు. ఆఖరికి.. ఆఖరికి... ఏం మిగిలింది— ఏమీ మిగలదనే వేదాంతం మిగిలింది !

చాల రోజులక్రితం వనమాలి నా దగ్గరికి వచ్చాడు. ఆ రోజు ఆదివారం. సెలవుకావడంతో బద్ధకంతో పెరిగినగెడ్డంతో ఈజీ ఛెయిర్‌మీద కాళ్లు బార్లాజాపుకొని పేపర్లోని అనుబంధంలోని విశేషాలు చదువుకొంటున్నాను. వనమాలిరావటంతోనే మా ఆవిడ కాఫీఇచ్చింది. ఆ కాఫీ సిప్పింగ్‌అయిపోయాక, వనమాలి ముంతతీసి బయటపెట్టాడు.

''చిన్నసాయం చేసిపెట్టాలిరా !''అన్నాడు వనమాలి. చెప్పమన్నాను. అది చిన్నసాయం కాదనిపించింది, వాడు చిన్నసాయం అనేఅన్నా! ఒక చిట్‌ఫండ్‌కంపెనీలో చిట్ తీసుకొంటాడట. దానికి నేను 'మావాడు తప్పకుండా తీర్చేస్తాడంటూ గ్యారంటీఇవ్వాలిట. పేరుకు అది గ్యారంటీయో, షూరిటీయో అయినా నిజానికి అది ఆ'అప్పు' నేనుతీరుస్తానని ఒప్పుకోవటమే అవుతుందని నాకు తెలుసు. అదే అన్నాను నవ్వుతూ.

''కావాలంటే ఓ అయిదువందలు అప్పుగా ఇస్తాను. తీసుకెళ్ళు. తీర్చకు ! ఫర్వాలేదు. కానీ, ఇదేమిట్రా...!

వనమాలి అలాకాదన్నాడు. ''నేను ఇంకా చిట్ తీసుకోలేదు. నువ్వు ఊ అంటే చేరతాను, ఏనెలవస్తుందో తెలీదు వచ్చేనెల అయినా, నలభయ్యవ నెలైనాసరే షూరిటీ మాత్రం ఇస్తానను !''

ఊ అన్నాను. వనమాలితో ఉన్నచనువు, పరిచయం అలాటివి. ఆ తర్వాత అడిగాను: ''ఏం చేస్తావురా ఆ డబ్బుతోటి ?'' అంటూ.

అటు తలుపుపక్కన నా శ్రీమతివింటోంది అతిశ్రద్ధగా, ఏం చెప్తాడోనని. వనమాలి అలా వెళ్ళిపోగానే ఇలా నామీద విరుచుకుపడేందుకు సిద్ధంగాఉంటుంది— 'చూశారా, వీరికి వనమాలి అన్నయ్యసైతం...' అంటూ మొదలుపెట్టి, ఈ దేశంలో నాఅంత పనికి రానివాడు ఇంకోడులేడని తీర్మానించేస్తుంది. అది నాపైన అభిశంసనేఅయినా నేనూ ఆ తీర్మానానికి ఆ క్షణంలో తలవంచక తప్పని స్థితి అవుతోంది.

''ఫ్రిజ్ కొందామనుకొంటున్నానురా !''

ఉలిక్కిపడ్డాను, సరిగ్గావేవిన్నానా? రిఫ్రిజిరేటరా ? ఎందుకు ??

"ఎందుకంటే ఏం చెప్పను? దానివల్ల ఉన్న ఉపయోగాలు అన్నా, ఇన్నా?...వారానికి ఒక్కసారి కూరలు ఏ మార్కెట్‌కోవెళ్లి తెచ్చుకొంటే ఇంక మళ్ళీ ఓ పదిరోజులవరకూ చూసుకోనఖ్ఖర్లేదు. వారం కూరలే అయినా ఒకసారికొంటాం కాబట్టి, అవి పదిరోజుల వరకూ వస్తాయి. బోలెడంతడబ్బు ఆదా, పైగా కూరలన్నీ వాడిపోకుండా ఉంటాయి!"

నవ్వొచ్చిందినాకు.

"నువ్వు మాంసమైనా తినవుగదరా, నిలవ చేసుకోవటానికి? ఆఖరికి గుడ్లుకూడా మాంసాహారమే అంటావునువ్వు. నీకు ఫ్రిజ్ అంత ఉపయోగపడదేమో!" అన్నాను నేను.

వనమాలి ఒప్పుకోలేదు "అబ్బే, నేనెంతో ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చానురా!" అన్నాడు.

సరే, ఎవడిగొడవ వాడిది అనుకొన్నాను. సరి పెట్టుకొన్నాను. పైగా నిశ్చింతగానూ నిట్టూర్చుకొన్నాను వనమాలి 'ఫ్రిజ్'అన్నాడు కాబట్టి సరిపోయింది అదే, ఏ ఇంటిస్థలమో అనిగాని అనిఉంటే నా దుంపతెగిపోయిఉండేది పదేళ్లుగా ఉద్యోగంచేస్తున్నా పనికివచ్చేపని ఒకటీచెయ్యలేదని మా ఆవిడ నాకు రోజుకో సారిఅయినా సర్టిఫికేట్ ఇస్తుంటుంది. 'పనికివచ్చేపని'అంటే స్థలంకొనటం ఒక్కటే నని ఆవిడగారి నిశ్చితాభిప్రాయం.

"ఏం చేస్తారండీ ఫ్రిజ్‌తోవాళ్ళు!"అంది సుశీల ఆశ్చర్యంతో, వనమాలి వెళ్లిపోయాక.

"ఏం చేస్తారేమిటి మొదటిసారి వెళ్ళినపుడు బహుశా ఏ ఐస్‌క్రీమో ఇస్తారు రెండో సారి కూల్‌డ్రింక్ పేరిట చన్నీళ్ళు ఇస్తుండొచ్చు. ఆ తర్వాత... 'ఏమిటో, ఈ కరెంటుతో ఒకటే గొడవగాఉంది. ఎపుడూ లోవోల్టేజీయే...'అంటూ ఉపన్యాసంఇస్తాడు!" అన్నానునేను నవ్వుతూ.

సుశీలకూడా నవ్వేసింది.

ఓ రెండు మూడు నెలల తర్వాత వనమాలి చిట్‌ఫండ్ కంపెనీవాళ్ళ షూరిటీ పేపర్లతో వచ్చాడు సంతకం పెట్టమంటూ. "త్వరగానే వచ్చేసిందే!"అన్నాను నేను ఆ కాగితాలమీద సంతకాలు పెడుతూ.

"సర్లే, త్వరగావచ్చిందంటే రాదూ, రెండొందలు అమ్ముకొంటేను!" అదేమిటన్నాను.

"ఈ నెల ఇంకోరెవరికోవచ్చింది. నాకు మార్పిడీచెయ్యటానికి రెండొందలు అడిగారు, ఇచ్చాను!"

"కానీ అంతనష్టపోవటం...?"

"నష్టమేమిటి, నాన్సెన్స్! ఇపుడు ఏనెల? జనవరికదా! ఫిబ్రవరి నెలాఖరు రోజును మర్చిపోయావేం? ఆ రోజును నేను మాత్రం మర్చిపోలేదు."

"ఏమిటి, నీ బర్త్‌డేయా కొంపదీసి?"

"ఛ, అదేంకాదు, ఆరోజే బడ్జెట్‌ను పార్లమెంటులో పెట్టేది అంటే ఏమిటి? మేము అన్నిటిమీదా పన్నులుపెంచుతున్నామని దండోరావేసి చెప్పటమన్నమాట! మిగతా అన్నిటిమాట ఎలాఉన్నా, రిఫ్రిజిరేటర్‌మీద ఎంతలేదన్నా ఓ రెండు వందలన్నా వేస్తారు పన్నులు ...!"

ఉలిక్కిపడ్డాను. రెండొందలా?

"ఆ—అసలే అది లగ్జరీ అయిటం. దాని మీద ఎక్సైజు అని, సేల్స్‌టాక్స్ అనీ, డ్యూటీఅనీ, లోకల్‌టాక్సులనీ..." 'నేను వినటం మానేశాను. అయినా మనసు చావ లేదు. మరోసారి ప్రయత్నించి చూడమంది. చిన్నగా అన్నాను— "లగ్జరీ అంటున్నావ్‌కదా, మరి నీకెందుకురా?"

వనమాలి నవ్వాడు. "పెద్ద పెద్ద లగ్జరీలు ఎన్నో ఉన్నాయి దేశంలో. కొందరికి ఫ్యాక్టరీలు ఉన్నాయి కొందరికి విమానాలు వున్నాయి. మరికొందరికి ఓడలున్నాయి. ఇంకొందరికి లంకంత ఇళ్ళున్నాయి నేను ఇవేవీ అడగటంలేదు ఆఫ్టరాల్, నాలుగు... నాలుగున్నర వేలు పెడితే వచ్చే ఓ ఫ్రిజ్." అంటూ వనమాలి అన్నిరకాల ఫ్రిజ్‌ల రేట్లూ, వాటిలో వుండే తేడాలూ చెప్పటం ఆరంభించాడు.

నిజమే, వనమాలి అన్నట్లు ఇది చిన్న కోరికే. కొందరికి ఇళు కట్టుకోవాలని, కొందరికి నోట్లు నింపుకోవాలని...ఇంకా కొందరికి రోజూ అయిదారు సీసాలు తాగాలని ...జిహ్వాకోరుచి... వనమాలికీ కోరిక...పోనీ, తీరిపోతోంది గదా అనుకొన్నాను, అన్నాను కూడానూ!

"థాంక్స్‌రా — ఇంకో పది, పదిహేను రోజుల్లో మళ్ళీకలుస్తాను. పార్టీకి పిలుస్తాను. ఫ్రిజ్‌లోంచి తీసి..." నవ్వేశాడు వనమాలి.

వాడు అన్న పది పదిహేను రోజులూ గడిచిపోయాయి. నెల రోజులూ గడిచి పోయాయి. వనమాలి ఏదో హడావిడిలో వుండి వుంటాడని నేను పార్టీ విషయం అడగలేదు. మార్చినెల వచ్చేసింది. వేసవి ఆరంభం అయింది.

ఎండల్ని చూస్తుంటే వనమాలి మంచి పనే చేశాడనిపించింది. ఎండలో తిరిగి ఇంటికి రాగానే గుక్కెడు చల్లటి అయిస్ వాటర్ తాగగల్గటం అదృష్టమే అనుకొన్నాను.

సుశీల చిన్నగా అందోరోజు: "మీ వనమాలి ఇంటికి వెళ్దాద్దామండీ! వెళ్లి కూల్‌డ్రింక్ తాగివద్దాం!"

సరేనని, వాడు పిలవకపోయినా పయనం కట్టాం. ఆప్యాయంగా పలకరించాడు, ఆదరంతో మాటాడాడు. కానీ ఎంతైనా కూల్‌డ్రింక్ ఇవ్వలేదు. ఫ్రిజ్‌నూ చూపించ లేదు. వీడ్కోలు తీసుకొంటూ అడిగేశాను "ఏదిరా, నీ ఫ్రిజ్ చూపించనే లేదు!..."

వనమాలిముఖం చిన్నబోయింది తమాయించుకొంటూ అన్నాడు: "సారీరా, నీకు చెప్పనే లేదూ గదా! ఆ డబ్బుతో నేను ఫ్రిజ్ కొనలేదు!"

"మరేం చేశావ్ అంత డబ్బునూ!"

"సూర్యం స్కూటరు కొనుక్కుంటానంటే ఇచ్చేశాను!"

ఆశ్చర్యపోయాను-సూర్యం అంటే వనమాలి వాళ్ళ చిన్నాన్న కొడుకు మొగుడూ పెళ్లాం ఇద్దరూ వుద్యోగాలు చేస్తున్నా ఇంకా వాళ్ళకు దరిద్రమేనేమో! ఆఖరికి వనమాలి దగ్గర చేరారు. ఆ డబ్బు ఇక వస్తుందనుకోవటం వనమాలి తెలివి తక్కువతనం.

"వాడు అలాంటి వాడు కాదురా, ఇచ్చేస్తాడు." అన్నాడు వనమాలి,

కానీ సూర్యం నా మాటానూ, ఇటు వనమాలి మాటనూ రెంటినీ అబద్ధం చేసి పారేశాడు రెండు వేలవరకూ తీర్చి ఆ తర్వాత సూర్యం ఎగనామం పెట్టేశాడు. ఎటొచ్చీ ఇంకా ఆ మాట ఇంకా స్పష్టంగా అనలేదు. 'ఇదిగో ఇస్తా' 'అదుగో ఇస్తా' నంటూ ఆఖరికి నెత్తిమీద కొంగుపర్చటం చాల మందికి వెన్నలో పెట్టిన విద్య! ఆ సంగతి నా కెవరూ చెప్పనక్కర్లేదు అయిన వాళ్లకే డబ్బు అప్పిచ్చి, ఆఖరికి ఆ దౌర్భాగ్యులు నాడబ్బుతో స్థలాలుకొనుక్కొని కులకటం నా జీవితంలోనే ఓ అధ్యాయం!

-రెండేళ్లు గడిచాయి. వనమాలి నెలనెలా చిట్ కడుతూనేఉన్నాడన్నది నాకుతెలుస్తోంది.

వనమాలి ఇపుడు రెండోచిట్ కడుతున్నాడు. జీవితంలో రవ్వంతడబ్బును ఒకేసారిచూడాలంటే చిట్ప్రకుమించిన అవకాశం లేదని వనమాలికి అర్థంఅయింది. అందుకే

## కోరిక

ఓ పూటతినీ, మరోపూట తినకా అన్న వద్ద తిలో డబ్బు నిలువవేస్తున్నాడు.

రెండోసారి చిట్‌కు నేనే షూరిటీ ఉన్నాను. వనమాలిమీద నాకు నమ్మకం పెరిగింది, అవస్థలుపడిఅయినా అన్నమాట నిలబెట్టుకొంటాడని!

"ఈరోజే చెక్ ఇస్తామన్నారు సాయంత్రం అట్నుంచి అలాగేవెళ్లి..." నాకుతెలుసు వనమాలి కోరిక!

వాడు ఈసారైనా అది తీర్చుకోగలిగితే సంతోషించేవాడిని నేనే!!

ఆ రోజు మధ్యాహ్నమే వనమాలికి ఇంటినుంచి ఫోనొచ్చింది, అర్జెంటుగా ఇంటికి రమ్మంటూ!

"ఏమిటట సంగతి?" అనడిగాను.

"చెప్పలేదు ఎవరోచేశారు ఫోన్ ఏముంటుంది, ఎవరో వచ్చిఉంటారు ఇంటికి!" అన్నాడు వనమాలి "అయినా అర్జెంటు అంటున్నారుకదా, వెళ్తున్నాను!"

వనమాలి మూడురోజులతర్వాతే మళ్లీ ఆఫీసుకువచ్చాడు— ఆ రోజు ఆఫీసునుంచి అర్జెంటుగావెళ్లటం అదృష్టమన్నాడు. ఇంటికి వెళ్లేసరికి వనమాలిభార్య రుక్మిణి కడుపునొప్పంటూ ఒకటేగోలట! ఆస్పత్రికి తీసుకెడితే అపెండిసైటిస్ అన్నారట. వెంటనే ఆపరేషన్ అవసరమంటే వనమాలి 'ఊ'అన్నాడు.

అంతే—

నాకు మిగిలినకథంతా అర్థమయిపోయింది! అయినా వనమాలిని నేనేమీ అడగనేలేదు.

వనమాలి నెలనెలా చిట్స్ కడుతూనే ఉన్నాడు, కోరికలగుర్రానికి కళ్లాలు లాగుతూనే ఉన్నాడు

ఉండబట్టలేక ఈ మధ్యనే వనమాలి కనిపిస్తే అడిగాను నేను నవ్వుతూ; "ఏమయింది నీ ఫ్రిజ్?"

వనమాలి నవ్వేశాడు "నీ కసలు బొత్తిగా బుర్రలేదురా! మనవేమిటి మధ్యతరగతి జనాలం! మనకెందుకు చెప్పు ఫ్రిజ్? ఏం చేస్తాం? మనం తాగుడుకు అలవాటుపడ్డ వాళ్లం కాము. మాంసం తినం, గుడ్లు ముట్టం. కూరలంటావ్ — రోజూ తాజాగా ఎందరో కూరలు అమ్ముతుంటే వాటిని కాదని, వారానికి ఒకసారి తెచ్చుకుని నిలువ వేసుకొని తినటం ఏం తెలివైన పని? అసలు నన్ను అడిగితే ఫ్రిజ్ అంతటి దండగ వస్తువు ఇంకోటి లేనేలేదు...!".

— వనమాలి ఇపుడు వేదాంతం చెప్తున్నాడు. తనకు అందని పళ్ళన్నీ పుల్లనివే అంటున్నాడు. తాను అందుకోలేనిది పనికిమాలినదేనని ఆత్మవంచన చేసుకొంటున్నాడు!

కోరికలు పెంచుకోవటంలో, వాటిని సాధించుకోవాలనుకోవటంలో తప్పులేదు. సాధించుకోలేనపుడు మాత్రం వేదాలు వల్లించడం మాత్రం తప్పనిపిస్తోంది. కానీ ... వనమాలి మామూలు మనిషి. తన మనసుకు తానే సమాధానాన్ని చెప్పుకుంటున్న అతి సాదా మనిషి!!

వనమాలి అంటున్నదానిలో తప్పేమీ నాకు కనిపించటంలేదు.

— ఆ రోజు సాయంత్రం ఓ చేతో తాజా కూరలు నిండిన సంచీతో, మరోచేతో కూజాతో ఇంటికొస్తున్న వనమాలిని చూస్తే నాకు కళ్లల్లో నీళ్ళు తిరిగాయి!!

### జీతం – జీవితం

ఎన్నిరాళ్లు
వచ్చినా
చాలని
పెంచనిది
జీతం.
ఎన్నిఏళ్ళు
వచ్చినా
చావాలని
పెంచనిది
జీవితం.

### డబ్బు

అన్నిటిని
కొనడానికని
తన్ను
సృష్టించిన
మనిషినే
తాను
కొంటున్నది
డబ్బు
అదే
దానికున్న
జబ్బు.

"జోశ్యభట్ల"

విద్యార్థి లోకం వ్యాసరచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

విద్యార్థి – అంటే అర్థం "విద్యను అర్జించేవాడు" అని. విద్యార్థి జీవితంలో 4 దశలు ఉన్నాయి. అవి పదవ తరగతి వరకూ మొదటి దశ, ఇంటర్మీడియేట్ రెండవ దశ, డిగ్రీ చదువులు మూడవ దశ, పి. జి. కోర్సు చదవడం నాల్గవ దశ. ఇంచుమించుగా మొదటి దశ పూర్తయేవరకు విద్యార్థికి ఏ విధమైన ఆశయాలు ఉండవు.

అసలు "ఆశయం" అంటే ఏమిటి ? అనే విషయం ఇప్పటి విద్యార్థులలో చాలమందికి తెలియదు. (నిజానికి దాని అర్థం నాకూ పూర్తిగా తెలియదు). ఆశయం అంటే ఒక ప్రతిజ్ఞ. "జీవితంలో ఇది సాధించాలి" అని అనుకోవడమే ఒక ఆశయం.

ప్రతి విద్యార్థికి ఏవో కొన్ని ఆశయాలుంటాయి. అసలు ఈ ఆశయాలు ఎప్పుడు ఎలా ఏర్పడతాయి ? అనే విషయం ఆలోచించితే అది ఎక్కువగా రెండవ దశలోనే జరుగుతుంది. ఎందువలనంటే ప్రతీ విద్యార్థికి ఆ వయస్సులోనే లోకం గురించి తెలియడం ఆరంభమవుతుంది. "ఆలోచన" అనే పుష్పం వికసిస్తుంది. ఆ ప్రథమ వికాసంలో విన్న మాటలు, చూచిన సంభవాలు మొదలగునవి మనస్సునందు ముద్ర పడతాయి వాటి గురించి ఆలోచించిన తీవ్రాలోచనలే జీవితాశయాలుగా మారతాయి. ఆ ఆశయాలే జీవితాన్ని ఒక మలుపు త్రిప్పుతాయి అదే భవిష్యత్తుకు తొలి మైలురాయి. కనుక ఈ దశ జీవితంలో చాలా మెలకువగా యుండాల్సిన దశ.

ఆశయాలు చాలా రకములు అందు ఒక్కొక్క విద్యార్థికి ఒక్కొక్క విధమైన ఆశయాన్ని కలిగియుండి, ఆ ఆశయసిద్ధి కోసం ప్రయత్నించుతూ యుంటారు. కొందరు ఏవో పెద్ద పెద్ద చదువులు చదివి పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయాలనుకొంటారు. కొంతమంది తాము చదివి ఏదో ఒక ఉద్యోగం సంపాదించి తనని కని, పెంచి, పెద్దచేసిన తలిదండ్రులను కష్టాల బారినుండి తప్పించాలి, వారిని పోషించాలి, అని యనుకుంటారు. కొంతమంది ప్రజాసేవ చేయాలనీ, కొందరు తమ కళ్ల ముందు జరిగే అన్యాయాల్ని అరికట్టాలనీ అనుకుంటారు ఎటువంటి పనైనా చేసి డబ్బు సంపాదించడమే జీవితాశయంగా పెట్టుకొన్నవారు యున్నారు. ఎట్టి ఆశయాలు లేకుండా ఏది జరిగితే అది మన "ఖర్మ" లేక మన "అదృష్టం" అని భావించి కాలానుగుణంగా నడిచేవారుకూడా ఎక్కువ. ఇలా చూస్తూపోతే చాలా రకాలైన ఆశయాలు కనిపిస్తాయి. ఇటువంటి ఆశయాలు "ప్రేమ" విషయాలలో "కులమతము"ల విషయాలలోనూ కూడా చాలా ఎక్కువగా యుంటాయి.

ప్రతీ ఆశయానికి ఇంచుమించుగా ఏదో విధంగా ఏదో ఒక అడ్డు ఉంటూనే వుంటుంది ఎక్కువగా చదువుకొని పెద్ద పెద్ద ఉద్యోగాలు చేద్దామనుకున్నవారికి ఆర్థికంగా బలం లేకపోవచ్చు. వారికి కాస్త ఉన్నవారు (ధనికులు) సహాయం చేసి వారిని పైకి తీసుకువచ్చి వారి ఆశసిద్ధికోసం సహాయపడితే చాలా బాగుంటుంది, వారి ఆశయం నెరవేరుతుంది. కాని ఈ రోజుల్లో ఆ విధంగా సహాయం చేసేవారు చాలా తక్కువ కాలేజీల్లో సీట్లకోసం డొనేషన్ కట్టాలి, అన్నపుడు ఆశయసిద్ధి కోసం ఎంతో కష్టపడి చదివి మార్కులు సంపాదించిన విద్యార్థులు డొనేషన్లు కట్టే ఆర్థిక స్థితి లేక సీట్లు సంపాదించలేక పోతున్నారు. దానితో వారు వారి ఆశయాలకు స్వస్తిచెప్పి తమకు ఇష్టంలేని చదువులు చదివి ఇష్టంలేని పనులు చేస్తూ నిరుత్సాహంగా జీవితాంతం బాధపడుతూ వున్నవారు ఇప్పుడు ఎంతోమంది యున్నారు అలాగే ఉద్యోగ విషయంలో కూడా ఎంతో కష్టపడి చదివి ఏదో ఒక వుద్యోగం చేస్తూ తమ తల్లిదండ్రులను పోషిస్తూ వారి కష్టాలని తీర్చుదామని ఎంతో విధిగా అనుకుంటారు కాని చదువులు అయిన వుంటనే ఉద్యోగం వస్తేకదా వారి ఆశయం నెరవేరేది ! వారి తలిదండ్రులు సుఖపడేదీను ఈ రోజుల్లో డబ్బు (లంచం), సిఫారసులు ఉద్యోగాలకు విద్యార్హతలకంటే ముఖ్యార్హతలుగా పరిణమిస్తున్నాయి కనుక ఇప్పుడు లంచంకోసం డబ్బు, సిఫారసులు లేనివారు ఉద్యోగం దొరకక వారి ఆశయం నెరవేరక ఎంతోబాధపడుతూన్నవారుఎంతోమంది యున్నారు. ఆ బాధ తాళలేక జీవితంపై విరక్తి కలిగి "ఆత్మహత్య" చేసుకుంటున్న వారు కూడా అధికంగానే యుంటున్నారు. ఇకపోతే ప్రజాసేవ చేయాలనుకొనేవారికి, అన్యాయాల నరికట్టాలనుకొనేవారికి వచ్చే ఆటంకాలు అన్నింటిలోనూ ఎక్కువగా యుంటాయి. ఈ విషయం అందరికీ తెలిసినదే మరియు సమాజంలో జరుగుతున్నదే. ఇటువంటి మంచిపనులకు అదృశ్యంగా అడ్డకట్టలు వేసేవారిలో రాజకీయవాదులదే పైచేయి. ఇంక "ప్రేమలు," "కులమత" విషయాలలో వచ్చే అడ్డంకులు ఇంచుమించుగా అందరికీ తెలిసినవే. అవి ఎక్కువగా ఎవరి ఇండ్లలో వారికే వస్తూ యుంటాయి. ఈ విధంగా ప్రతి ఆశయానికి ఎన్నో విధాలైన అడ్డంకులు ఉండనేయున్నాయి

కనుక వాటికోసం బాధపడుతూ కూర్చునేకంటే వాటికి పరిష్కారమార్గం ఆలోచించాలి. మన విద్యార్థిలోకం యొక్క ఆశయాలను నెరవేర్చుకోవాలి అంటే, వస్తున్న ఆటంకాలను పరిష్కరించుకోవాలి యంటే ముందుగా మన దేశంలోగల ధన వ్యామోహం, లంచగొండితనం, పక్షపాతబుద్ధి, కులమత బేధం మొదలుగాగల అన్యాయాలను అరికట్టాలి. వీటిని అరికట్టాలంటే విద్యార్థులు ఐకమత్యంతో మెలుగుతూ ఎందరో రాజకీయవాదులు చూపే ఆశలకు లొంగిపోకుండా, బెదిరింపులకు భయపడకుండా మన ఆశయాలను గుర్తుపెట్టుకొని విడిపోకుండా ఆశయ సిద్ధికోసం పోరాడాలి. అటుల జరిగినపుడే మనం మన ఆశయాలను పూర్తిగా కాకున్నా కొన్నైనా నెరవేర్చుకోగల అవకాశం ఏర్పడుతుంది. ★

## రచయిత పరిచయం



"పూర్తిపేరు చిందిరాల వెంకటరమణ. స్వస్థలం రాజమండ్రి. ఇంటర్మీడియేట్ వరకూ రాజమండ్రి ప్రభుత్వ జూనియర్ కళాశాలలో చదివి కొన్ని కారణాల వలన కాలేజీకి సరిగా హాజరు కాకపోగా పరీక్షలు వ్రాయడానికి అనర్హుడనైతిని. పరీక్షలు వ్రాయడానికి అనుమతి కోసం బోర్డు ఆఫ్ ఇంటర్మీడియేట్ వారికి ధరఖాస్తు పెట్టుకొని అనుమతి కోసం ప్రయత్నించుచున్నాను. ప్రస్తుతం గోదావరి ఖనిలో మా బంధువులైన శ్రీ గనిరాజు, డిప్యూటి చీఫ్ మైనింగ్ ఇంజనీర్ గారి ఇంటిలో యుంటూ ఉద్యోగ ప్రయత్నం కూడా చేస్తున్నాను.

ఆటలు ఆడటం, కలం స్నేహం, క్రికెట్ కామెంట్రి వినడం, రచనలు చేయడం, నవలలు, పత్రికలు చదవడం అలవాట్లు. సంగీతం, ప్రకృతి ఆరాధన అభిరుచులు."

— చిం. వెంకటరమణ

(గత సంచిక తరువాయి)

జుట్టు వదలి రిబ్బనే కట్టుకుంది. చరునవ్వుతో వచ్చిన లక్ష్మిని చూసి అబ్బుర పడ్డారు అంత అందంగా ఉంటుందని అనుకోని అంధులు. లక్ష్మి రాగానే రవిచంద్ర లేచాక గోపి కూడ లేచాడు. కమల కూడా పైకి నిలుచో బోతుంటె లేవద్దు అన్నట్లుగా కమలను పట్టుకుని ఆపింది. పరిచయాలు, నమస్కారాలు జరిగాయి. లక్ష్మి కూర్చున్నాక మగవాళ్ళిద్దరూ కూచున్నారు. మాలిన్యం లేని చిరునవ్వు నవ్వుతూ వారివైపు చూసింది. సాహిత్య వైపు చూపునిలిపింది. ఆ కన్నులు చక్కని దృశ్యం చూస్తున్నట్లుగా ఉంది. సాహిత్య హృదయంమాత్రం ఏ భావం లేకుండా తిమ్మిరెక్కినట్లుగా ఉంది. లక్ష్మి అందంగా ఉండడం తనకు ఇష్టం లేనట్లుంది. కాని ఒక్క అందమే మనిషిని ఆకట్టుకోలేదు. అది తాత్కాలిక ఆకర్షణ మాత్రమే ఆమె గుణగణాలు ఎలాంటివో ఎంత అందమయినా కరుకుదనంలో కరిగిపోతుంది. కాని, లక్ష్మి మందహాసంలో మాలిన్యం లేదు. మాట తియ్యగా ఉంది. మంచి మనసు, మెత్తని గుండె గల భార్య ఉన్నప్పుడే, పెలవురోజు భర్త ఆనందంగా ఉండ గలుగుతాడు. ప్రసన్న వదనంతో ఆనందం రవిచంద్రలో స్పష్టంగా కొట్టవచ్చినట్లు కానవస్తున్నాయి. లక్ష్మి ప్రియమయిన భార్య అని, వారి దాంపత్యం వేరేగా చెప్పనవసరము లేదు. వసంతంలో వనంపుష్పించినట్లు వీరి సంసారం ఉంది అని గోపి, కమల అనుకున్నారు. 'సార్' మిమ్మల్ని, మీ స్వీట్ హోంను చూస్తూంటె, మీ పర్సనల్ జీవితం గురించి వేరే ప్రశ్నలు వేయనవసరం లేదు. మీరు ఇంతవరకు ఎన్ని నవలలు, ఎన్ని కథలు వ్రాశారు? ఎప్పుడు వ్రాశారు? మీకు మూడ్ అనేది కావాలా! లేక ఎప్పుడంటె అప్పుడు పది మందిలో ఉండి కూడ కథలు వ్రాస్తారా? కథ వ్రాయిడానికి మీ ఇన్‌స్పిరేషన్ ఎవరు? ఎప్పటినుంచి వ్రాస్తున్నారు. మీ పేరు రొమాంటిక్‌గా చక్కగా ఉన్నప్పుడు 'పతి' అని కలం పేరు ఎందుకు పెట్టుకున్నారు. ........."

లక్ష్మి పక పక నవ్వింది. ప్రశ్నలు వర్షం కురవడం అంటె ఏమిటో ఇప్పుడు తెలిసింది అంటూ నవ్వింది. "మీ జ్ఞాపకశక్తి ఎంత వరకుందో వరుసగా జవాబులు చెప్పండి." అని గోపి అన్నాడు. "వయస్సు వస్తుంది కదా, జ్ఞాపకశక్తి తక్కువయింది. అందుకే ఎన్ని కథలు మరెన్ని నవలలు వ్రాశానో గుర్తులేదు. లక్ష్మికి తెల్సు, మగవాళ్ళకంటె ఆడవాళ్ళకి జ్ఞాపకశక్తి ఎక్కువ. అందుకే వారికి ఎప్పుడు ఎక్కడ అన్యాయం జరిగింది. భర్త ఎప్పుడు కోపం చేసుకున్నది, ఎప్పుడు తిట్టాడు, అత్తగారితో




ఎప్పుడు ప్రేమగా మాట్లాడింది, తన చీరకంటే ఆడబిడ్డ చీర, రంగు, నాణ్యం మంచిదిగా తెచ్చాడు, ఇత్యాదులు చాలా చక్కగా జ్ఞాపకం పెట్టుకుని వృద్ధాప్యంలో వృద్ధుడయిన మామయ్యను అప్పుడిలా చేశావే, ఇప్పుడిలా చేశావే అంటూ దెప్పిపొడిచేది సూర్యకాంతం లాంటి అత్తయ్య. సాధించేది–" అని చెప్పి సహజంగ అతని ఇన్‌స్పిరేషన్ "అతని భార్య అయి ఉంటుంది" – అని గోపి అనుకున్నాడు లక్ష్మివైపు చూస్తూ "నా ఇన్‌స్పిరేషన్ మా రాజా. . వాడితో తగువు పెట్టుకుంటేగాని నాకు మూడ్ రాదు. వాడిమీద నాకు వచ్చిన కోపాన్నిబట్టి వ్రాస్తాను. కోపం పెద్దదయితే ఒకరి జీవితం చిత్రించక తప్పదు. ఎటూ కథ పెద్దదవుతుంది కాబట్టి దానికి సంఘం, వాతావరణం, వర్ణన, మరి కొందరి పాత్రల జీవిత భాగాన్ని జోడించి నవల వ్రాస్తాను."

ఇంటర్వ్యూలో కూడ సస్పెన్స్ అంటూ కమల నవ్వింది. "ఎప్పటినుంచి వ్రాస్తున్నానంటె నాకు వూహ తెలిసినప్పటినుంచి వ్రాస్తున్నాను. అంటే నాలో నేను ఏవో కథలు, అల్లుకుని కల్పించుకుని కలలు కనేవాడిని చిన్నప్పుడు. నేను సాహసవంతమయిన పనులు చేసి రాజకుమారిని రక్షించి పెళ్ళి చేసుకున్నట్లు ఓ కథను అల్లి స్నేహితులకు చెప్పేవాడిని. లక్ష్మికి పతిని అయ్యాను. అందుకే నా కలం పేరు 'పతి' అయింది." సంతోషంగా గోపి చప్పట్లు కొడుతూంటె కమల కూడ కలిపింది. కాని సాహిత్య మాటలు రానిదానిలా వుండిపోయింది. మర్యాదకయినా నోటివెంట కనీసం ఒక్కమాటయినా రాలేదు. మాకేమయినాపెట్టుతావా అన్నప్పుడు లక్ష్మి అలాగే అంటూ తల త్రిప్పి నపుడు తెల్లని రవ్వల ముక్కుపుడక తళుక్కున మెరిసింది. లక్ష్మి వంటగదిలోనికి వెళ్ళింది. తల్లివెంట వంటగదిలోనికి వెళ్తూ "ఎందుకు అందరు నవ్వుతున్నారు "డాడీ కోతలు కోస్తున్నాడా" అన్నాడు. డాడీని అలా అనవచ్చా తప్పుకదూ. మీ డాడీకి ఇన్‌స్పిరేషన్ నీవేనట! "అన్నీ అబద్ధాలే" నేను పుట్టక ముందునుంచి కథలు వ్రాస్తున్నాడని నీవే చెప్పావు" అంటూ వాడు వెళుతుంటె దబుక్కున చెయ్యి పట్టుకుని "కొంపదీసి ఆ మాట చెప్పటానికే వెళ్తున్నావా" అంది కళ్ళు పెద్దవి చేసి. తల్లి తడబాటు చూసి "యు లవ్ హిమ్ ఇమ్మెన్స్‌వ్‌లీ" కదూ అన్నట్లు చూచాడు "హి ఈజ్ మై లైఫ్ యు ఆర్ మై లైఫ్" అంటూ మోకాళ్ళమీద కూర్చుని కొడుకుని గుండెలకు చేర్చుకుంది లోనికి వచ్చిన రవిచంద్ర ఆ దృశ్యాన్ని చూచి అక్కడే నిల్చుండిపోయాడు. 'నేనంటె యిష్టమా! డాడీ అంటె ఇష్టమా!' అని బెదిరించి అడిగి ఉంటాడు వెధవ.

'నీవంటె ప్రాణం' అంటూ వాడికి బాగా తలకెక్కేలా చెప్పకూంటుంది అని అనుకున్నా ఆ దృశ్యం అతన్ని కదిలించి వేసింది. కన్నులు తడి అయ్యాయి అప్పడే వచ్చినట్లు శబ్దం చేస్తూ "లక్ష్మి! సారధి, అతని వైఫ్ వచ్చారు" అని చెప్పి "వ్హాట్ మాస్టర్" అన్నారు 'నథింగ్, ఐ. యు. సేవ్' అంటూ పెదవి విరిచాడు. ధీరజ్ జుట్టు సరిచేసి – బుగ్గ మీద శబ్దం చేస్తూ ముద్దు ఇచ్చింది. "ఐలైక్ యువర్ కిసెస్" అన్నాడు. వాడి బుగ్గ మీద నుంచి భర్త వైపు చూసింది. రవిచంద్ర మాయమైనట్లు వెళ్ళిపోయాడు 'థాంక్యూ' అంటూ నవ్వును కనబడనీయలేదు. గాస్‌స్టవ్ వెలిగించి పాత్ర పెట్టి ఫ్రిజ్‌లో ఉన్న పాలు తెచ్చివ్వమంది ధీరజ్‌ను. అమ్మకి వంట గదిలో సహాయం ఇష్టంగా చేస్తాడు. గిరిజ ఆంటీ అన్నట్లు అమ్మకి కూతురు, కొడుకు తనే కదా అనుకుంటాడు ధీరజ్. పాలు బాగా మరిగిన తర్వాత – ఒక పాకెట్ విప్పి అందులో పొడిని పాలలో వేసి బాగా కలియబెట్టి వాటిపై జీడిపప్పు, దాక్ష పెట్టింది. స్టీలు ప్లేట్లో వేసి – బిళ్ళలుగా కోసింది. సాసర్లలో సర్ది ట్రేలో పెట్టింది. ఆ ట్రేని ధీరజ్ తీసుకువెళ్ళాడు ఫిల్టర్‌లో కాఫీ డికాషన్ సరిపోతుందో లేదోనని చూచి – మరి కాస్త పొడి వేసి వేడి నీళ్ళు పోసి, మూతపెట్టి ఫ్రిజ్‌లో ఉన్న ఫ్రూట్స్ మరో ట్రేలో పెట్టి తను పట్టుకు పోయింది. "కొత్తరకం స్వీట్‌లా ఉంది, కాని రుచి తెలిసినట్లే ఉంది" అని గిరిజ అడిగింది – ఇప్పుడే చేసినట్లు తెలుస్తూంది. త్వరగా చేశారు, అని కమల అడిగింది, 'ఏమేమి వేశారు.' – "ఆ స్వీట్ అంటె పాలు, చక్కెర, నెయ్యి, మిఠాయి రంగు – మైదాపిండి కాకుంటె మరో పిండి" అని సారధి అన్నాడు.

'లక్ష్మి అలాంటిది ఏవి వేయలేదని, ధీరజ్ చెప్పాడు మరి' అని గిరిజ అంది. "అమ్మదొంగా! అప్పడే ధీరజ్‌ని అడిగేసిందన్నమాట." అని రవిచంద్ర అనుకున్నాడు. గిరిజ ఒకరి ఇంటిగుట్టు – పిల్లల దగ్గర – పనివాళ్ళ దగ్గర కాస్త కూస్త రాబట్టి విప్పడానికి మరి నాలుగు కలిపి వూహిస్తుంది. ప్రసారం చేస్తుంది. గృహవాణిలో ప్రసారం చేస్తుందికూడ. "మేడమ్ మీరుకూడ సస్పెన్స్‌లో

**జరిగిన కథ–8 :** రవిచంద్ర 'రచన' వార మాస పత్రికలో మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేస్తుంటాడు. అతనికి పి.ఎ. గా చేరిన సాహిత్య తన అభిమాన రచయిత రవిచంద్రను ఎంతగానో ప్రేమిస్తుంటుంది. అతనికి పెళ్ళయిందనీ, ఓ కొడుక్కి తండ్రి అనీ అతని ద్వారానే తెలుసుకొని విలపించిపోతుంది. సాహిత్య తను పనిచేసే పత్రిక ప్రొప్రయిటర్ గోపాల్‌రావ్ కూతురని ఆయన ద్వారానే తెలుసుకొంటాడు రవిచంద్ర. రవిచంద్రపై వున్న ప్రేమకొద్దీ తన సర్వస్వాన్ని అతనికి అర్పించడానికి సిద్ధపడిన సాహిత్యను చెడగొట్టడం అతనికి ఇష్టంలేదు. ఆమెకు ఎంత దూరంగా వుండాలనుకుంటున్నాడో అంతగా దగ్గరవుతుంటాడు రవిచంద్ర. రవిచంద్రకు ఓ కొడుకు వున్నాడని తెలిసిన సాహిత్యలో కోపం చెలరేగుతుంది. ఎలాగైనా అతన్ని తనవాడిగా చేసుకోవాలని నిర్ణయించుకొంటుంది.



పెట్టేస్తున్నారు.'' అని గోపి అన్నాడు ''అది 'బైనాగ్రాస్' చేయడం చాలా సులువు. ఇలా ఫ్రెండ్స్ వచ్చినపుడు మాటల్లోనే చేసుకోవచ్చు. పాకెట్స్ బజార్లో దొరుకుతాయి. తెచ్చి పాలలో కలుపుకోవడమే'' 'ఎంత నెయ్యి, పాలు, చక్కెర కొలతలు చెప్పండి' అని కమల అడిగింది ''అవేమి అవసరంలేదు. పాలు ఉంటె చాలు. రంగు కూడా వేయక్కరలేదు.'' నిజమా అన్నట్లు చూశారు అందరూ ఏదో ఒకటి మాట్లాడుకున్నా సాహిత్య నోరు మెదపక ఉంటె 'ఆమెగారికి తెలుగు రాదా!' అని కమలని గిరిజ అడిగింది. ''అన్నీ మీరే మాట్లాడేస్తుంటె నేనేమి మాట్లాడను'' అంది సాహిత్య. గిరిజ వచ్చిన దగ్గర నుంచి 'అలా చూడడం సభ్యతగ ఉండదు' అని తెలిసినా తననే తరచి తరచి చూస్తూంది. అసలే ఒళ్ళు మండుతూన్న సాహిత్యకు కారం పూసి నట్లయింది 'మరి వెళ్దామా' అని గోపి వైపు చూచింది. 'ప్రోగ్రాం ఉందా? తొందరపడుతున్నారు' అని రవిచంద్ర సాహిత్యను అడిగారు అతనుకూడా నేరుగ సాహిత్యతో మాట్లాడం మొదటిసారి వాళ్ళు తొందరపడుతున్నారని, వేడివేడిగా చిక్కగ, రుచిగా ఉన్న కాఫీ గ్లాసులలో తెచ్చి సర్వ్ చేసింది. నమస్కారాలతో వీడ్కోలు తీసుకుని వెళుతుంటె రవిచంద్ర, లక్ష్మి వారి గేటు వరకు సాగనంపి వచ్చారు. ''సినిమా ప్రోగ్రాం ఉంది టిక్కెట్లు తెచ్చాం'' అని గిరిజ అంది. ''తలకి రెండు టికెట్లు మా ఆవిడ కూడా క్యూలో నిలుచుంది' అంటూ జోక్ వేశాడు సారథి. 'అయితే భోజనం ఇక్కడే చేసి వెళ్ళాలి' లక్ష్మి అంది. లక్ష్మితో మాట్లాడుతూ గిరిజ లోపలికి వెళ్ళింది. గిరిజ వంటగదిలో తను అదీ, ఇదీ అందుకుని, సహాయం చేస్తూ 'సినిమా తారలా ఉన్న ఆ పిల్ల మీవారి ఆఫీసులో పనిచేస్తుందా? అక్కడ ఉన్న మగవాళ్ళు సరిగ్గా ఇండ్లకి వెళుతున్నారా' అంటూ ప్రారంభించింది. ''మావారు మాత్రం టైంకు వస్తున్నారు గిరిజగారు! లోకంలో ఉన్న ఆడవాళ్ళందరికి మా వారిని ప్రేమించడం తప్ప వేరే పని లేదన్నట్లు అనుకోవడం బాగులేదు—'' అంది. ''వదినగారు మీరు ఏమయినా అనుకోండి. ఆ పిల్ల మాత్రం అన్యయ్యగారిని ప్రేమిస్తుంది. అది ఆ పిల్ల చూపులోనే తెలిసిపోయింది. నాకు... అంతేకాదు - అంతో యింతో ఏదో ఉంది. నావి ఎక్స్‌రే కళ్ళని మావారు అంటారు. లక్ష్మిగారు మీ కళ్ళకి ఏదీ తప్పుగా కనబడదు. కళ్ళతో చూస్తే గాని నమ్మనంటారు. అలా ఏడ్చేవాళ్ళంతా కళ్ళకి కనబడేలా చేస్తారా! మీపిచ్చిగాని మీరేమయినా అనండి నేను భస్తే ఈ మగవాళ్ళని నమ్మను. కట్టుకున్న పెళ్ళాంతోనే ఏడుస్తారంటె అసలే నమ్మను. ఇంత ఎందుకు మనదేవుళ్ళు కంటే ఈ మగాళ్ళు ఎక్కువా? దేవుళ్ళు రంభ, ఊర్వశి, మేనకలనే కాదు.. ముని భార్యలను చూచి తిమ్మిరెక్కి గుడ్లప్పగించి జీవితాన్ని ఖరాబు చేసుకున్నారు. వాళ్లకు పుట్టినవాళ్ళే ఈ చిల్లర దేవుళ్లు. ఎందుకయినా మంచిది మన జాగ్రత్తలో మనం ఉండాలి. అన్నయ్యను, అదే మీ వారిని కాస్త కనిపెట్టి ఉండు. కాస్సేపటిలో మా కృష్ణపరమాత్ముడు నేనున్నానని కూడా లేకుండా కళ్ళు తిప్పకోకుండ చూశాడు'' అని ఆలోచనలలో పడింది

''భర్త మనసు చలించిందా, ఆ పిల్ల నగ్న సౌందర్యం ఎలాంటిదోనని చూడటానికి మనస్సు పురకలు వేసి ఉంటుందా! కోరిక కలిగి ఉంటుందా! పరీక్షించి ఉంటె బాగుండేది. అక్కడే వాతపెట్టి ఉందును.'' ''గిరిజగారు ఆలోచనలలో పడ్డారు'' అని నవ్వుకుంది. గిరిజను చూస్తె జాలి వేస్తుంది. మొగుడ్ని కళ్ళెత్తి పరాయి ఆడదాని వైపు చూస్తె వూరుకోడు. అతని శరీరాన్నే కాదు మనసును కూడా అదుపులో ఉంచాలంటుంది. తమ తప్ప అందరూ అతనికి చెల్లాయిలె. అతనికి పరిచయం అయిన ప్రతి స్నేహితులతో వాళ్ళతో వదినగారు అంటూ మాట కలుపుతూ, మీ అన్నయ్యగారు అని సారథిని వాళ్ళ అన్నయ్యగారిగా వేస్తుంది. కాని మరో వరస కలుపదు. గిరిజ పోరు భరించలేక 'ఆత్మహత్య చేసుకుంటాను'







అని రవిచంద్ర దగ్గర ఏడ్చాడట. ఆరోజు రవిచంద్ర నవ్వుకుంటూ వచ్చాడు. 'గిరిజ — సారథిని చూడు. 'లక్ష్మి' నీవు ఉన్నావ్ ఎప్పుడయినా అలా చేశావా! అలా మా లక్ష్మి చేస్తే బాగుంటుంది అని అనుకున్నాను' అన్నాడు. గిరిజ చేయగలిగింది నేను చేయలేనా అని తలుస్తూ—

"చెప్పండి. ఏమి చేసిందో" 'నీవు చేస్తావా' అన్నాడు లక్ష్మి కళ్ళలోకి చూస్తూ. 'అలాగే' అంది. ప్రామిస్ అంటూ చేయిచాచాడు. సారథి ఆఫీసుకు క్రొత్త సెక్రటరీ వచ్చింది. చాలా బాగుంటుందంట అందుకని ప్రతిరోజు వాడు ఆఫీసుకు వెళ్ళేటప్పుడు రేప్ చేసి పంపుతుందంట. అలా చేస్తే ఆ రోజుకి మనవాడికి కోరిక కలుగకుండా. 'ఛ' నేను నమ్మను .సారథిగారు మిమ్మల్ని నవ్వించటానికి అట్లా చెప్పి ఉంటారు' 'లక్ష్మి', నీవు నాకిచ్చిన ప్రామిస్' అంటూ వెంటబడ్డాడు. ఆ విషయం తలుచుకుంటె మొఖం చెంగల్వ అయింది. లక్ష్మి ముఖం అలా కందిపోయిందేమిటే అనుకుంటూ లక్ష్మి వైపు చూచి 'వదినగారు' అంటూ పిలిచింది. ఆలోచనలనుంచి బయటపడిన ఆ కళ్ళు చూస్తుంటె— తెల్లవారుఝామున నీలాల నింగిలోని నక్షత్రాలు గుర్తుకు వచ్చాయి.

గిరజను చూస్తే భర్తను రేప్ చేసేటంత ఆధునిక భావాలున్నట్లు కనపడదు. ముక్కుకు మూడురాళ్ళ బేసరి, చెవులకు ఎర్రరాళ్ళ కమ్మలు పెట్టి, నిండుగ నుదుట పాపిటలో సింధూరం, మెడలో నల్లటి పూసల గొలుసు నుంచి పగడాలు— ముత్యాలు హారాలతో కంఠం నిండుగ ఉంటుంది. కాళ్ళకు పసుపు పారాణి ఉన్న పాదాలు, పట్టుచీర, జరీచీరలు ధరించి—నిండుగ మంచి ముత్తయిదువులా ప్రొద్దున్నే చూడటానికి ఇష్టంగ ఉంటుంది. ఎంత భర్త అయినా — అతని మనసు చలించినదో లేదో!

ఇదిమాత్రం నమ్మశక్యంగా ఉండదు. గిరిజకు సెక్స్ ఎక్కువ అని అనుకోము. సెక్స్ మాటలు దొర్లినప్పుడు 'మొగుడి మాట కాదనలేక కాని ... పనులు ఎవ్వరికి కావాలి' అన్నట్లు తన అభిప్రాయం చెప్పతుంది. కాని ఎప్పుడు అవే ఆలోచనలు.

విజయనగర్ కాలనీలో అత్తమామల ఇల్లు ఉండగ నల్లకుంటలో వేరే కాపురం పెట్టింది. "ఎంత కొడుకయినా అత్తమామలు ప్రేమలు పొలకబోసుకోవడం నాకు ఇష్టం ఉండదు. పెళ్ళి అయ్యేటంతవరకే.

## రాగాగ్ని

తర్వాత కొడుకుని కోడలుకు వప్పచెప్పాల్సిందే అదే రూలు — న్యాయం కూడా" అని చెప్పతుంది.

గిరిజకు భర్తమీద ఉన్న ప్రేమ అలాంటిది ఆమె వాదన రైటుగానే ఉంది అని తను అంటె "అలాంటి భార్య వద్దు. ఆ ప్రేమ వద్దు నాకు నీలాంటి భార్యే జన్మజన్మలకు కావాలి" అని అంటాడు రవిచంద్ర 'నీ ప్రేమ వెగటు కాదు — వెన్నెల ఎప్పుడూ హాయిగా ఉంటుంది' అంటాడు రవిచంద్ర లక్ష్మికి సినిమా చూస్తున్నా' గిరిజ వాళ్ళతో కబుర్లు చెప్పకున్నా రాత్రి నిద్రపోయేటంత వరకు, 'సాహిత్య' మనస్సులో మెదలుతూనే ఉంది. దానికి కారణం చెప్పకోలేకపోయింది కాని — మనస్సులో మనస్సుగా, హృదయంలో హృదయంలా, అణువు అణువునా — రక్తంలో రక్తంగా భర్తలో కలసిపోయిన లక్ష్మి, భర్త ఆలోచనల్లో నిండిపోయిన సాహిత్య తనకు గుర్తుకు వస్తూందని లక్ష్మి ఏమాత్రం గ్రహించలేకపోయింది.

'సాహిత్య' తన యింటికి వస్తే ఆ రోజు కనపడదనుకున్నాడు. సాహిత్యను చూచినందుకు — లక్ష్మిని సాహిత్యను ఒక దగ్గర చూచినందుకు ఆనందంగా ఉంది. సాహిత్య ప్రేమ తెలుసు — వివాహితుడైనందుకు ఆమె ఎదుట హృదయం ఎంత నరకయాతన పడుతుందో తెలుసు — అందుకె మనస్సు దూరంగానే ఉన్నా 'సాహిత్య'పై పోయింది. సాహిత్య అందం, యవ్వనం రవిచంద్రని ఆకర్షించినా — కేవలం అవి శారీరకమయిన ఆకర్షణలుకాదని, సాహిత్య ప్రేమ మనసంతా నిండుకుందని. హృదయాన్ని స్పందింపజేసే ఆ ప్రేమ రోజు రోజుకు కరిగిపోతూ ఆమెలో కలసి పోవాలన్న

> ### డీవేల్యుఏషన్!
>
> సీరియల్ నవల డిమేండు పెరిగాక
> కథా రచయితకు 'డీవేల్యుయేషన్' వచ్చింది
> కార్టూనులకు కొమ్ములొచ్చాక
> కవిత్వానికి కాళ్లిరిగినట్లయింది
>
> — కప్పగంతుల మల్లికార్జునరావు

కోరిక బలపడసాగింది. తను బలహీనుడయిన రోజు ఆమె నిగ్రహం పరాకాష్టనందుకున్న ఆ ప్రేమకు ఆనకట్టవేస్తుంది. తన బలహీనతకు సిగ్గుపడతాడు- అది బలహీనత కాదని, అది ఆమె మీద ఉన్న ప్రేమకు నిదర్శనమని సాహిత్య - రవిచంద్రకు కృతజ్ఞతగా అంటుకుపోతుంది. శారీరకమయిన ఉద్వేగాన్ని అణచుకుని ఒకరి స్పర్శలో మరొకరు తృప్తిపడి రాత్రికి వారి వారి నివాస స్థలాలకి చేరుకుంటారు.

పగలు గడిచి పోయినంత త్వరగా రాత్రులు గడవ నంటవి. సాహిత్యకు నిద్రలో కలలో మనస్సులో శరీరమంతా అంతా రవిచంద్రలో నిండిపోయాయి. మరో ధ్యాస మరో వ్యాపకము లేవు. రవిచంద్ర తోటదె దేవలోకం, అన్నంత పిచ్చిగా తయారైంది "తనను మరిచిపొమ్మని,అతను ఈ ప్రేమకు 'ఆరంభమే కాని అంతం లేదు' పోతున్నంతసేపు అది తమతో వస్తుందని. తమ ప్రేమకు భవిష్యత్తు లేదు భవిష్యత్తు లేనిదానికి విలువ ఉండదు పెరిగి పెరిగి చివరికి విరిగి పోక తప్పదు, మరిచి పోవటానికి ప్రయత్నించు. ఆఫీసుకు రావద్దు" అని చెప్పాడు.

ప్రేమ మత్తు వంటిది, అలవాటు లేనంతసేపే కాని అలవాటయితె మాత్రం — ఆ స్టేజికి ఆ మత్తు పదార్థం కావలసిందే. వియోగాన్ని భరించలేక విరహాగ్నిలో కాల్చేస్తూంటె ఎవరో ఒకరు ఆ నిర్ణయాన్ని ఆ నిశ్చయాన్ని దాటేస్తూంటారు. రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టడం లేదు. కలలే. నిద్రలో ప్రక్కలో పడుకున్న లక్ష్మిని సాహిత్య అని భ్రమ పడేదాక వచ్చాడు రవిచంద్ర. తను సుఖిస్తుంది. ఆనందిస్తుంది. సాహిత్య లక్ష్మిలో లీలగా కనపడేది. ఒక్కొక్కసారి తన గుండెపై సాహిత్య పడుకున్నట్లె ఉండేది. ఎన్నో పుస్తకాలు, ఎన్నో కథలు చదివి వ్రాసిన రవిచంద్రకు తన దగ్గరకు వచ్చింది సాహిత్య అని, శరీరం ఆ ఇంట్లో ఉన్నా ఆత్మ తన దగ్గరకు వచ్చింది అని గ్రహించాడు. అంతగా ప్రేమిస్తూ, వాంఛిస్తున్న సాహిత్యను దూరంగా వుంచలేక పోతున్నాడు.

నిద్రపట్టక కిటికీ దగ్గర నిల్చున్న రవిచంద్రను నిద్రకళ్ళతో చూచిన లక్ష్మి విభావరీ వైభవాన్ని చూస్తున్నాడు. మళ్ళీ నిద్రలోకి జారిపోయింది. అలా ఒక రోజుకాదు, కొన్ని రోజులుగా చూస్తున్న లక్ష్మి—ఆ రోజు గదిలో పచార్లు చేస్తున్న భర్తను

'రవి' అని పిలిచింది. లక్ష్మి సాధారణంగా పేరుపెట్టి పిలవదు. సయ్యాటలో—భర్త కౌగిలిలో కరిగిపోతూ మత్తుగా పిలుస్తుంది. అతనిలో ధీరజ్ ఛాయలు కనిపించినప్పుడు — మరేదో సమస్యతో వర్రీ అవుతున్నాడనుకున్నప్పుడు లాలనగా, బుజ్జగిస్తూ ప్రేమగా 'రవీ' అని పిలుస్తుంది. ఆ పిలుపుమత్తు. లక్ష్మి రెండు చేతులు చాచింది. మరో ఆలోచన లేక వచ్చి లక్ష్మి గుండెపై వాలిపోయాడు. 'రవీ నీ కథలోని పాత్రలు నిద్రపోనివ్వటంలేదా' అంది. నవల ముగింపుకు వచ్చే సమయాలలో రవిచంద్రకు సరిగ్గా నిద్ర పట్టదు — నవలలోని పాత్రలు పదేపదే జ్ఞాపకం వస్తూ—తానొక విధంగా ముగింపు ఇవ్వాలనుకుంటె, పాత్రలే కొన్నిసార్లు నడిపేస్తూంటాయి. అలాంటి సందర్భాల్లో లక్ష్మి అభిప్రాయాలు అడుగుతూంటాడు. లక్ష్మి రొమ్ముల వెచ్చదనాన్ని అనుభవిస్తూ — శారీరకంగా అలసి సొలసి ప్రక్కకు జారి నిద్రపోయాడు.

* * *

ప్రొద్దు పడమటికి వాలిన కాసేపటికి ధీరజ్ వచ్చాడు. 'అమ్మా' అంటూ గడపదాటి ఇంట్లోకి వచ్చిన దగ్గరనుండి ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉంటాడు. పిల్లల సంగతి, టీచర్ల విషయాలు, పెద్దపిల్లల దగ్గర విన్న విషయాలకి తన అభిప్రాయాలు చేర్చి చెప్పుతాడు. ఆ చెప్పే విధం అంతా రవిచంద్రలాగె అనిపిస్తుంది. రవిచంద్ర కూడా అంతే! పై వూర్లకి వెళ్ళిన — ఆఫీసులో ఆ రోజు ఎవ్వరెవ్వరు వచ్చింది, స్నేహితుడిలా కబుర్లు చెపుతాడు. కొడుకు మాటలు వింటూ బూటు విప్పి స్నానంచేసి రమ్మంది. బాత్‌రూంలోకి అటు వెళ్ళి ఇటు వచ్చేశాడు. 'స్నానం చేయలేదు అవునా' 'చలిగా ఉంది అలా తుడుచుకుని వచ్చాను', అంటూ తియ్యగా నవ్వాడు. అలా నవ్విన కొడుకును మరో మాట అనలేదు. కొడుకు పాదాలు తుడిచి పౌడరు వేళ్ళ సందుల్లో వేసి తుడుస్తూ ముద్దు పెట్టుకుంది. వాడి చూపులో గర్వం తొణికిసలాడింది. వాడి కిష్టమయిన హల్వా నిండుగా జీడిపప్పు వేసి పెట్టింది. బోర్నవిటా తాగడానికి గొడవ చేశాడు. తాగుతున్నట్లు నటిస్తూ తలుపు ప్రక్కనే ఉన్న మనీ ప్లాంటులో పోసేసి — గ్లాసు సింకులో పెట్టి ఆడుకోవటానికి పరుగెత్తిపోయాడు.

రాత్రి భోజనాలకి అన్నం చేసింది. చపాతీలకు పిండి తడిపి బాగా మర్దనచేసి ఉంచుతుంది. వంటయిల్లు సర్ది — తలుపువేసి స్నానానికి వెళ్ళింది. స్నానాదులు ముగించి — ఆర్గండి చీర కట్టింది, మోచేతుల వరకు అలాంటి పూలున్న బ్లౌజు వేసుకుంది. ముత్యాలహారం, చెవులకు ముత్యాల పెద్ద పెద్ద రింగ్సు పెట్టింది. ముక్కుపుడకకు సన్నటి బంగారపు పోగు పెట్టుకుంది. నుదుట తిలకం, పాపిటలో సింధూరం, చివరిగా కాళ్ళకి వెండి పట్టీలు పెట్టుకుంది. ఫ్రిజ్‌లో వుంచిన గులాబీతీసి చెవిప్రక్కన గుచ్చి అద్దంలో చూచుకుంది. లిప్‌స్టిక్ వేసుకోబోయి—మానేసి క్రీమ్ పూసుకుంది. అధరాలు తడిగా నిగనిగలాడుతుంటె సుసజ్జితంగా వున్న శరీరాన్ని తృప్తిగా చూచుకుంది. చీకటి పడేవేళకు రవిచంద్ర వస్తాడు. అతని కోసం ఎదురు




### కె. యస్. ఆర్. — విజయవాడ

నా వయస్సు 16 సంవత్సరములు. నా పళ్ళు పచ్చగా గారపట్టి అసహ్యముగా కనిపించుచున్నవి. నేను దినమూ టూత్‌పేస్టు, బ్రష్‌లతోనే పళ్ళు తోముతున్నాను. కాని పళ్ళు తెల్లగా రావట్లేదు. దీనికి ఏమి చెయ్యాలి ?

★ కొందరు అధికంగా టెట్రాసైక్లిన్ మందులను వాడటం వల్ల దంతములు పసుపుగా మారే అవకాశం ఉంటుంది. లాలాజలంలో ఎక్కువగా కాల్షియం ఉన్నా పసుపుగారలు పట్టే అవకాశం ఉంటుంది.

మీరు దంతవైద్యుల వద్ద ''క్లీన్'' చేయించి తర్వాత క్రమపద్ధతిలో పళ్ళు తోమటం చాలా అవసరం.

### కె. పి. — య్యరగొండపాలెం

నా వయస్సు 14 సంవత్సరములు. నాకు హెర్నియా ఆపరేషన్ చేసారు. ఆపరేషన్ జరిగి 45 రోజులయినది. కొంచెము లావుగా వున్నది. కారణమేమిటి ? తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి ?

★ ఆపరేషన్ చేసిన తర్వాత ఆ భాగం కొద్దిగా వాచినట్లుండటం సహజమే! ఎక్కువ బరువు ఎత్తకుండా ఉండటం, దగ్గు రాకుండా చూసుకోవటం, మలబద్ధకం లేకుండా చూడటం మొదలయినవి మాత్రమే తీసుకోతగిన జాగ్రత్తలు

### ఎం కె. బి. — ఝాన్సీ

నేను ఏడు నెలల నుంచి సోరియాసిస్ అనే చర్మ వ్యాధితో బాధపడుతున్నాను. ఈ వ్యాధి ఏ కారణం వల్ల వస్తుంది ? ఏ మందులు వాడాలి ? ఆహారంలో ఏమన్నా మార్పులు తీసుకోవాలా ?

★ ఈ రోగం ఎందువల్ల వస్తుందో ఇంత వరకు తెలియదు. జీన్స్‌ల ప్రభావం వల్ల ఈ రోగం ఏర్పడుతుందని ప్రస్తుత అంచనా.

ఈ రోగానికి ఆహారానికీ సంబంధం లేదు.

5 నుంచి 10 శాతం కోల్‌టార్ సొల్యూషన్; 2 శాతం శాలిసిలిక్ ఆయింట్‌మెంట్, చర్మానికి పై పూతగా వాడాలి. తల మీద చర్మానికి 2 నుంచి 4 శాతం శాలిసిలిక్ ఆయింట్‌మెంట్ లేక ఆలివ్ ఆయిల్‌తో సమన్వయించబడిన 10 శాతం కోల్‌టార్ ఆయింట్‌మెంట్ వాడాలి.

### కె. జి. కె — న్యూఢిల్లీ

నాకు రెండు, మూడు నెలల నుండి పార్శ్వపు తలనెప్పి వస్తున్నది. ఇది 5,10 నిముషములు వుంటుంది. చాలా మందులు వాడాను. ఎక్కువ నడిచినా, తుమ్మినా వస్తుంది. మీ సలహా ఏమిటి ?

★ మీరు ఇ.ఎన్.టి. వైద్యులను సంప్రదించి చికిత్స చేయించుకోవటం మంచిది.

### ఎమ్. సి ఆర్. - నరసారావుపేట

నాకు గత నెల రోజుల నుండి కళ్ళె పడుతూ వున్నది. డాక్టరు సలహాపై మందులు వాడుచున్నాను. కాని అన్నం తినగానే విపరీతంగా నీరసంగా వుంటుంది ఈ నీరసం ఎందువలన వస్తున్నది ? దీనికి నివారణ ఏమిటి ?

★ కఫాన్ని పరీక్ష చేయించటం (ఎ. ఎఫ్. బి - టెస్టు) అవసరం. అలాగే ఛాతీ ఎక్స్—రే తీయించటం, నెత్తురు (టి. సి; డి. సి.) పరీక్ష చేయించటం కూడా చాలా అవసరం. ఈ పరీక్షల ఫలితాల ననుసరించి చికిత్స చేయించవలసి ఉంటుంది. నీరసం రోగ లక్షణమే.

### వి. పి. - భువనేశ్వర్

నా వయస్సు 26 సం॥లు. నాకు మైట్రల్ స్టినోసిస్ ఉన్నది. ఆపరేషన్ చేయించుకోవలసిన అవసరం ఉందని కొందరు, మైల్డ్ స్టేజిలో ఉంది కాబట్టి అవసరం లేదని కొందరు చెబుతున్నారు. ప్రస్తుతం మందులేవీ వాడటం లేదు. సిగరెట్లు కాలుస్తాను. ఏమయినా జాగ్రత్తలు తీసుకోవాలా ?

★ ఆపరేషన్ బాగా అవసరం అనిపిస్తేగాని వైద్యులు చేయటం జరుగదు. మద్రాసు, హైదరాబాద్, ఢిల్లీ మొదలయిన నగరాలలో ఆధునిక — పరికరాలు చాలా ఉన్నాయి. అక్కడికి వెళ్ళి సంప్రదించితే వారు నిర్ణయించి తెలియజేస్తారు. ★

---

### రా గా గ్ని

చూస్తూ ప్రాంగణంలో ఉన్న బుల్లితోటలోకి వచ్చింది. వరండాలో ఎక్కువ అవసరంలేని క్రోటన్ మొక్కలున్న కుండీలు పెట్టింది, దానికి ఇరువైపులా అటొక తివాచీ, ఇటొక తివాచి పరిచినట్లుగా లాన్— గులాబీ మొక్కలు, ముద్దమందారం, నందివర్ధనం, గన్నేరు చెట్లు గోడకు ఆనుకుని గుబురుగా కర్టెన్‌లా ఉంటాయి ఒకప్రక్క గోడకు మేరీపామర్ తీగ గొడుగు పడుతుంది. అక్కడ కూర్చుంటె బయట వాళ్ళకి తను కనుపించదు. పని అంతా ముగించుకుని, శ్రీవారి రాకకై ఎదురుచూస్తూ క్రొత్తగా వచ్చిన మాగజైన్‌లో నవల చదువుకుంటూ మధ్య మధ్య దారినపోయేవాళ్ళను చూస్తూ కాలక్షేపం చేయటం లక్ష్మికి అలవాటు.

అలవాటు ప్రకారం తానెప్పుడూ కూర్చునె చోటుకు వస్తూంటె హాల్లో ఫోన్ మ్రోగింది. తిరిగి హాలులోకి వెళ్ళి — ఫోన్ ఎత్తి ''లక్ష్మిని'' అంది. ''హలో లక్ష్మిగారు'' చెవిలో గిరిజ గొంతు కంగుమని వినిపించింది. గిరిజ ఎప్పుడు ట్రంక్ కాల్స్‌లో మాట్లాడినట్లు లోకల్ కాల్స్‌లో మాట్లాడుతుంది. ''హలో గిరిజగారు నమస్కారం! బాగున్నారా, షాపింగ్ చెయ్యాలి ఇటు వస్తానన్నారు'' ''వద్దామనే అనుకున్నాను. ఆడబిడ్డ వాళ్ళు వచ్చారు. వాళ్ళు జులాజికల్ పార్కు చూస్తామంటె అటు వెళ్ళాను ... లక్ష్మిగారు — ఆయన ఉన్నారా'' అంది ''వస్తూ వస్తారనే ఎదురు చూస్తున్నాను.'' అంటూ నవ్వింది. లక్ష్మి నవ్వే ముఖాన్ని జ్ఞాపకం చేసుకుంటున్నట్టుగా ఉందేమో! వెంటనే మాట్లాడ లేదు గిరిజ. 'లక్ష్మిగారు' ... మీ శ్రేయోభిలాషిని మీ నవ్వు వింటూంటె మీకేమి తెలిసినట్లుగా లేదు ... నిజం చెప్పండి. అన్నయ్యగారు వేళకి ఇంటికి వస్తున్నారా ... అతనిలో మీకేమి మార్పు కనపడలేదా... మీ అంత పవిత్రమయిన హృదయాన్ని ప్రక్కకుపెట్టి మామూలు స్త్రీగా ఆలోచించండి.'' ''గి...రి...జ గారూ ఎందుకిలా ప్రశ్నిస్తున్నారు. మీరూ తెల్పదలచుకున్నది సూటిగా చెప్పేయండి.''

''లక్ష్మిగారూ... మీకు ఈ సంగతి చెప్పటం నాకు యిష్టంలేదు — మంొకరు మంొకరు అయితే. నాకెందుకు గొడవ అని వూరుకుండే దానిని — తర్వాత తర్వాత ఏమవుతుందో తమాషాగా చూసేదానిని. మీరంటె నాకెంతో యిష్టం. మీలాంటి పవిత్ర మూర్తి నష్టపోవడం, మోసపోవడం సహించలేక చెపుతున్నాను. ఆ రోజు మీ యింటికి వచ్చారే పేపరువాళ్ళు అందులో సినిమా తారలా చెళుక్ చెళుక్‌మని మెరిసిపోతుందని చెప్పాను ఆ పిల్ల గుర్తుకు లేదూ, ఆ పిల్ల, మీ శ్రీవారిని జులాజికల్ పార్కులో చూశాను. నా కళ్ళతో కాదు, మీలాంటి కళ్ళతో చూశాను. ఆ పిల్ల వడిలో తల పెట్టుకుని— ఓ చెట్టు క్రింద పడుకుని ఉన్నాడు — ఏకాంతంలో దూరంగా మామూలుగా నడిచివెళ్ళరు — ఆ చోటుకి. ట్రైన్‌లో వెళుతూ అక్కడే దిగేసిన బాపతని ప్రక్కవాళ్ళు అనుకుంటున్నారు. దానికి మీరేమన్న పేరు పెట్టండి — స్టోరీ డిస్కషన్స్ అనో, లేక ఏ దుఃఖిత తన బాధని చెప్పుకుని పేరు మార్చి కథ వ్రాయమని కోరుకుంటుందో తెలియదు కాని... నా కళ్ళకి ప్రేయసి ప్రియులు అని స్పష్టంగా కనపడుతోంది...

( ఇంకా వుంది )

# అలసట చేత ఇంట్లో చదవ లేవా?



ఇది మీరు నమ్మిన గ్లాకోస్ జ్-డి యొక్క కొత్త పేరు

## గ్లూకోన్-డి ®

**ఆదనపు శక్తి కోసం—అలా**
**అతనికి కావలసినప్పుడు**

సేద తీర్చడానికి, చల్లదనానికి శక్తినిచ్చే గ్లూకోన్-డి, గ్లాక్సో కంపెనీ నుంచి వచ్చిన విటమిన్-డి మరియు కాల్షియం ఫాస్ఫేటులతో బలపరచబడిన అసలైన గ్లూకోజ్ పొడరు. దాన్ని ఏ పానీయం లోనైనా సరే కలపండి-పళ్లరసం, పాలు, టీ, కాఫీ, నీరు. లేకపోతే దేనితో కలపకుండా అలానే తీసుకోండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.




అందరికి పరిచయమున్న అదే ఆకుపచ్చ ప్యాక్‌లో దొరుకుతుంది.



HTB-GLL-7200-TG

**గ్లూకోన్-డి ®** నమ్మకంగా తిరిగి శక్తి నిచ్చే **గ్లాక్సో** వారి తయారీ

పెద్దకథ:

# ఇది సంధ్యాసమయం

నందం రామారావు



(గత సంచిక తరువాయి)

అమ్మకి ఆపరేషన్ జరిగింది.

అప్పటికి ప్రాణగండం గడిచినా, ఆరునెలలకి ఏ గండం లేకుండానే అమ్మ ప్రాణం గాలిలో కలిసిపోయింది. ఆ తర్వాత, మరో ఆరునెలలకి నాన్న రిటైరు కావడం, నాకీ వుద్యోగం రావడం జరిగింది. ఇప్పుడా గొడవలన్నీ ఎందుగ్గానీ — సుజా! ఆ ఫోటోనే ఇప్పుడు నా జీవితాన్ని నిప్పుల గుండంలోకి తోశాయి. సుజా! ఇది చూడు.'' అంటూ కళ్యాణి తన బ్యాగ్ లోంచి ఒక వుత్తరం తీసి సుజాత చేతిలో పెట్టింది.

''ఏమిటిది?''

''చదువు''

సుజాత ఆ వుత్తరం తీసి చదవసాగింది

''కళ్యాణిగారూ,

మిమ్మల్ని చూశాక ఎప్పుడు మన పెళ్ళి జరుగుతుందా అని ఆరోజు కోసం ఆరాటంతో ఎదురు చూడసాగాను. మీకు చెప్తే నమ్మరు రాత్రుళ్ళు నిద్ర పట్టడం కూడా మానేసింది. ఒక్కొక్క రోజు గడుస్తుంటే మనం దగ్గరవుతున్నామనే ఆనందం. నా స్థితి నాకే ఆశ్చర్యంగా వుండేది. ఇక అసలైన విషయానికొస్తాను. మొన్న సాయంత్రం ఒక ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాను. వాడు ఏదో కబుర్లు చెప్తూ — ''రీసెంట్‌గా కొన్నారా!'' అంటూ కొన్ని 'న్యూడ్స్' చూపాడు. వాడి టేస్ట్ నాకు తెలుసు. అందుకే అవి తీసుకుని ఒకటొకటే తీసి చూస్తున్నాను. వాడు ఏవేవో వర్ణనలు చేస్తున్నాడు. జోక్స్ వేస్తున్నాడు. ఆ ఫోటోలు చూస్తున్న నాకళ్ళు హటాత్తుగా ఆగిపోయాయి. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. అది మీ ఫోటో. మీ కళ్ళకు నల్లని గుడ్డ కట్టివుంది. మీరు నగ్నంగా, స్త్రీ వేటినైతే రహస్యంగా దాచుకోవాలను కుంటుందో వాటిని స్పష్టంగా చూపుతూ నిలబడ్డారు. వాడు ఫోటోని చూస్తూ ఏవేవో కామెంట్స్ విసురుతున్నాడు. నేను వినలేకపోయాను. ఫోటోలు అక్కడ పడేసి వాడు పిలుస్తున్నా వినిపించుకోకుండా వచ్చేశాను.

కళ్యాణిగారూ! మీరు ఏ పరిస్థితిలో ఆ ఫోటోలు తీయించుకున్నారో నాకనవసరం. నాక్కాబోయే భార్య సౌందర్యాన్ని నేనే చూడాలి. పరాయి మగాడి ముందు అలా నిలబడ్డ స్త్రీని నేను నా భార్యగా స్వీకరించలేను. మీకు బాధ కలిగిస్తే నన్ను మన్నించండి. శెలవ్.

మోహన్రావు.''

సుజాత ఉత్తరం మడిచి కళ్యాణివేపు చూసింది.

కళ్యాణి కళ్ళల్లో నీటిబిందువులు.

సుజాత అది చూసి చలించిపోతూ ఆప్యాయంగా కళ్యాణి చేతిని పుచ్చుకుని — ''కళ్యాణీ! ఏడవకే'' అంది.

కళ్యాణి కొంగుతో కళ్ళు తుడుచుకుని—''ఏడవడం లేదే. చేతులారా చేసుకున్నదానికి ఏడుపెందుకే. మోహన్రావు జ్ఞాపకం వచ్చి క్షణకాలం బాధ కలిగింది.''

''కళ్యాణీ!''

''అవునే సుజా! చిన్నప్పుడు మా మాస్టారు అంటుండేవారు — కష్టాల్లో కూడా నవ్వేవాడే

మనిషిని. చూడు సుజా! ఈ జీవితం ఎంతో చిన్నది. చాలా విలువైనది కూడానూ. జీవితమంతా కన్నీటితోనే గడిపితే చివరి నిముషాల్లో పశ్చాత్తాపపడాల్సివస్తుంది."

"కళ్యాణీ! ఇప్పుడెలా? పోనీ, ఆ స్టూడియోకెళ్ళి ఆ నెగెటివ్‌లు తీసుకొచ్చేద్దామా?"

సుజాత మాటలకు పకపకా నవ్వింది కళ్యాణి.

"సుజా! నువ్వెంత అమాయకురాలివే. మనం అడిగితే ఇస్తాడా? డబ్బిచ్చికొనుక్కున్నాడు. ఐనా ఇప్పుడు నా ఫొటోలు దేశమంతా వ్యాపించి వున్నాయి. ప్రతి కుర్రాడి దగ్గరా అవే వుండి వుంటాయి."

సుజాత ఆవేదనగా చూసి — "కళ్యాణీ! ఇక నీ పెళ్ళి ఎలా అవుతుందే?" అన్నది.

"అవుతుందే. నా దగ్గర లక్షలాది రూపాయలుంటే పెళ్ళవుతుంది. నేనెన్ని తప్పులు చేసినా తుడిచిపెట్టుకుపోతాయి. అంత డబ్బు నా దగ్గర లేదుగనుకనే నాకు పెళ్ళి కాదు."

గుండెల్ని బ్రద్దలుచేసే మాటల్ని కూడా అంత తేలిగ్గా చెప్తున్న కళ్యాణిని చూస్తుంటే సుజాతకి ఆశ్చర్యం కలిగింది.

కళ్యాణి స్థానంలో ఇంకో ఆడపిల్ల గనుక వున్నట్టయితే ఈపాటికి ఆత్మహత్య చేసుకుని వుండేది!

"కళ్యాణీ..." అంటూ బాధగా ఏదో చెప్పబోయింది.

అప్పుడు కళ్యాణి కోపంతో — "సుజాతా! అంతలా బాధపడడం మంచిదికాదు. ఐనా, ఇప్పుడు నాకేం తక్కువయిందని? మంచి వుద్యోగం వుంది. మంచి స్నేహితురాలిగా నువ్వున్నావ్. ఇవికూడా లేనివాళ్ళు ఈ దేశంలో కోకొల్లలుగా వున్నారు. అంచేత నువ్వింకేం చెప్పమాకు."

సుజాత చిన్నగా నిట్టూర్చి —"అవును కళ్యాణీ! నువ్వు చెప్పింది నిజమే. అటువంటివాళ్ళను చూసి జాలిపడడం తప్ప మనం ఏం చెయ్యగలం?" అన్నది.

కళ్యాణి ఏదో ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయింది!

నిముషాలు గడుస్తున్నాయి. సుజాత హటాత్తుగా అడిగింది —

"మీ అక్క ఎలా వుంది కళ్యాణీ?" అని.

"అలాగే వుంది. ఇప్పుడవన్నీ ఆలోచిస్తుంటే మన మనస్సు ఇంకా పాడవుతుంది. అప్పుడే ఏడు గంటలు కావస్తోంది. ఇక పోదాం పద" అంది కళ్యాణి లేస్తూ.

సుజాత కూడా లేచింది.

"కళ్యా!" అంటూ ఏదో చెప్పబోయి కళ్యాణివేపు చూసి ఆగిపోయింది సుజాత.

సుజాత చెప్పబోయే విషయాన్ని గ్రహించిన కళ్యాణి —

"సుజాతా! జాగ్రత్తగా ఇంటికెళ్ళు. కడుపునిండా తిని హాయిగా నిద్రపో. పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకుని నిద్ర పాడుచేసుకోకు" అని అన్నది.

సుజాత 'అలాగే' అన్నట్టు తలూపి రోడ్డుమీదకొచ్చి రిక్షా పిలిచి —

"కళ్యాణీ! ఆ రిక్షాలో నువ్వెడతావా?" అని అడిగింది.

"నేను ఆటోలో వెడతాను. నువ్వెళ్ళు" అంది కళ్యాణి.

సుజాత రిక్షా ఎక్కింది.

కళ్యాణికైతే తేలిగ్గా మాటైతే యిచ్చిందిగానీ ఆ రాత్రంతా కళ్యాణిని గురించిన ఆలోచనలతో నిద్రపట్టలేదు సుజాతకి!

కళ్యాణి కొంచెం నలుపే అయినా కళకళలాడే ముఖం. కళ్యాణిలో ఎక్కువ ఆకర్షించేది ఆమె నవ్వు. కొద్దిగా పెదవులు తెరచి, తెల్లని పలువరుస తళుక్కుమనేట్టు కళ్యాణి నవ్వితే ఎంతటివాళ్ళైనా ముగ్ధులై చూడవల్సిందే!

కళ్యాణి తనకన్నా ముందునుంచే బ్యాంక్‌లో వర్క్ చేస్తోంది.

తను బ్యాంక్‌లో చేరిన మొదటి రోజు. లంచవర్లో లేడీస్ అందరితోపాటు తనూ రూమ్‌లో కెళ్ళింది. కాని, ఆ రోజు తినడానికి తనేం తెచ్చుకోలేదు. బిడియంగా ఒక మూల కూర్చుండిపోయింది.

అప్పుడు కళ్యాణి తన దగ్గరకొచ్చి — "మీరు కొత్తగా జాయినయ్యారనుకుంటాను" అంటూ తన ప్రక్కన కూర్చుని తనతో మాట కలిపింది.

కళ్యాణి బాక్స్ తెరచి, తినడానికి తెచ్చుకున్న దానిలో తనక్కూడా కొంత పెడుతూ — "ఇక్కడ క్యాంటిన్లో టిఫిన్ బాగుండదు. అందుకని రోజూ మేము లంచ్ బాక్స్‌లు తెచ్చుకుంటాం" అంది

ఆ సాయంత్రం తనతోపాటు బస్సుస్టాపువరకూ వచ్చింది. దారిలో అంది —

"సుజాతా! మిమ్మల్ని చూడగానే ఎందుకనో మీతో స్నేహం చేసుకోవాలన్పించింది. అదీ మీ కిష్టమైతేనే సుమండీ."

కళ్యాణి మాటలకు తను చాలా సంతోషించింది. ఆ రోజునుంచీ తామిద్దరూ మంచి స్నేహితురాళ్ళయ్యారు. తమ మధ్య ఎటువంటి దాపరికాలూ వుండేవికావు!

## మంత్రుల జీతాల్లో కోత!

పశ్చిమ జర్మనీ కొత్త ప్రభుత్వం ఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించేందుకు సన్నాహాలను ప్రారంభించింది. ఇందులో తొలి చర్యగా మంత్రుల జీతాల్లో అయిదు శాతం కోత విధించారు. అందరూ కొంత మేరకు "త్యాగాలు" చేయవలసి ఉంటుందని నూతన అధ్యక్షులు శ్రీ కోహ్ల్ అన్నారు. ఉద్యోగుల జీతాల పెంపును ఆరునెలల పాటు వాయిదా వేశారు. ఇది పింఛనుదారులకు కూడా వర్తిస్తుంది. మంత్రుల జీతాల్లో విధించిన అయిదుశాతం కోతవలన బడ్జెటు లోటును పూడ్చడం సాధ్యంకాదు. అయితే ఇది అందరికీ మార్గ దర్శకంగా ఉంటుందని ఆయన అన్నారు. ప్రతిపక్షం వారు మాత్రం దీనిని కన్నీటి తుడుపు చర్యగా అభివర్ణించారు. దీని ద్వారా సాధించిన పొదుపు అదనపు కార్య దర్శుల నియామకం వలన కుడిచి పెట్టుకు పోయిందని వారన్నారు.

అమ్మ అప్పుడప్పుడూ అంటుంది—"ముత్యాలన్నీ ఒకచోట, మట్టిబెడ్డలన్నీ ఒకచోట చేరతాయని."

అలాగే కళ్యాణి, తనూ ఇద్దరూ దురదృష్టవంతులే. ఇద్దరికీ సుఖపడే గీత లేనట్టుంది.

కళ్యాణి అన్నట్టు —

అవును! తనలాటివాళ్ళు కష్టాల్లో కూడా నవ్వడం నేర్చుకోవాలి. లేకపోతే బ్రతకడం చాలా కష్టం!

ఆలోచనలతో ఎప్పుడో నిద్రపోయింది సుజాత

* * *

ఆ రోజు కొద్దిగా పనుండి సుజాత నాలుగ్గంటలకే ఏజంట్‌గారిని పర్మిషన్ అడిగి బస్సెక్కి బజార్లో దిగింది. తనకు కావలసినవి కొనుక్కుని, తిరిగి బస్సుస్టాపు దగ్గరకొచ్చి నిలబడిందో లేదో టపటపా చినుకులు ప్రారంభమై చూస్తుండగానే వర్షం పెద్దదయింది.

రోడ్డు మీదవున్న వాళ్ళందరూ నాలుగు వేపులకూ పరిగెత్తారు.

సుజాతకి ఎక్కడికి వెళ్ళాలో తోచలేదు. ప్రతి షాపులోనూ అంగుళం స్థలం విడవకుండా మనుషులు నిలబడివున్నారు.

ఆడపిల్ల అలా ఒంటరిగా నిలబడి వర్షంలో తడుస్తుంటే వినోదంగా చూస్తున్నారు.

సుజాత నెత్తి మీద నుంచి ముఖం మీదికి నీళ్ళు కారుతున్నాయి. తడిసిన చీర ఒంటికి అతుక్కుపోయింది. సుజాత అయోమయ స్థితిలో అలా స్తంభంలా నిలబడిపోయింది.

ఇంతలో సుజాత ముందొక కారు ఆగింది. ఆ కారులో శ్రీనివాస్ వున్నారు. కారు డోర్ తీస్తూ —

"రండి. త్వరగా వచ్చి కారెక్కండి!" అన్నాడు.

సుజాత సంకోచిస్తూ అలాగే నిలబడివుంది.

"మిమ్మల్నే. మీరొస్తారా? నన్ను దిగి రమ్మంటారా?"

సుజాత గబ గబా వెళ్ళి కారులో కూర్చుంది. శ్రీనివాస్ కారు స్టార్ట్ చేసి — "ఒక ప్రక్క అలా తడిసిపోతూ కారులో ఎక్కనంటారేవండీ. మై గుడ్‌నెస్. మీ తల చూడండి ఒక చిన్న చెరువులా తయారయింది. వెనుక సీటులో టవలుంది. అది తీసుకుని తుడుచుకోండి!" అన్నాడు.

సుజాత టవల్ తీసుకుని తుడుచుకోసాగింది. కారు మెత్తగా వెడుతోంది. ఆమెకిదంతా ఇంద్రజాలంలా వుంది!

తను శ్రీనివాస్ ప్రక్కనకూర్చుని అతని కారులో వెడుతోంది!

ఇది కలకాదు నిజం!

శ్రీనివాస్ వేపు చూసింది.

అతని కుడిచేయి స్టీరింగ్ మీదుంది.

ఎడమచేయి ఒళ్ళో వుంది.

అతని దృష్టి రోడ్డు మీదుంది.

ఆ కళ్ళు, నుదుట మీదపడే ఆ వంకీ జుట్టు, వంపు తిరిగిన ఆ గడ్డం .. ఎంత బాగున్నాడు.

"బజారు కొచ్చారా?" శ్రీనివాస్ ప్రశ్నించాడు.

సుజాత వులిక్కిపడి —

"ఆ!" అంది తడబడుతూ.

"వచ్చిన పని పూర్తయిందా?"

"ఆ"

"మా నాన్నగారు రోజుకొక్కసారైనా మీ కుటుంబాన్ని గురించి చెప్పందే నిద్రపోరు. ముఖ్యంగా మీ గురించి ఎక్కువ చెబుతుంటారు. ఇంత చిన్న వయస్సులో కుటుంబ బాధ్యతల్ని నెరవేర్చుకుంటూ వస్తున్నారని మిమ్మల్నెప్పుడూ పొగడుతూ వుంటారు."

శ్రీనివాస్ ఏదేదో చెబుతున్నాడు కానీ ఆ మాటలేవీ సుజాత వినటంలేదు

శ్రీనివాస్ కంఠంలోని మాధుర్యానికి తన్మయత్వం చెందుతోంది సుజాత.

కారు ఒక హోటల్ ముందాగింది.

శ్రీనివాస్ వెనుక సీటులోవున్న ఫ్లాస్కు తీసుకుని హోటల్‌కెళ్ళి రెండు కప్పుల టీ పోయించుకొచ్చి, దాన్ని గ్లాసులో పోసి సుజాత కిస్తూ — "తీసుకోండి" అన్నాడు.

"మరి మీరు . " అంది సుజాత అతనివేపు చూస్తూ

"నేనూనా. మీకు తెలియదేమో నేను చాలా స్వార్థపరుడినండోయ్" అన్నాడు శ్రీనివాస్ నవ్వుతూ.

అబ్బా! శ్రీనివాస్ ఎంత బాగా నవ్వుతాడు!

అతన్నే చూడసాగింది సుజాత.

"చల్లారిపోతోంది. ముందు త్రాగండి."

సుజాత గ్లాసును పెదవుల కానించుకుంది. త్రాగడం పూర్తయ్యాక కారు స్టార్ట్‌చేశాడు.

"మీ అమ్మగారు బావున్నారా ?"

"ఆ."

"ఆ రోజు మీ అమ్మగారు చాలా వీక్‌గా కన్పించారు. జాగ్రత్తగా చూస్తుండండి."

సుజాత తలూపింది.

ఆ తర్వాత శ్రీనివాస్ తాము కట్టబోయే క్రొత్త నర్సింగ్‌హోమ్ గురించి మాట్లాడాడు.

సుజాత మౌనంగా వింటోంది.

ఇంతలో చిన్న కుదుపుతో కారు ఆగింది.

సుజాత వులిక్కిపడి చూసింది.

'అరే! అప్పుడే ఇల్లు వచ్చేసిందే;'

సుజాత డోర్ తీసుకుని క్రిందకు దిగింది.

"వస్తానండీ. చాలా థాంక్స్."

"నో మెన్షన్ ప్లీజ్. గుడ్‌నైట్" అని శ్రీనివాస్ కారు స్టార్ట్ చేశాడు.

సుజాత మనస్సు గాలిలో తేలిపోతున్నట్టుగా

# ఇది సంధ్యా సమయం

వుంది హుషారుగా నడుచుకుంటూ ఇంట్లో కొచ్చింది.

హాల్లో గీతా, రవీ కూర్చుని చదువుకుంటున్నారు. చేతిలోని ప్యాకెట్లు టేబుల్‌మీద పెట్టి వంటింట్లోకి నడిచింది సుజాత.

జయ స్టవ్ ముందు కూర్చుని అన్నం కలియబెడ్తోంది

"అక్కా!" అని పిలిచింది

జయ ఇటు తిరిగి చూసింది

జయ కళ్ళు ఎర్రమందారాల్లా వున్నాయి

ముఖం కమిలిపోయివుంది

ఎంతసేపట్నుంచో ఏడుస్తున్నదానిలా వుంది

ఆ స్థితిలో వున్న అక్కను చూసి తెల్లబోయిన సుజాత —

"అక్కా! అలా వున్నావే ?" అనడిగింది

జయ సమాధానం చెప్పకుండా అటువేపు తిరిగింది. అక్క ధోరణి అర్థంకాలేదు సుజాతకి.

ఎప్పుడూ నవ్వుతూ వుషారుగా వుండే అక్క అలా వున్నదంటే ఏదో విశేషమే జరిగివుండాలి.

ఏమిటో అది ?

అక్కయ్య చెప్పేలాలేదు !

అమ్మ నడిగి తెలుసుకోవాలి.

తల్లి గదిలో కొచ్చిన సుజాత —

కమలమ్మ మంచంమీద కూర్చుని వుండడం, ఆమె కెదురుగా శంకరయ్య కుర్చీలో కూర్చుని వుండడం చూసింది.

శంకరయ్యని చూసి సుజాత వెనుదిరిగివచ్చి హాల్లో కూర్చుంది.

శంకరయ్య కమలమ్మకి దూరపు చుట్టం. అప్పుడప్పుడూ వచ్చి ఏవేవో సంబంధాలు చెప్తుంటాడు ఆ మధ్య జయకి ఏదో సంబంధం తెచ్చాడు. వాళ్ళు వచ్చి చూసివెళ్ళారు. బహుశా, దాన్నిగూర్చి ఏదైనా చెప్పడానికి వచ్చాడేమో. అక్కయ్యకు తొందరగా పెళ్ళయితే తనకు లైన్ క్లియరవుతుంది.

అప్పుడు... తను... సుజాత మనస్సులో శ్రీనివాస్ మెదిలాడు.

శ్రీనివాస్ ఎంత చక్కగా మాట్లాడాడు.

అతనికి తనంటే ఇష్టమేమో ?

లేకపోతే ఎందుకింత అభిమానం చూపుతాడు?

ఇన్నాళ్ళూ తను చాలా దురదృష్టవంతురాలని బాధపడుతూ వచ్చింది. కానీ, తనకోసం ఇంతటి సౌభాగ్యాన్ని ఆ దేవుడు దాచివుంచాడని ఇప్పుడు తెలుసుకుంది !

సంతోష తరంగాలు వువ్వెత్తున లేస్తున్నాయి తన ఆనందాన్ని ఎవరితోనైనా చెప్పుకోవాలి ఏ విషయం జరిగినా ముందుగా అక్కయ్యకు చెప్పడం తన కలవాటు. శ్రీనివాస్ విషయం కూడా అక్కకు చెప్పాలి.

కానీ, అక్క ఎందుకలా వుంది ?

శంకరయ్య వచ్చాడంటే మంచి కబురే తెచ్చి వుండాలి. మరి, అక్కయ్య ఎందుకు బాధపడుతోంది ?

అక్కయ్య అలా విచారంగా వుంటే తను క్షణం కూడా భరించలేదు. అక్కయ్య ఎప్పుడూ నవ్వుతూ వుండాలి. అక్కయ్య కొచ్చిన కష్టమేమిటో తెలుసుకుని దాన్ని పోగొట్టాలి

అక్కయ్య బాధకు కారణం తెలుసుకునేవరకూ తన మనస్సు మనస్సులో వుండదు! 'శంకరయ్య ఎప్పుడు వెళతాడా' అని చూస్తూ కూర్చుంది సుజాత.

అరగంట తర్వాత శంకరయ్య వెళ్ళిపోయాడు వెంటనే సుజాత తల్లి గదిలోకెళ్ళింది మంచానికి ఆనుకుని కూర్చున్న తల్లి సుజాతని చూస్తూ —

"వచ్చావా సుజా ?" అంది

"అమ్మా! అక్కయ్య అలావుందేమిటి ? ఏం జరిగింది ?"

ఆ మాటతో కమలమ్మ ముఖం అదోలా ఐపోయింది.

"అంతా నా రాత తల్లీ .. మీ నాన్నగారితో పాటు నేనూ పోయినా బావుండేది" అంటూ కళ్ళొత్తుకుంది ఆవిడ

తల్లి ధోరణికి విసుగు చెందిన సుజాత — "అసలేమైందమ్మా ?" అనడిగింది.

"మొన్న మీ అక్కయ్యని చూసి వెళ్ళినవారు వుత్తరం వ్రాశారు,"

"ఏమని రాశారు ?"

"ఇదిగో. నువ్వే చూడు" అంటూ దిండు క్రిందనుంచి వుత్తరం తీసిచ్చింది కమలమ్మ.

సుజాత ఉత్తరం తీసుకుని చదివింది. అందులో నాలుగే వాక్యాలున్నాయి.






'మా అబ్బాయికి మీ రెండో అమ్మాయి నచ్చింది. మీ పెద్దమ్మాయికి వేరే ఎక్కడైనా సంబంధం చూసి త్వరలో పెళ్ళి చేసినట్లయితే, మీ రెండో అమ్మాయిని చేసుకుంటాం. ఇందుకు మీరు అంగీకరించినట్లయితే మిగతా విషయాలు వచ్చి మాట్లాడతాం.'

ఉత్తరం చదవగానే సుజాత ముఖం ఎర్ర బడింది. చేతిలోని వుత్తరాన్ని నలిపేసి వుండలాగా చుట్టి కోపంగా ఒక మూలకు విసిరేసి — "అమ్మా ! దీనికేనా మీరందరూ బాధపడడం !" అంది.

సుజాత కంఠం అనుకోకుండా కఠినంగా మారింది.

"అదికాదే... "

"ఇక ఆ సంగతి ఎత్తకండి !"

"పాపం ! అక్కయ్య, నీకు తాను అడ్డుగా వున్నానని తెగ బాధ పడుతోంది."

ఆ మాట వినడంతోనే సుజాతకి అక్క మీద చెప్పరాని జాలి కలిగింది.

'అక్కయ్య ఎంత అమాయకురాలు.'

"అక్కయ్యకు నేను చెబుతాలే అమ్మా. నువ్వు బాధపడుతే అక్కయ్య ఇంకా బాధపడుతుంది. నువ్వు మామూలుగా వుండు !"

అక్కయ్యను ఎలా ఓదార్చాలా అనుకుంటూ హాల్లోకొచ్చి కుర్చీలో కూర్చుంది.

మనసులో ఆ వుత్తరంలోని వాక్యాలు కదిలాడాయి.

ఒళ్ళు భగ భగ మండింది.

వీళ్ళసలు మనుష్యులేనా ?

సంతలో గొడ్డుని చూసినట్టు చూసివెళ్ళారు. తీరా, చూసి వెళ్ళిన తర్వాత నచ్చలేదని వ్రాశారు. పైగా, తను నచ్చిందట !

వెధవ ! ఎవర్ని చూడాలని వచ్చాడో వాళ్ళని చేసుకోవాలిగానీ కనిపించిన ప్రతి అందమైన ఆడపిల్లా నచ్చిందంటే ఎవరూరుకుంటారు. ఈ కోతిని చేసుకోవడానికిక్కడ ఎవరూ సిద్ధంగా లేరు.

ఇంతలో రవి — "అక్కా ! ఈ పాఠం చెప్పవూ ?" అంటూవచ్చాడు.

సుజాత తన ఆలోచన్లనుంచి బయటపడి కాస్సేపు వాడికి చదువు చెప్పింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక జయ హాల్లో పక్కలు వేసింది. పుస్తకాలు ముందు కూర్చుని కునికిపాట్లు పడుతున్న గీతనీ, రవినీ పడుకోబెట్టి, తను వాళ్ళిద్దరిమధ్యా పడుకుంది జయ.

అంతవరకూ గదిలో కూర్చుని పత్రిక తిరగేస్తున్న సుజాత పుస్తకం ప్రక్కన పడేసి జయ దగ్గరకొచ్చింది. గీతని కొద్దిగా ప్రక్కకి జరిపి తను కూర్చుని —

"అక్కా !" అని మెల్లగా పిలిచింది.

జయ కళ్ళమీదనుంచి చేతులు తీసి సుజాతవేపు చూసి —

"ఏమిటే ?" అంది.

"అక్కా ! ఇంకా ఆ వుత్తరాన్ని గురించే ఆలోచిస్తున్నావా ?"

ఆ మాటతో జయ చటుక్కున లేచికూర్చుని— "సుజా ! నువ్వా ఉత్తరం చూశావా ?" అనడిగింది.




మలయాళం వార పత్రిక 'మంగళం' వారు భారతదేశంలో పాతుకుపోయినటువంటి వరకట్న దురాచారాన్ని తరిమివెయ్యటానికి కృషి చేస్తున్నారు.

గత రెండు సంవత్సరాలలో ఈ పత్రిక ఆధ్వర్యంలో కేరళలో మొత్తం ఐదు సామూహిక వివాహ మహోత్సవాలు జరిగాయి. తల్లి, తండ్రులకు ఖర్చు లేకుండా, జాతి, మతాలతో సంబంధం లేని విధంగా నాలుగు వందల మంది పైగా దంపతులయ్యారు.

ఈ సామూహిక వివాహాలకు అన్ని వర్గాల మద్దతు లభించింది. వార్తా పత్రికలు కూడా చేయూత నిచ్చాయి.

ఇటీవల 'కాలికట్'లో జరిగిన సామూహిక వివాహాలకి కేరళ హోం మంత్రి వాయలార్ రవి ముఖ్య అతిధిగా విచ్చేశారు ఈ కార్యక్రమాన్ని దూరదర్శన్, ఆకాశవాణి కేంద్రాలు ప్రసారం చేసాయి.

ఈ జంటలకి ఉద్యోగ అవకాశాలను కల్పించడానికి 'మంగళం' వార పత్రిక వారు క్రొత్త పధకాలను చేపట్టారు. వాటికయ్యే ఖర్చంతా ఆ పత్రికవారే భరిస్తారు.

కాలికట్‌లో జరిగిన సామూహిక వివాహ మహోత్సవంలో దంపతులయిన 17 జంటలను చిత్రంలో చూడవచ్చు.

"ఆ. చూశాను. చూసి చాలా ఆనంద పడ్డాను." అంది వ్యంగ్యంగా.

"అదేమిటే అలా అంటావ్ ?"

"లేకపోతే ఏమిటక్కా ? ఆ వెధవ ఏదో రాస్తే నువ్వూ అమ్మా అలా బాధపడుతూ కూర్చోవడం బావుందా ?"

"అదికాదు సుజా ! నేను... నేనే... నీకు... అడ్డుగా..."

"అక్కా ! ఆ మాట మరోసారి అన్నావంటే వూరుకోను. నువ్వు నాకు అడ్డేమిటి ? నువ్వు అడ్డు లేకున్నా వాడిని చేసుకోవడానికి నేనేం సిద్ధంగా లేను."

"ఎందుకే అంత కోపం ?"

"కోపం కాదక్కా. బాధ. చూశావా ఆడపిల్ల జీవితం ఎంత నికృష్టంగా తయారయిందో. తను కోరుకుంటే చాలు ఏ ఆడపిల్లైనా సరే వచ్చి వొళ్ళో వాలుతుందని ఈ మగవాళ్ళ భావం ... ఆడపిల్లకి ఒక మనసుంటుందని వీళ్ళనుకోరు. అసలు, నీలాటి ఆడపిల్లలుండబట్టే మరీ బ్రతుకులింత అధ్వాన్నమైపోయాయి" అంటూ సుజాత తన కోపాన్ని జయ మీద చూపించింది.

"నేనేం చేశాను ?"

"ఏం చేశావా ? వాడి సంబంధం పోయిందని ఏడుస్తూ కూర్చోలేదూ ?"

"నా గురించి కాదే ఆ బాధ."

"మరి నా గురించా ? అదే వద్దన్నాను. అక్కా ! ముందు నీకు పెళ్ళవ్వాలి. నాకో అందమైన బావగారు రావాలి. ఆ తర్వాతనే నా పెళ్ళి. అక్కా ! ఏది జరిగినా మనమంచికే అంటారు. అలాగే, ఈ సంబంధం పోవడం కూడా మనమంచికేనేమో. ఇంతకన్నా చక్కటి వ్యక్తి నీకొస్తాడు. అందుకే ఇది తప్పిపోయింది. అక్కా ! నువ్వు మామూలుగా ఏమీ జరగనట్టే వుండాలి."

ఈ మాటలకు జయ నవ్వి — "అలాగే వుంటానే సుజా. నీలాటి చెల్లెలుండగా నాకు దిగులెందుకు ?"

"పొగడ్తలొద్దుగానీ, అక్కా! నువ్వు నవ్వుతూ, నవ్విస్తూ వుండాలి" అంటూ చాపమీదకి ఒరిగింది సుజాత.

"అలాగే లేవే !"

సుజాత ప్రక్కకు ఒత్తిగిల్లింది. ఆమె కళ్ళ ముందు శ్రీనివాస్ మెదలుతున్నాడు.

పూలరథంలాటి కారులో శ్రీనివాస్ ప్రక్కన కూర్చుని జీవితాంతం ప్రయాణం చేస్తుంటే బావుంటుంది !

శ్రీనివాస్ జ్ఞాపకాలతో సుజాత శరీరం పులకించిపోయింది. తియ్యని వూహాలతో మనస్సు నిండిపోయింది !

* * *

"అక్కా... అక్కా... "

గీత పిలుపుతో సుజాత దుప్పటి తొలగించి

చటుక్కున లేచి కూర్చుంది. ఎదురుగా గీత బిక్క మొగంతో నిలబడివుంది.

"ఏమయింది గీతా !"

"అక్కా ! మరే, అమ్మ బాత్‌రూమ్ దగ్గర పడిపోయిందే."

సుజాత లేచి దొడ్లోకి పరిగెట్టింది.

జయ తల్లిని ఒళ్ళోవుంచుకుని ఏడుస్తోంది.

తల్లికి స్పృహ లేదు.

"అక్కా ! ఏమయిందే ?"

జయ కొంగుతో కళ్ళు తుడుకుని— "ఏమోనే. నేను వంటింట్లో వున్నాను. దబ్బున పడ్డట్టు చప్పుడైతే వచ్చి చూద్దునుగదా, అమ్మ ఇలా పడి పోయివుంది."

"పాయం పట్టక్కా మంచం మీద పడుకో బెడదాం."

ఇద్దరూ కలసి కమలమ్మని లోపలికి తీసుకొచ్చి మంచం మీద పడుకోబెట్టారు.

"అక్కా ! నేను డాక్టర్ గారికి ఫోన్‌చేసి వస్తాను." అని సుజాత పక్కింటికెళ్ళి డాక్టర్‌గారికి ఫోన్ చేసింది.

వెంటనే ఫోన్ పలికింది.

"హాల్లో ! ఎవరూ ?"

"నేను డాక్టర్ కామేశ్వరరావుని."

శ్రీనివాస్ కానందుకు సుజాతకు నిరాశ కలిగింది. కానీ, అటువంటి సమయంలో కూడా తన స్వార్థం చూసుకుంటూ వున్నందుకు తనను తాను తిట్టుకుంది సుజాత !

"ఎవరమ్మా ?"

సుజాత తనను తాను సంబాళించుకుని తల్లి పరిస్థితి వివరించి వెంటనే రమ్మని కోరింది.

ఆయన — "ఇప్పుడే వస్తున్నా" అన్నాడు.

అన్నట్టుగా పది నిముషాల్లో వచ్చి, కమలమ్మని పరీక్షించి మందులు రాసిచ్చి —

"అమ్మగారికి పూర్తి విశ్రాంతి అవసరం. మందులు జాగ్రత్తగా వాడండి. పళ్ళూ పాలూ ఇవ్వండి. నేను రోజు విడిచి రోజు వచ్చి ఇంజక్షు నిస్తాను." అని చెప్పారు.

నెలాఖరు రోజులు. తన దగ్గరవున్న పాతిక రూపాయలూ ఫీజుగా ఇవ్వబోయింది.

ఆయన నవ్వి —

"నాకు ఫీజేవిటమ్మా వెర్రితల్లీ. అమ్మగారు లేచి తిరిగితే చాలు. వెళ్ళి ఆ డబ్బుతో అమ్మకి కావలసినవి కొను." అని చెప్పి కారు స్టార్టు చేసుకుని వెళ్ళిపోయారు.

ఆ పాతిక రూపాయిలూ కాక, కళ్యాణి దగ్గర తీసుకున్న పాతిక రూపాయిలు కూడా ఖర్చయ్యాయి. ఇవేకాక, జయ చేతిమీద వున్న రెండు బంగారు గాజులు కూడా మార్వాడీ కొట్టుకెడితేగానీ కమలమ్మ జబ్బు కొద్దిగా తిరుగుముఖం పట్టలేదు.

"అదేమిటక్కా ? నువ్వా రెండు గాజులు అమ్మకుండా నన్నొక్కటడిగితే ఇచ్చేదాన్నిగదా !"

"చాల్లే ! బయట కెళ్ళేదానివి. నీ చేతికి గాజులు లేకపోతే ఎలా ? ఇంట్లో వుండేదాన్ని నాకు గాజులు లేకపోయినా ఫరవాలేదు."



## ఇది సంధ్యా సమయం

అక్క ప్రేమకి పులకించిపోయింది సుజాత !

* * *

సుజాత ఈమధ్య తరచు శ్రీనివాస్ గురించే ఆలోచిస్తోంది. ఆ రోజు కన్పించడమే, మళ్ళీ కన్పించలేదు ! ఒక్కసారి కన్పిస్తే ఎంత బావుణ్ణు

సుజాత మనస్సు కొట్టుకుపోసాగింది.

శ్రీనివాస్‌ని ఎలా చూడాలి ?

కమలమ్మకి ఇంజెక్షనివ్వాలన్నా మధ్యాహ్నం వస్తాడు.

పోనీ, హాస్పిటల్ కెడితే ?

ఛీ ! కారణం లేకుండా వెడితే ఏమను కుంటాడు ?

మరెలా ? ఎలా ?

ఓ రోజు ప్రొద్దుటే రవికి చెవి వెనకాల వాచింది.

వాడేడుస్తూ కూర్చున్నాడు.

"ఒరేయ్ ! ఏడవకురా. సుజాతని ఆఫీసుకు పంపి నిన్ను డాక్టర్ దగ్గరికి తీసుకెడతాను" అంది జయ.

ఆ మాట విని సుజాత వెంటనే అందుకుంది— "నీ కెందుకే ఆ శ్రమ. ఆఫీస్ టైమ్‌కంటే ముందెళ్ళి డాక్టర్‌గారికి నేను చూపిస్తాలే."

"సరే. నీ యిష్టం" అని జయ పనులు చూసుకోసాగింది.

సుజాత త్వరత్వరగా తయారవసాగింది.




ఇన్నిరోజులకు శ్రీనివాస్‌ని చూసే అవకాశం వచ్చింది.

'మళ్ళీ ఒక్కసారైనా కన్పించలేదేమ'ని అడగాలి 'తరచూ కన్పిస్తూ వుండండి' అని చెప్పాలి.

అప్పుడేమంటాడో ?

అందంగా నవ్వుతాడేమో ?

తను అపురూపంగా దాచుకున్న గులాబీ రంగు జపాన్ పాలియస్టర్ చీరకట్టుకుంది. దొడ్లోపూసిన ఎర్రగులాబీనికోసి ఒక ప్రక్కగా జడలో పెట్టుకుంది

"ఎందుకే అంతమంచి చీరిప్పుడు ?" సుజాతకి అన్నం వడ్డిస్తూ అడిగింది జయ.

"కొన్న దగ్గర్నుంచీ పెట్లోనే వుండి పోయిందిగదా."

"చాలా బావుందే చీర. ఇవేళ నీకు దిష్టి తగలడం ఖాయం." అంది జయ నవ్వుతూ.

అవును ! శ్రీనివాస్ దిష్టే తగులుతుంది.

శ్రీనివాస్ ఈ చీరలో తనని చూసి ఏమంటాడో !

సుజాత గబ గబా అన్నం తింది.

రవిని తీసుకుని రిక్షాలో బయలుదేరింది.

రిక్షా హాస్పిటల్ సమీపిస్తుంటే సుజాత మనసు దడ దడ లాడింది.

రిక్షా నర్సింగ్ హోమ్ ముందాగింది.

రిక్షా దిగుతుంటే కాళ్ళు వణికాయి సుజాతకి. శరీరమంతా ఆదో విధమైన వుద్వేగంతో నిండి పోయింది.

రవితోపాటు లోపలకెళ్ళింది.

"డాక్టర్‌గారున్నారా ?"

"ఆ వున్నారు. కూర్చోండి." అన్నాడు కాంపౌండరు.

శ్రీనివాస్ వున్నాడన్నమాట.

పరిసరాల మీద దృష్టి నిలవడం లేదు. లోపలి నుంచి ఎప్పుడు పిలుపు వస్తుందా ! అని తలుపు వేపు చూస్తూ కూర్చుంది ఆత్రుతగా.

పది నిముషాలకు కాంపౌండరు వచ్చి — "వెళ్ళండమ్మా." అన్నాడు.

సుజాత లేచి తడబడుతున్న అడుగులతో తమ్ముడిని తీసుకుని లోపలకెళ్ళింది.

ఎదురుగా కుర్చీలో కూర్చున్న వ్యక్తిని చూసి నిలువునా నీరు కారిపోయింది.

కామేశ్వరరావుగారు సుజాతని చూసి —

"ఏవిటమ్మా ! ఇలా వచ్చావ్ ?" అంటూ పలకరించారు.

సుజాత తనని తాను సంబాళించుకుని, బలవంతంగా నవ్వి, రవిని గురించి చెప్పింది.

ఆయన, రవిని పరీక్షించి ఇంజక్షనిచ్చి, మందులు వ్రాసిన చీటీ ఇస్తూ —

"ఈ టాబ్లెట్స్ ప్రొద్దున్న ఒకటీ సాయంత్రం ఒకటీ వెయ్యమ్మా" అని చెప్పారు.

సుజాత అలాగేనంటూ తలూపి, నీరసంగా అడుగులేస్తూ బయటకొచ్చింది.

మనస్సంతా శూన్యమైపోయింది.

ఎన్నో రోజులనుంచీ లంఖణాలు చేస్తున్నదానిలా వుంది.

రవిని రిక్షా ఎక్కించి, జాగ్రత్తగా వెళ్ళమని చెప్పి, తమ బ్యాంకుకొచ్చింది.

# "కేర్‌ఫ్రీ రక్షణ —దానిలా మరొకటి లేదిక!"

మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన శుభ్రతో కూడిన ఆ సంరక్షణని యిస్తుంచిది.

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం.

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది. దీని లోపల భాగంలో గల మెత్తన్ని పొరలు, ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ, మీకు మరింతగా రక్షణని యిస్తుంది. అయినా యిది ఎంతో సన్నగా, సున్నితంగా, యిమడికగా ఉంటుంది.

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది.

కేవలం కేర్‌ఫ్రీలోనే క్రింది భాగం చుట్టూరా, నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3- వైపుల గల నీలి ప్లాస్టిక్ కపచం మధ్యన అడుగా నిలవడం కోసం ఉంది. అందుకే యిది తడిసి పోతుందని గాని, మరకలు పడుతుందని గాని భయం లేదు ఎంతో సౌకర్యం, మరెంతో వీలు.

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది దీన్ని వాడటం పారెయ్యడం ఎంతో తేలిక ..దీన్ని ఫ్లష్ చేసెయ్యండి, అంతే. మార్చుకోవడం కూడా వీలు. మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక. అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు మీరిక ఏం చెయ్యదలుచుకున్నా చేఫికరుగా చేయగలరు మరి ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ !

**ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది.**




Johnson & Johnson*

## కేర్‌ఫ్రీ* — కాలం మారుతున్నయీ రోజుల్లో పూర్తి రక్షణ.

## విద్యార్థి లోకం వ్యాస రచన పోటీలో ప్రత్యేక బహుమతి రు.150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

నేటి విద్యార్థులు రేపటి పౌరులు. వారికి సంఘంలో కొన్ని విధులు ఉన్నాయి. సంఘానికి వారి యెడల కొన్ని కర్తవ్యాలు ఉన్నాయి. ఈ విద్యార్థులకు సంఘానికి మధ్య ఉండే సంబంధాన్ని బట్టి వారి ఆశయాలు రూపొందుతాయి. విద్యార్థుల నేటి ఆశయాలను బట్టి రేపటి జాతి పరిస్థితి ఉంటుంది.

విద్యార్థుల ఆశయాలు కూడా కాలాను గుణ్యంగా మారుట తప్పదు. స్వాతంత్ర్యం రాకముందు గాంధీజీ ఉద్యమం నడుపుతున్న రోజులలో ఆనాటి విద్యార్థులు స్వాతంత్ర్యం ముఖ్యం, చదువు దానితర్వాతే అని భావించారు. పాఠశాలలు, కళాశాలలు వదలివేశారు. లాఠీ దెబ్బలు తిన్నారు. చెరసాలలకు వెళ్ళారు. అది ఆనాటి పరిస్థితులనుబట్టి సవ్యమే. కాని ఈనాడు ఆ పరిస్థితి లేదు. స్వతంత్రం వచ్చింది. చక్కగా చదువుకొనినవారు పరిపాలన, విద్యాబోధన, దేశ రక్షణ మొదలగు పనులలో పాల్గొనాలి. ఆనాడు మనకు కావలసినది స్వతంత్రం. ఈనాడు కావలిసినది అభివృద్ధి. వ్యక్తి అభివృద్ధికి దేశం అభివృద్ధికీ మధ్య విరోధం లేదు. తమ ప్రతిభను పెంపెందించుకోవాలనే కోర్కె నేటి విద్యార్థులలో ఉంది. జాతికి అభివృద్ధి కల్గించాలనే కోర్కె కూడా వారిలో ఉంది.

అందుకు దోహదకరంగా విద్య అభ్యసించే అవకాశం అర్హులైన అందరు విద్యార్థులకు ఉండాలి. ఈనాడు పాఠశాలల సంఖ్య పెరిగింది. కళాశాలల సంఖ్య హెచ్చింది. అందువల్ల సీట్ల సంఖ్య వృద్ధి పొందింది, కానీ ఏం లాభం? సీట్లు దొరక్క అనేకమంది విద్యార్థులు బాధ పడుతున్నారు. ఈ పరిస్థితి 'పోవాలనేది మా విద్యార్థుల ప్రథమాశయం. అంతేకాదు, పాఠశాలలు కళాశాలలలో చేర్చుకొనబడిన విద్యార్థులకు ఉత్తమమైన శిక్షణ లభించాలి. చిన్న చిన్న తరగతులు, సమర్థులైన ఉపాధ్యాయులు, సకాలంలో తగినన్ని పాఠ్య పుస్తకాల సరఫరా మొదలగు సౌకర్యములు ఉండాలి భారతదేశము లాంటి పేద దేశములో మిక్కిలి ఖరీదయిన పాఠశాల భవనములు వసతి గృహములు నిర్మించుట సాధ్యము కాదు. అయితే నిరాడంబరములైనప్పటికీ ఆరోగ్యకరములైన పాఠశాల భవనముల నిర్మించుట అవసరము పాఠశాలలలో, కళాశాలలలో నేర్పే విద్యను మన దేశపు అవసరాలను దృష్టిలో ఉంచుకొని మార్చాలి.

ఇటు దేశానికి అటు విద్యార్థులకు కూడా శత్రువు నిరుద్యోగం. కాబట్టి దానిని నిర్మూలించాలి. అందుకొరకు విద్యావిధానంలో మార్పు తేవాలి. పరిశ్రమలు స్థాపించాలి. "అలనాటి రామభద్రునకు అరణ్యవాసం తప్పలేదు, ఈనాటి పట్టభద్రునకు నిరుద్యోగం తప్పలేదు." ఈ పరిస్థితి పోవాలి

"మీకు జాతి ఏమిచ్చిందన్నది కాదు ప్రశ్న మీరు జాతి కేమిచ్చారన్నది ముఖ్యము." అన్నాడు ఒకనాటి అమెరికా అధ్యక్షుడు "జాన్ కెన్నడీ". ఈ మాటతో ఈనాటి విద్యార్థిలోకం పూర్తిగా ఏకీభవిస్తోంది. అయితే దానిని ఆచరణలో పెట్టడానికి తగిన వాతావరణము మాత్రము లోపిస్తోంది.

ఎక్కడ చూసినా అసంతృప్తి, స్వార్థ కలహాలతో గూడిన ఈ సంఘంలో మా విద్యార్థి లోకానికి ఉన్నతాశయాలు అలవడ్డం కష్టం. ఆ కాలంలో వివేకానంద, గాంధీ, నేతాజీ వంటి నాయకుల ప్రబోధం విద్యార్థులకు లభించింది అటువంటి నాయకులు మరల పుట్టి విద్యార్థులకు వెలుగుబాటలు చూపాలి. అదే మా ప్రధానాశయం. ★

### రచయిత్రి పరిచయం



"పేరు : రాంపల్లి వైజయంతి.
జననము : 23-8-69.
తల్లిదండ్రులు : శ్రీయుత ఆర్. యస్. శర్మ, శ్రీమతి ఆర్. రాధ.

విద్యాభ్యాసం : హైదరాబాదు నారాయణ గూడాలోని మాడపాటి హనుమంతరావు ఉన్నత పాఠశాల యందు "9"వ తరగతి.

అభిరుచులు : విద్యార్థినుల సాంస్కృతిక కలాపాలు, పుస్తకములు, పత్రికలు చదువుట, నూతన ప్రదేశములు చూచుట.

లోగడ కొన్ని బహుమతులు వచ్చినను పత్రికాముఖముగా బహుమానము పొందుట యిదే ప్రథమము. ఈ తొలి బహుమానము పూజ్య దేశోద్ధారకులు స్థాపించిన పత్రిక నుండి లభించుట నాకును, మా యింట్లో వారందరకును ఆనందమును కల్గించినది."

— ఆర్. వైజయంతి

---

గులాబీ రంగు చీరలో మెరిసిపోతున్న సుజాతని చూసి —

"ఏమిటే విశేషం?" అంది కళ్యాణి.

అసలే దిగులుగా వున్న సుజాత —

"ఏం లేదు" అని పని చూసుకోవడంలో మునిగిపోయింది.

చిరాగ్గా వున్న సుజాత ముఖాన్ని చూసి 'ఏం జరిగిందో?' అని అనుకుంది కళ్యాణి.

పన్నెండు గంటల సమయంలో కుమార్ సరాసరి సుజాత దగ్గరకొచ్చి —

### ఇది సంధ్యా సమయం

"హల్లో" అన్నాడు.

సుజాత తలెత్తలేదు.

"అబ్బా! ఈ చీరలో ఎంతందంగా వున్నారండీ."

అతని మాటలు వింటుంటే సుజాతకి ఎక్కడ లేని కోపం వచ్చింది.

తను ఇటువంటి పొగడ్తలు ఎవరినోట వినాలనుకుంది? చివరకు ఎవరి నోట వింటోంది!?

"మిస్ సుజాతా ..."

ఇంతలో కళ్యాణి వచ్చి — "సుజాతా! నిమ్మ ఏజంటుగారు రమ్మంటున్నారు. వెళ్ళు" అని చెప్పింది.

సుజాత కళ్యాణివేపు చూసింది. కళ్యాణి కళ్ళతో చిన్నగా సంజ్ఞ చేసింది. దాన్ని అర్థం చేసుకున్న సుజాత లేచి లోపలకెళ్ళింది.

కుమార్ కళ్యాణివేపు కొరకొరా చూసి అక్కడ్నుంచి కదిలాడు.

(ఇంకా వుంది)

సీరియల్

# జీవన్మృతులు

## ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

## స్వేచ్ఛానువాదం: కొలను వేంకట దుర్గాప్రసాద్



(గత సంచిక తరువాయి)

### మీనామ్యురే డైరీ

విట్‌బి, జూలై 24 : లూసి నన్ను స్టేషన్ దగ్గర కలిసింది. మనిషి ఎప్పుడూలేనంత సంతోషంగా, అందంగా కనిపించింది. క్రిసెంట్‌లో వున్నవాళ్ల ఇంటికి కారులో వెళ్లాం. ఇది చాలా అందమైన ప్రదేశం 'ఎస్క్' చిన్ననది. లోయగుండా ప్రవహిస్తూ హార్బర్ దగ్గరి కొచ్చేసరికి పెద్దదిగా మారుతుంది. దీనిమీద పెద్ద వంతెన వుంది. అది చాలా ఎత్తయిన స్థంభాలమీద కట్టబడింది. అక్కడ నిలబడిచూస్తే చాలా ఎత్తు అనిపిస్తుంది. లోయ పచ్చగా అందంగా వుంది. ఆ లోయ ఏటవాలుగా లేకుండా నిట్టనిలువుగా వుంది. పాత పట్టణంలో వున్న ఇళ్ళ కప్పులన్నీ ఎర్రని పెంకుతో వున్నాయి. ఇళ్ళు చూడ్డానికి ఒకదానిమీద ఒకటి కట్టినట్టు వుంటాయి. పట్టణానికి కుడివైపున శిథిలమైన 'విట్‌బీ అబ్బీ' ప్రాంతం. దాన్ని 'డేన్స్' తెగవారు పాడుచేసారు. 'యర్‌మాయిన్' చరిత్రలో ఒక సంఘటన — అదేమిటంటే ఒక అమ్మాయిని గోడలో పెట్టి కట్టడం. ఆ గోడ ఇక్కడే వుంది. ఈ ప్రాంతం చాలా అందమైంది. శృంగారపరంగా ఎంతో చరిత్ర కలిగివుంది అక్కడ వున్న ఒక కిటికీలో ఒక తెల్లని స్త్రీ రూపం కనిపిస్తుందని ఒక కథ ఈ ప్రాంతానికి, పట్టణానికి మధ్య ఒక చర్చి వుంది. దానిచుట్టూ సమాధులతో స్మశానం వుంది. విట్‌బీలో నాకు బాగా నచ్చిన ప్రదేశం ఇదే. ఎందుకంటే, అక్కడ్నించి పట్టణం అంతా కనపడుతుంది హార్బర్ ప్రాంతం, సముద్రంలోకి చొచ్చుకుపోయినట్టు అనిపించే కొంత మైదానం కనిపిస్తుంది. అక్కడ కొన్ని సమాధులు సగం కొట్టుకుపోయి వున్నాయి అక్కడే బాగా దిగువకెళితే ఇసుకదారి వస్తుంది. అక్కడ అందరూ షికారు కొస్తారు. కూర్చోడానికి వీలుంది జనం అక్కడికెళ్ళి కూర్చుని రోజల్లా అందమైన సముద్రాన్ని తిలకిస్తూ ఆ గాలిని ఆస్వాదిస్తూ గడిపేస్తారు. నాకు ఇక్కడే కూర్చుని రాసుకుందామనిపిస్తుంది ఈ డైరీ నా మోకాళ్లమీద పెట్టుకుని ఇక్కడే కూర్చుని రాస్తున్నాను. ఎవరో ముగ్గురు ముసలాళ్ళు మాట్లాడుకుంటూ వున్నారు, నాకు కాస్త దగ్గరగా వాళ్లను వింటూ వున్నాను. రోజల్లా అలా కూర్చుని కబుర్లు చెప్పకోడం తప్ప, వారికి వేరే పనేం లేదనిపించింది.

హార్బర్ ఇంకా దిగువలో కాస్త దూరంగా వుంది. దానికి ఒక పొడవైన నల్లరాయి గోడ ఒకటి సముద్రంలోకి చొచ్చుకుపోయివుంది. గోడ చివర కొద్దిగా వంపు వుంది. ఆ వంపు మధ్యలో లైట్‌హౌస్ వుంది. సముద్ర కెరటాలు ఆ లైట్‌హౌస్ చుట్టూ ఎత్తుగా లేస్తుంటాయి. దానికి దగ్గర్లో మరో లైట్‌హౌస్ వుంది. ఈ రెండిటి మధ్య హార్బరుకు దారి వుంది.

ఇక్కడ నీళ్ళు చాలా భాగుంటాయి. కెరటం బయటకొచ్చినప్పుడు అక్కడి ఇసుకతిన్నెల్నీ, అక్కడా ఇక్కడా వున్న రాళ్ల గుట్టల్నీ మింగేస్తుంది. హార్బర్ బయట, దక్షిణం వైపు వున్న లైట్‌హౌస్ వెనక నుండి, దాదాపు అరమైలు ఎత్తువున్న రాతి గట్టు వుంది. ఆ గట్టు పైభాగాన ప్రమాదపు అంచు గుర్తింపబడివుంది. అక్కడొక గంటవుంది. వాతావరణం సరిగ్గా ప్రశాంతంగా లేనప్పుడు అది గాలికి కదిలి మ్రోగుతుంది. అదొక విచార సూచనగా వినవస్తుంది ఆ శబ్దం. ఓడలు కనపడకుండా పోయినప్పుడు గంటలు మ్రోగుతాయి అని చెప్పకుంటూ వుంటారు దీన్ని గురించి ఆ ముసలతన్ని అడగాలి అతను ఇటే వస్తున్నాడు

ముసలతను తమాషా మనిషి. అతని మొహంలో ఎన్నో ముడతలు. బాగా ముసలి వాడునుకుంటాను. అతనికి దాదాపు వంద సంవత్సరాల వయసు అని చెప్పారు. వాటర్‌లూ యుద్ధం జరిగినప్పుడు, అక్కడే 'గ్రీన్‌లాండు ఫిషింగ్ ఫ్లీట్'లో నావికుడుగా వున్నాడట. ప్రతిదానికి సందేహపడే మనిషిలా వున్నాడు. ఈ గంటలమోత గురించి, అక్కడ 'అబ్బీ'లో కనిపిస్తుందని చెప్పబడే 'తెల్లని స్త్రీ' గురించి అడిగాను. అతను చాలా మోటుగా సమాధానం చెప్పాడు

'దాని గురించి చెప్పడానికేముంది అవన్నీ పాతబడిపోయిన విషయాలు. అవన్నీ అప్పుడు లేవని నేను చెప్పడంలేదు. కానీ, నేను సముద్రం మీద వున్నప్పుడు వీటిగురించి వినలేదు. అవన్నీ పనిలేని వాళ్ళకు తప్పితే, నాలాంటి మంచి అమ్మాయికి ఎందుకు ? వూర్కే అక్కడ్నించి ఇక్కడ్నించి వచ్చి, కనపడింది తింటూ, టీలు తాగుతూ, వచ్చే జనానికి ఆ కథలు ఇష్టంగా వుంటాయి. అసలు నాకే అనిపిస్తుంది, ఇలాంటి కాకమ్మ కథలు వాళ్ళకు చెప్పేవాళ్ళు ఎవరుంటారా అని. వార్తాపత్రికల్లో కూడా అంతే, పనికిరాని కబుర్లు.' ఈ ముసలతని దగ్గర్నించి కుతూహలమైన విషయాలు రాబట్ట వచ్చుననిపించింది. అతని రోజుల్లో తిమింగలాలు ఎలా పట్టేవాళ్ళు అని అడిగాను. అతను చెప్పడం మొదలెట్టబోయాడు ఇంతలో ఆరు గంటలు కొట్టింది. అతను లేచాడు 'నేను వెళ్ళాలి. మా మనవరాలు వేచి వుండలేదు.' అని వెళ్ళిపోయాడు. గబగబా మెట్లు దిగుతూ వెళ్లడం చూసాను అక్కడి మెట్లు ఒక గొప్ప విశేషం ఆ మెట్లు పట్టణం దగ్గర్నుంచి చర్చి వరకు వున్నాయి వందల కొద్ది మెట్లు. అవి ఎక్కడో ఒక వంటదారి దగ్గర అంతమవుతాయి ఆ మెట్లు తక్కువ ఏటవాలుగా, ఎంత తక్కువ అంటే, గుర్రం మామూలుగా నడిచి ఎక్కి దిగేంతగా వున్నాయి. 'అబ్బీ' ప్రాంతానికి దీనికీ ఏదో కొంత సంబంధం వుందనిపించింది నేను ఇంటికి వెళ్ళాలి. లూసీ వాళ్లమ్మ బయటికెళ్ళారు. ఈపాటికి ఇంటికి వచ్చే వుంటారు.

ఆగస్టు 1. గంట క్రితం లూసీతో నేను ఇక్కడకు వచ్చాను. ఆ ముసలి స్నేహితునితో మాకు కుతూహలమైన సంభాషణ జరిగింది. అతని మిగతా ఇద్దరు మిత్రులుకూడా అతనితోనే వున్నారు. అతని పాతరోజుల్లో చాలా నిరంకుశంగా ప్రవర్తించేవాడు అనుకోవాలి. అతను ఏ విషయమూ ఒప్పకోడు పైగా అందర్నీ కించపరుస్తాడు. వాళ్లతో వాదనలో నెగ్గలేకపోతే, పోట్లాట పెట్టుకుని, వాళ్ళచేత నోరు మూయించి, తను గెలిచినట్టుగా భావిస్తారు

---

**జరిగిన కథ — 6 :** 'తను ఇక్కడ బందీ' అని తెలుసుకొన్న జోనాథన్‌లో భయంకరమైన ఆలోచనలు కల్గుతుంటాయి తనని తినబోయిన దెయ్యాల్ని అడ్డుకొని వాటిని సమాధాన పరచి పంపుతాడు డ్రాకులా. అసలు డ్రాకులా మనిషి కాదేమో అనే అనుమానం జోనాథన్‌కి కల్గుతుంది. అతను ఇక్కడి విషయాల్ని ఉత్తరాల ద్వారా తనవారికి తెలియపర్చడానికి చేసిన ప్రయత్నాలను డ్రాకులా అడ్డుకొంటాడు. ఇక తన చావు దగ్గిర పడిందని తెలుసుకొన్న జోనాథన్ అక్కడి నుంచి తప్పించుకోవడాన్కి మార్గాలు వెతుకుతుంటాడు. మిస్ మీనామ్యురే, మిస్ లూసీవెస్ట్ ఒకరికొకరు తమ తమ విషయాలను ఉత్తరాల ద్వారా తెలియ పర్చుకొంటారు సి మోరిస్‌కు ఆర్థర్ హోల్మ్‌వుడ్ క్విన్సీ తన దగ్గర వళ్లు జలదరించే కబుర్లు వున్నాయని, తనకోసం ఎదురు చూడమని టెలిగ్రాం ఇస్తాడు.

---

తెల్లటి గౌనువేసుకుని లూసీ చాలా అందంగా కనిపించింది. నేనొక విషయం గమనించాను. మేం ఇద్దరం కూర్చోగానే, ఆ ముసలివాళ్ళు ముగ్గురు ఆలస్యం చేయకుండా వచ్చి ఆమె దగ్గరగా కూర్చున్నారు. ఆమె వాళ్లతో కులాసాగావుంది. అప్పటికప్పుడు వాళ్ళు ఆమె ప్రేమలో పడ్డారేమో ననిపించింది. ఆ శతవృద్ధుడు కూడా, ఆమెతో వాదనపెట్టుకోకుండా, అన్నిటికీ వూకొట్టేస్తున్నాడు. ఆ సమయంలో అతన్ని మాటల్లోపెట్టి, ఆ ప్రాంతానికి సంబంధించిన కథల గురించి అడిగాను. వెంటనే ఒక ఉపన్యాసంలా చెప్పాడు. అతను చెప్పింది గుర్తు చేసుకోవడానికి ప్రయత్నించి రాస్తున్నాను.

''అదంతా శుద్ధ పిచ్చివాగుడు, డబ్బా, వట్టి చెత్త. అంతకంటె ఏంలేదు. ఈ దయ్యాలు, భూతాలు, స్త్రీ కిటికీలో కనపడ్డం, ఇవన్నీ అభూత కల్పనలు. ఇవన్నీ ఎవరో మనుషుల్ని భయపెట్టి, తమ స్వలాభం కోసం చేసే ప్రచారాలు. పేపర్లో కూడా ఇదే వాగుడు. ఆ అబద్ధాలు కత్తిరించి అందరికీ చదివి వినిపించడం కూడా చేస్తారు. సమాధి రాళ్లమీద కొన్నిమాటలు చెక్కారు. నీ చుట్టూ వున్న ఈ సమాధులు గమనించు.' 'దేహం ఇక్కడే వుంది' లేకపోతే 'పవిత్ర జ్ఞాపకార్థం' అని రాసి వుంటాయి.

ఎప్పుడో పోయినవాళ్ళ దేహాలు ఇంకా అక్కడ వుంటాయా, వాళ్ల జ్ఞాపకాలు మిగులుతాయా ? వారిమీద పవిత్రభావం సంగతి అటుంచు, అసలు వాళ్లని తలచేవారేరి ? అందుకే, ఆ రాతలన్నీ అబద్ధాలంటాను. పచ్చి అబద్ధాలు తప్ప మరొటికాదు. దేవుడు పాపపుణ్యాలు లెక్కకట్టి తీర్పు చెప్పేరోజున చూడాలివీళ్లని. సమాధుల పునాదులు పెకలించుకుని బయటపడి, సమాధి ఫలకాలపై వ్రాసినవి దేవుడికి చూపిస్తారు, తామెంత మంచివాళ్లో చూడమని ఒకళ్ళకొకళ్ళు తోసుకుంటూ, జారిపడుతూ గోల చేస్తారు'' అన్నాడు.

ఉపన్యాసం చెప్పి ఎంతో తృప్తి చెందినట్టుగా కనిపించాడు అతడు. వాళ్ల మిత్రుల దగ్గర తీవి ప్రదర్శించాడు.

'ఓ మిస్టర్ స్వేల్స్, అయితే, ఈ సమాధులన్నీ తప్పుడివేనంటారా ?' అడిగాను, అతనికి వురెక్కిస్తూ.

'కొన్ని మంచి వుండొచ్చు. కానీ ఎక్కువ అబద్ధాలే ! ఇప్పుడు నీ సంగతే తీసుకో. నువు ఈ ప్రాంతానికి కొత్త. ఈ చర్చి ప్రాంతం చూడు ... (అతని మాటలు ఎంతో యాసతో కూడివున్నాయి. అర్థం చేసుకోవడం చాలా కష్టం) ఇక్కడో సమాధి వుంది. దానిమీద ఏం రాసివుందో చదువు' అన్నాడు. చదివాను.

''ఎడ్వర్డ్ స్పెన్స్‌లాగ్, నావికుడు, ముప్పయ్యో ఏట ఏప్రిల్ 1854లో ఆండ్రెస్ తీరప్రాంతంలో సముద్ర దొంగలచేత హత్యగావింపబడ్డాడు'' అది చదివి వచ్చిన తర్వాత మళ్ళీ చెప్పడం మొదలెట్టాడు.

'వాడ్ని ఎవరు తెచ్చారు ఇక్కడికి ? ఎక్కడో ఆండ్రెస్ తీరంలో హత్యచేసారు. నువ్వేమో, ఇప్పుడు అతను ఈ సమాధిలో వున్నాడని చెపుతున్నావు. ఎట్లా కుదుర్తుంది. అట్లా చచ్చిన వాళ్ళవి ఒక డజనుమంది పేర్లు చెప్పగలను. గ్రీంలాండు సముద్రంలో చచ్చారు. అక్కడ్నుంచి వాళ్ల ఎముకలు ఎక్కడికో కొట్టుకుపోయి వుంటాయి. ఇంకా ఇక్కడ సమాధులు చాలావున్నాయి. చాలా చిన్న అక్షరాలతో రాసారు. ఆ అబద్ధాలు చదువు. 'లోరీ' ఇరవై ఏళ్ల వయసులో గ్రీంలాండ్ సముద్రంలో పోయాడు. ఆండ్రూ వుడ్‌హౌసీ అదే సముద్రంలో 1777లో మునిగిపోయాడు. జాన్ పాక్స్‌టన్ 'కేప్ ఫేర్‌వెల్'లో మరుసటి సంవత్సరం మునిగి పోయాడు. జాన్ రాలింగ్స్ ఒకడు మునిగి పోయాడు. ఇక్కడ డప్పులు మోగించినప్పుడు వాళ్లంతా ఈ విట్‌బీకి పరుగెత్తుకుని రావాలంటావా ?' అన్నాడు.

'మీరు చాలా పొరబడుతున్నారు. మీరు చెప్పేది ఎలా వుందంటే, దేవుడు పాపపుణ్యాల గురించి తీర్పు చెప్పేటప్పుడు, ఈ సమాధుల ఫలకాలు తీసుకుని వెళ్లాలంటారు. అది అంత అవసరమా ?' అడిగాను.

'మరయితే, ఈ ఫలకాలూ, ఈ సమాధులు ఎందుకు ?' అడిగాడు.

'ఏదో బంధువుల తృప్తి కోసం !' అన్నాను.

'ఏమిటీ తృప్తి ? ఆ రాతలన్నీ అబద్ధాలని బంధువులకు తెలుసు, వూళ్లోవాళ్లకు తెలుసు. ఇంకా ఏమిటి తృప్తి దానిలో ?' అంటూ అక్కడే వున్న మరో సమాధి చూపించాడు. అది రాతిగుట్టకు దగ్గరగా వుంది. దానిమీద రాత నాకు తలక్రిందులుగా కనిపించింది. లూసీ అటువేపు కూర్చోడంవల్ల చదవగల్గింది ''జార్జికానన్ జ్ఞాపకార్థం. ఇతడు 1873 జులై 29న పై కొండలమీంచి దొర్లి



చనిపోయాడు. ఈ సమాధి తల్లి, కొడుకుమీద ప్రేమకొద్దీ కట్టించింది. ఇతను ఆమెకు ఒక్కగానొక్క కొడుకు. ఆమె విధవరాలు''. అతనివంక తిరిగి 'మిస్టర్ స్పేల్స్, నిజం చెప్పు, అందులో నాకు నవ్వుకోవాల్సిన విషయం ఏమీ కనిపించడంలేదు.' అంది చాలా గంభీరంగా.

'అందులో ఏం తమాషా లేదా, హాహ్హాహ్హా! తల్లి గురించి నీకు తెలీదు. అతడు నీచుడు. ఇద్దరికీ ఒకరిమీద ఒకరికి ద్వేషం. అతను ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయాడు, అతని జీవితంమీద ఆమె తీసుకున్న ఇన్సూరెన్సు డబ్బు రాకుండా వుండడానికి. మరి ఆ ఫలకంమీది రాత తప్పుకాదా!' అంటూ చేతిలోని కర్రతో దాన్ని కొట్టాడు. నాకు జవాబు తోచలేదు. లూసీ లేమ్సా చెప్పింది. 'ఇవన్నీ మాకు ఎందుకు చెప్తావు? ఇది మాకు ఇష్టమైన చోటు. దీన్ని వదిలి వెళ్లలేం. నేను వెళ్లి దానిమీద కూర్చోవాలనుకుంటున్నాను.'

'దానివల్ల కీడేం వుండదు. వెళ్లి కూచో, ఓ కన్నెపిల్ల వచ్చి వొళ్ళో కూర్చుందని ఆ జార్జి సంతోషిస్తాడు. అతనేం చెయ్యడు. అంతదాక ఎందుకు, నేను ఇరవై ఏళ్లనుంచీ కూర్చుంటున్నాను. ఏమిటయింది? కొన్నాళ్లకు ఇవన్నీ ఇక్కడ్నుంచి పోతాయి గుర్తుల్లేకుండా. వేళయింది. ఇక వెళతాను' అని వెళ్ళిపోయాడు.

ఒకరి చేతుల్లో ఒకరు చెయ్యి వేసుకుని కాసేపు ఇద్దరం కూర్చున్నాం. ఆమె ఆర్థర్ గురించి, వాళ్ల రాబోయే కల్యాణ ఘడియ గురించి మళ్ళీ చెప్పింది. నా మనసు మాత్రం కాస్త బాధపడింది, నెల రోజులుగా జోనాథన్ నుంచి కబురేమీ విననందుకు.

అదేరోజు: మనసు బాగోక నేనొక్కదానే ఇక్కడికొచ్చాను. నాకు ఉత్తరం రాలేదు. జోనాథన్ దగ్గర్నించి విశేషమేమీ లేదని, క్షేమమేననీ అనుకోవాలి. గడియారం తొమ్మిది గంటలు కొట్టింది. దీపాలు వూరంతా వెదజల్లినట్లు కనిపించాయి. వీధులున్న చోట అవి బారులు తీర్చినట్లున్నాయి. మిగతా చోట్ల ఒంటరిగా వెలుగుతున్నాయి. ఆ దీపాలు ఎస్క్ నది దగ్గర మొదలయి, అక్కడి లోయవంపులో అంతమయిపోతున్నాయి. నా ఎడమ వేపు ఒక పెద్ద ఇంటికప్పు నా దృష్టికి అడ్డం రావటం వల్ల, నల్లటి చారలా తప్ప ఏం కనిపించడం లేదు. నా వెనక దూరంగా పొలాల్లో గొర్రెలు, మేకపిల్లలు అరుస్తున్నాయి. నా ముందర దిగువ రోడ్లమీద గాడిదల డెక్కల చప్పుడు వినవస్తున్నాయి దూరంగా వాల్ట్జ్ సంగీతం మంచి సమయంలో వినపడుతోంది. కాస్త దూరంలో హార్బర్ గట్టు దగ్గర 'విముక్తి సేన' సభ జరుగుతోంది. జోనాథన్ అసలు ఎక్కడున్నాడు? నా గురించి అసలు ఆలోచిస్తున్నాడా? అతను ఇక్కడ వుంటే బాగుణ్ను.

## డాక్టర్ సేవార్డు డైరి

జూన్, 5: రెన్‌ఫీల్డు గురించి తెలుసుకోవాలన్న కుతూహలం బాగా పెరుగుతోంది. అతని దగ్గర కొన్ని గుణాలు బాగా పాతుకుపోయివున్నాయి అతను స్వార్థపరుడు. దాపరికపు మనిషి. అతను చేసే దానికి ఏదో కారణం వుంటుంది. అతని ధ్యేయం ఏమిటో

# జీవన్ మృతులు

నాకు అర్థం అయినట్టు అనిపించింది. అతని దగ్గర ఏదో ప్రణాళిక వుంది, ఎటు వంటిదో నాకు తెలీదు గానీ. అతనికి జంతువులంటే వల్లమాలిన ప్రేమ కానీ, నిజానికి వాటిపట్ల చాలా క్రూరంగా వుంటాడని నేను అప్పుడప్పుడూ వూహిస్తుంటాను. అతను పెంచే ప్రాణులు చాలా వింత అయినవి. ప్రస్తుతం అతను ఈగల్ని పెంచుతున్నాడు. అతని దగ్గర వున్న ఈగల సంఖ్య చూసి, ఇక చాలు బాబూ అని బతిమలాడాను కూడా. అట్లా చెప్పినందుకు కోపంతో విరుచుకు పడతాడనుకున్నాను. కానీ కాస్త ఆలోచించడం మొదలు పెట్టాడు. ఓ క్షణం ఆలోచించి చెప్పాడు ''మూడు రోజుల్లో వీటన్నిటినీ వదిలించుకుంటాను'' అన్నాడు. వేచి చూడాలి.

జూన్ 18: ఇప్పుడతను సాలెపురుగుల మీద పడ్డాడు. పెద్ద పెద్ద వాటిని పట్టి ఒక పెట్టెలో పడేసాడు. తన దగ్గరున్న ఈగల్ని వాటికి ఆహారంగా వేయడం మొదలెట్టాడు ఈగల సంఖ్య బాగా తగ్గిపోయింది. సగం ఈగల్ని సాలెపురుగుల ఆహారంగా వాడి, వాటిని ఆకర్షించాడు.

జూలై 1: ఈగల్లాగే, అతని సాలెపురుగులు కూడా పెద్ద తలనొప్పిగా తయారయ్యాయి. వాటిని కూడా వదిలించుకోమని ఇవాళ అతనికి చెప్పాను. అందుకు అతను చాలా విచారంగా మొహం పెట్టాడు. కనీసం కొన్నిటినైనా వదిలించుకోమని చెప్పాను. అతని మొహం వికసించింది. పోయినసారి లాగే, వాటి సంఖ్య తగ్గించడానికి మూడు రోజులు కావాలన్నాడు. అతనితో వుండడం అసహ్యమనిపించింది. ఎందుకంటే, అప్పుడు గదిలోకి ఒక పెద్ద ఈగ వచ్చింది ఏదో ఆహారంతో జుయ్యిమని గదిలో తిరిగింది అతను దాన్ని రెండు వేళ్లతోను పట్టుకుని దానివంక కొన్ని క్షణాలు చూసాడు. అతను ఏం చెయ్యబోతున్నాడో తెలుసుకునేలోపల, గభాల్న నోట్లో పెట్టుకుని తినేశాడు బాగా తిట్టాను తినడానికి చాలా బాగుందని వాదించాడు. ఈ సంఘటన చూడగానే, ఆ సాలెపురుగులను ఎట్లా వదిలించుకుంటాడో వేచిచూడాలనిపించింది. అతని బుర్రలో ఎన్నో సమస్యలున్నాయనిపిస్తుంది. అతని దగ్గర ఒక చిన్న 'నోట్‌బుక్' వుంది. ఎప్పుడూ దాంట్లో ఏవో రాస్తుంటాడు. ఆ పుస్తకం పేజీల నిండా అంకెలున్నాయి. కొన్ని అంకెలు విడివిడిగా

**చిరునామాలు: మనవి**

పత్రికలో ఎడ్రసు యుతల చిరునామాలు కావాలని వ్రాయవద్దని మనవి. మీరు వారికి వ్రాసే ఉత్తరాలు కేరాఫ్ ఎడిటర్, ఆంధ్ర పత్రిక వారపత్రిక, గాంధీనగరం అని వ్రాసి నట్లయితే — మా కార్యాలయం వాటిని ''రీ డైరెక్టు'' చేయడానికి ప్రయత్నిస్తుంది. కనుక రిప్లయి కార్డులు వ్రాయవద్దని మనవి.

— సం॥

కూడి, వాటిని పెద్ద అంకెలతో కలిపి వున్నాయి అట్లాంటి పెద్ద అంకెలన్నీ మళ్ళీ విడిగా కూడి వున్నాయి అదంతా ఆడిటర్లు వేసే అంకెల పద్ధతిలా కనిపించింది.

జూలై 8: అతని పిచ్చిలో ఏదో ఒక పద్ధతి కనిపించింది నా బుర్రలో అతని గురించి నాటుకున్న బీజం మొలకెత్తసాగింది అతను చేయబోయేది నేనూహించినట్టుగా జరిగితే, నా బుర్రలో నరాలు తెగుతాయనిపించింది కొన్ని రోజులు అతనికి దూరంగా వున్నాను, అతనిలో మార్పు తెలుసుకోడానికి అతనిలో మార్పు ఏం కనిపించలేదు ఎటొచ్చీ పాతవాటిని వదలి, కొత్తవాటిని పట్టుకున్నాడు. ఈసారి వూరపిచ్చుకను పట్టుకుని, కొంత మచ్చిక చేసుకున్నాడు. సాలెపురుగులు బాగా తగ్గిపోయాయి వాటిని దానికి వేసి మచ్చిక చేసుకుని వుంటాడు ఇంకా కొన్ని సాలెపురుగులు వున్నాయి ఈగల్ని పట్టుకుని వాటికి ఆహారంగా వాడుతునే వున్నాడు.

జూలై 19: నా మిత్రుడు తన అలవాట్లను బాగా వృద్ధి చేసుకుంటున్నాడు. అతని కాలనీ అంతా వూరపిచ్చుకలు ఈగలు, సాలెపురుగులు దాదాపు లేనట్టే. అతని దగ్గరి కెళ్ళినపుడు, పరుగెత్తుకుని నా దగ్గరకొచ్చి 'నువ్వు నాకో సాయం చేసిపెట్టాలి తప్పదు, చేసి పెట్టాలి' అన్నాడు అట్లా అంటున్నప్పుడు కుక్కలా మీదపడ్డాడు. ఏమిటది అని అడిగాను. అతను చాలా పరవశంతో మాట్లాడాడు 'నాకో పిల్లి కూన, చక్కని పిల్లికూన, చక్కగా ఆడుకునేది కావాలి. నేను దానితో ఆడుకుంటాను అన్నీ నేర్పుతాను. బాగా తిండిపెడతాను' ఇట్లాంటిదేదో అడుగుతాడనిపించింది. వూర పిచుకలు బాగా బలిసివున్నాయి. చాలా చురుగ్గావున్నాయి. ఈగల్లా సాలెపురుగుల్లాగ, వీటికి కూడా మూడుతుందని నాకు తెలుసు. అతను అడిగింది చూస్తానని చెప్పాను 'పిల్లి కూనకన్నా పెద్ద పిల్లిని తెస్తే బాగుండదా?' అడిగాను అతను నమ్మలేకపోయాడు

'అయ్యో! పెద్ద పిల్లి అయితే నాకు ఇష్టం. నువ్వు ఒప్పుకోవని పిల్లికూన అడిగాను. పిల్లికూనను అడిగితే ఎవరూ కాదనరు కదా!' అన్నాడు వెంటనే దొరకడం సాధ్యపడదు చూస్తానని చెప్పాను. అతని మొహం క్రోధంతో వంగిపోయింది. అది ఏదో ప్రమాదపు హెచ్చరికలా వుంది. కనుకొనల్లోంచి చంపేట్టుగా చూస్తున్నాడు అతని వెర్రి ఎక్కువవుతున్నట్టు గమనించాను ఇప్పుడు అతను అడిగింది ఇచ్చి ఏం చేస్తాడో చూడాలి తర్వాత అతని గురించి బాగా తెలుస్తుంది

రాత్రి 10 గంటలు. అతన్ని చూడటానికి వెళ్లాను ఓ మూల కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూవున్నాడు నన్ను చూడగానే నా ముందర కొచ్చి మోకాళ్లమీద కూర్చుని పిల్లిని ఇవ్వమని బతిమలాడాడు. అది దొరికితేగానీ తనకి విముక్తి లేదన్నాడు. నేను గట్టిగా నిలబడ్డాను. పిల్లి దొరకలేదని చెప్పాను. వెంటనే మాట్లాడకుండా లేచివెళ్ళి ఇందాకటిచోట కూర్చుని వేళ్ళు కొరుక్కోడం మొదలెట్టాడు. రేపు ఉదయం ఎట్లా వుంటాడో చూడాలి.

జూలై, 20: పనివాడు వచ్చేముందే, నేను

రెన్‌ఫీల్డు దగ్గరికెళ్లాను. అతను కూనిరాగం తీస్తూ కనిపించాడు. చక్కెరలాంటి పదార్థం కిటికీ దగ్గర చల్లుతున్నాడు, మళ్ళీ ఈగల్ని పట్టడం కోసం. చాలా సంతోషంగా వున్నాడు. అతని పిచుకల కోసం చుట్టూ చూసాను. అవి కనపడలేదు. ఏమయ్యాయని అడిగాను. నా వేపుకు చూడకుండా, అవన్నీ ఎగిరి వెళ్లిపోయాయన్నాడు. గదిలో అక్కడక్కడా ఈకలు కనిపించాయి. అతని దిండుమీద రక్తపు చుక్కలు కనిపించాయి. మాట్లాడకుండా వెళ్లిపోయాను. అక్కడున్న పనివాడితో చెప్పాను, ఆ రోజు అతను ఏమన్నా వెర్రిగా ప్రవర్తిస్తే చెప్పమన్నాను.

ఉదయం 11 గంటలు : ఆ పనివాడు ఇప్పుడే నా దగ్గరకు వచ్చాడు. రెన్‌ఫీల్డు చాలా ఈకలు కక్కుకున్నాడని, అతని ఒంట్లో సరిగ్గా లేదని చెప్పాడు 'పిచుక లన్నీ అట్లాగే వున్నపళంగా తినేసి వుంటాడని నా నమ్మకం, డాక్టర్' అన్నాడు.

రాత్రి 11 గంటలు : రెన్‌ఫీల్డుకి బాగా నిద్ర వచ్చేంతగా మందు ఇచ్చాను. అతని దగ్గర వున్న 'చిన్న నోట్ బుక్' తీసిచూసాను నా బుర్రలో తొలుస్తున్న సందేహాలకు ఒక రూపం వచ్చింది. ఇతను కొత్తరకం మనిషి అనిపించింది. ప్రాణాలతో తినే వెర్రి మనిషి అని పేరు పెట్టాలి వీలయినన్ని ప్రాణుల్ని హరాయించుకోవాలని అతని కోరిక. కానీ ఒక సముదాయ రూపంలో అతని కోరిక నెరవేర్చుకోదల్చుకున్నాడు. మొదట ఈగల్ని, సాలెపురుగులకు వేశాడు. వాటిని పిచుకలకు వేసాడు. తర్వాత వాటిని తినడానికి ఒక పిల్లిని అడిగాడు. తర్వాత ఏం చేసేవాడు. అతని ప్రయోగం పూర్తి అయివుండేది. దీని కంతటికీ ఏదో కారణం వుంటుందనిపించింది. వివిధ ప్రాణులను, ఏ భాగానికి ఆ భాగం కోసి పరిశోధిస్తుంటే ఒకప్పుడు అపహాస్యం చేసేవాళ్ళు, మరి ఇప్పుడు వాటి ఫలితాలు చూస్తున్నారు. మనిషి బుర్ర మీద పరిశోధనలు జరిపి సైన్సును ఎందుకు విస్తృత పరచకూడదు ? నాకు ఇటువంటి వెర్రివాడు దొరికితే, ఎప్పుడో పెద్ద శాస్త్రజ్ఞుల జాబితాలో చేర్చి వుండేవాడిని. దీన్నిగురించి నేను ఎక్కువగా ఆలోచించ కూడదు. ఏదో మంచి కారణం లేకుండా ఈ విషయం గురించి ఆలోచించకూడదు. నేను కూడా ఒక వెర్రివాడ్ని అయిపోవచ్చు

ఇటువంటివి చేయడానికి అతనికి మనసు ఎలా వొప్పింది పిచ్చివాళ్ళు, వాళ్లకందుబాటులో వున్నంత వరకు పిచ్చిపనులు చేస్తారు. ఇతను మనిషినయితే ఎన్ని జీవాలతో విలువ కడతాడోననిపించింది. అతని పాత లెక్కలు ఆపుజేసి, ఇవాళ కొత్త రికార్డు మొదలు పెట్టాడు. మనలో ఎంత మంది కొత్త రికార్డు మొదలు పెడుతూ వుంటారు ?

నిన్ననే నాకు అనిపించింది. నా జీవితంలోని ఆశలన్నీ నిన్ననే అంతమయి పోయాయి. ఇవాళ కొత్త జీవితంలోని పుటలు మొదలు పెట్టాను. ఈ పుటల్లోని లాభనష్టాలన్నీ బేరీజు వేసుకుంటాను. లూసీ, లూసీ, నువ్వంటే నాకు కోపం లేదు. ప్రియుడన్నా నాకు కోపంలేదు. నేను పనిలో పడిపోవాలి. పని ! పని !

నా వెర్రి మిత్రుడు గురించి పని చెయ్యాలి. ఆ పనిలో పడితే నిజంగా ఆనందంగా వుంటుంది.



## మీనా డైరీ :

జూలై, 26 : ఈ డైరీలో వ్రాసుకొని వూరట చెందాలని వుంది. ఇట్లా చేస్తే, ఓ మనిషి తన మనసుతో గుసగుసలు చెప్పి వింటున్నట్టుగా వుంటుంది. అదీకాక నేను షార్టుహాండ్‌లో వ్రాయడం వల్ల, అదోరకంగా వుంటుంది. లూసీ, జోనాథన్‌ల గురించి నాకు సంతోషంగా లేదు. జోనాథన్ దగ్గర్నించి ఏ విషయమూ తెలీడంలేదు. అది నాకు బాధ కలిగిస్తోంది. నిన్ననే మిస్టర్ హాకిన్స్ ఒక ఉత్తరం పంపాడు. అతను చాలా మంచివాడు. జోనాథన్ గురించి ఏమైనా విషయాలు తెలిసాయా అని అతనికి రాసాను. జవాబుగా అతను ఉత్తరం రాసాడు. దానితోపాటు ఒక ఉత్తరం జతచేస్తూ అప్పుడే వచ్చిందట. డ్రాకులా కోట దగ్గర్నించి వ్రాసినట్టు వుంది. అందులో ఒకే ఒక్క వాక్యం వుంది, ఇంటికి బయలుదేరి వస్తున్నానని. జోనాథన్ ఇట్లా రాయడు. నాకేమీ అర్థం కాలేదు. ఏంచెయ్యాలో తోచలేదు. ఇక లూసీ సంగతి : ఆమెకు ఒంట్లో బాగానేవుంది, కానీ నిద్రలో నడిచి వెళ్లే అలవాటు మళ్ళీ మొదలయ్యిందట. వాళ్ళమ్మ నాతో ఈ విషయం గురించి మాట్లాడింది. నేను అక్కడ వున్నప్పుడు ప్రతి రోజు రాత్రి మా గదిలో తలుపులు తాళం వెయ్యాలనుకున్నాం. నిద్రలో నడిచేవాళ్ళు, ఇళ్ళ కప్పులమీద, అంచులమీద నడుస్తూ, మధ్యలో గభాల్న మేల్కొని, భయంతో ఏడుస్తూ పడిపోతారని, వాళ్లమ్మకు తెలుసు. పాపం ఆమె లూసీ గురించి ఎంతో ఆదుర్దా పడుతుంది. లూసీ తండ్రికి కూడా ఇదే జబ్బు వుండేదని ఆమె చెప్పింది. అతనయితే, రాత్రిళ్ళు లేచి, బట్టలేసుకుని, బయటకెళ్లేవాడు, ఎవరూ ఆపేవాళ్ళు లేరన్నట్టుగా రేపు ఆకురాలే కాలంలో ఆమె పెళ్ళి అవుతుంది తనకి ఏం బట్టలు కావాలో, ఇల్లు ఎట్లా వుంచుకోవాలో, అప్పుడే ప్రణాళిక తయారుచేస్తోంది. ఆమె అంటే నాకు జాలి జోనాథన్ నేనూ కూడా, నిరాడంబరంగా జీవితాన్ని ప్రారంభించదల్చుకున్నాం ఇద్దరం కష్టపడాలి. గౌరవనీయులైన ఆర్థర్ హోల్మ్‌వుడ్ (గోదాల్మింగ్ ప్రభువు కొడుకు) తొందరలో ఇక్కడికి వస్తున్నాడు, సుస్తీ చేసిన అతని తండ్రిని చూడడానికి అతను బయలుదేరగానే, పాపం లూసీ క్షణాలు లెక్కిస్తూ కూర్చుంటుంది అనుకుంటా, అతను తిరిగి వచ్చేదాకా. తనను అతనితోపాటు 'విట్‌బీ' తీసుకెళ్ళి అక్కడ చర్చి ప్రదేశంలో కూర్చుని, అక్కడి అందమైన ప్రదేశాల్ని చూపించమని అడగాలని కోరిక. ఎడబాటు ఆమె మనసును చెదరగొడుతుందేమో ననిపిస్తుంది. అతను తిరిగివచ్చాక మామూలు మనిషి అవుతుంది.

జూలై, 27 : జోనాథన్ దగ్గర్నించి వార్తలేమీ లేవు. అతని కబురు తెలీకపోతే నాకేం తోచకుండా వుంది. అతని కబురు తెలీకపోతేనేం ? ఏమో తెలీడంలేదు నా మనసుకు. అతను ఒక్క వాక్యం రాసినా చాలు, నా మనసు వూరట చెందుతుంది. లూసీ ఇదివరకటి కన్నా నిద్రలో ఎక్కువ నడుస్తోంది. ప్రతిరోజు రాత్రి ఆమె లేచినప్పుడల్లా, నాకు మెలకువ వస్తోంది. బయట పొడిగా వుండబట్టి సరిపోయింది, చలిగావుంటే ఆమెకు జలుబు చేసి వుండేది. ఆమెవల్ల నాకు నిద్ర కరువయ్యి ఆందోళన ఎక్కువయ్యింది. పోన్లే, లూసీ ఆరోగ్యం బాగుంటోంది. మిస్టర్ హోల్మ్‌వుడ్ అనుకోకుండా, జబ్బుచేసిన తండ్రిని చూడడానికి వెళ్లాడు. అతన్ని చూడాలని ఆమె మనసు ఆరాటపడుతోంది, వ్యాకుల పడుతోంది. కానీ ఆమె కళ్ళల్లో, గులాబీ చెంపల్లో అందం తరగలేదు. రక్తలేమి చూపులు బాగా తగ్గాయి. ఆమె ఇట్లా అందంగా వుంటే బాగుండును.

ఆగస్టు, 3 : మరో వారం గడిచింది. జోనాథన్ దగ్గర్నించి వార్తల్లేవు. మిస్టర్ హాకిన్స్‌కి రాసినట్టులేదు. రాస్తే ఆయన నాకు తెలియజేసేవాడు. అతనేం జబ్బు పడలేదని ఆశించాలి. కానీ, అతను తప్పకుండా నాకు ఉత్తరం రాసేవాడేనే ! అతను రాసిన చివరి ఉత్తరం చూసాను. నాకేమిటో తృప్తిగాలేదు. అది అతను రాసిన ఉత్తరం కనిపించడంలేదు. దస్తూరి మాత్రం అతనిదే. అందులో సందేహం లేదు. లూసీ పోయిన వారం నిద్రలో ఎక్కువ నడవలేదు. కానీ నేను ఆమెను జాగ్రత్తగా పరీక్షించడం మొదలుపెట్టాను. ఆమె నిద్రపోతున్నప్పుడు నన్నే పరీక్షగా చూస్తోంది. తలుపు దగ్గరకు వెళుతుంది. తాళం వేసివుండడం చూసి, దానికోసం గది అంతా వెతుకుతుంది.

(ఇంకా వుంది)

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

# వారఫలం

**24–12–1982 శుక్రవారం మొదలు 30–12–1982 గురువారం వరకు**

**మేషం :** వారమంతా పనుల తొందర అధికంగా ఉంటుంది. స్థిరాస్తిగాని, చరాస్తిగాని అమ్మ జూపటం కొందరి విషయంలో నిర్ణయం. వారాంతంలో రాబడిలో కొంత స్తబ్దత ఏర్పడుతుంది. స్త్రీలకు : ధనలబ్ధి, ఆనందం, ఆదరణ, పెద్దల అనుభూతికి అవకాశం గల వారం.

**వృషభం :** గత కొన్ని వారాలనుండి అన్ని విషయాలలో, 'ఇలాగే' ఉన్నది, అని అనుకొంటారు. పరులకు సహాయం చేయబోయి, మీరు యిబ్బందులకు గురికాగలరు. స్త్రీలకు : పరాయి వారి విషయాలతో సతమతం కావలసివస్తుంది. కించిత్తు ఆదాయం గల వారమే.

**మిథునం :** ప్రయాణానుకూలత, ఏదైనా సాహిత్య సభలోనో, రాజకీయ సంబంధమైన సభలోనో, కనీసం, మిత్ర గోష్ఠియందో పాల్గొనటం సంభవం. అతి పరిచయస్తులు అనుకోకుండా, హఠాత్తుగా యింటికి వస్తారు. స్త్రీలకు : వస్తు సేకరణకు, నగల కొనుగోలుకు అవకాశం గల వారం.

**కర్కాటకం :** రాజకీయవాదులకు జయప్రదమైన వారం. సాహితీ రంగంలో చేయి తిరిగిన వారికి, అనుభవం గల వారికి ధనాదాయానికి అవకాశం ఏర్పడుతుంది. స్థిరాస్తి పెంపుచేసే ప్రయత్నాలు కూడా ఫలవంతం కాగలవు. స్త్రీలకు : ఉద్యోగంలో పెంపు, సంతానానికి శుభకార్యాచరణకు యోగ్యమైన అవకాశాలుంటాయి.

**సింహం :** అన్ని విధాలా శుభం చేకూరగల వారం. కుల పెద్దల అనుభూతి చూరగొనగలరు. ఇంట శుభకార్యాచరణమునకు అనుకూలతగలదు. స్థిరాస్తి సమకూర్చుకొనుటకో, అభివృద్ధి చేసికొనుటకో అనుకూలం. స్త్రీలకు : ఉద్యోగ ప్రయత్నాలు ఎవరైనా చేసినా, అందు అభివృద్ధి కోరినా అనుకూలతగలదు. రాజకీయంగా అభీష్టం నెరవేరుతుంది.

**కన్య :** ధనాదాయమున్నది. న్యాయంగా, మీకే అనుకూలంగా ఒకానొక గృహాభివృద్ధి వ్యవహారం నెరవేంగలదు. భూసంబంధమైనది, చాలకాలంగా నెరవేరని వ్యవహారం పరిష్కారం కాగలదు. స్త్రీలకు : సాహితీ రంగంలో, కళా రంగంలో, ముఖ్యంగా నటనలో, నాట్యంలో సదవకాశాలు లభించి, ఆదాయం అభివృద్ధినందగలదు.

**తుల :** ఒకానొక వ్యవహారంలో మీరు పోయే మార్గం సుగమంగాదు. చికాకులు కనిపిస్తాయి. అడగడుగునా యిబ్బందులుంటాయి. రాజకీయంగా మరీ చికాకు కలుగుతుంది. స్త్రీలకు . చిత్రకళా నైపుణ్యం గలవారికి సదవకాశాలుంటాయి. గ్రహించి, కృషి చేయాలి.

**వృశ్చికం :** దరిదాపుల్లో, ఏదో మేలు మీకు సంభవం కానున్నదనే ఆచూకి చిక్కుతుంది. దీర్ఘ వ్యాధులున్న వారికి అభివృద్ధి కనిపిస్తుంది. క్రమానుగుణ్యంగా ఆరోగ్యం అభివృద్ధి చెందుతుంది. వస్తు వాహన సేకరణకు కొందరకు అవకాశమున్నది స్త్రీలకు : అన్ని రంగాలలో క్రమాభివృద్ధి గలదు.

**ధనుస్సు :** రాజకీయంగా కొందరకు,సాంఘికంగా కొందరకు, సామాజికంగా కొందరకు, ఆర్థికంగా కొందరకు, వారాంతంలో క్రమాభివృద్ధి చేకూరుతుంది. స్త్రీలకు : ప్రత్యర్థుల మూలాన యిబ్బంది, అన్ని వ్యవహారాలలో నిరుత్సాహత కనిపిస్తుంది ఆయినా అపకారం ఏమీ లేదు.

**మకరం :** దూరబంధువుల మూలాన, ఏదో తొందర, చికాకు ఏర్పడగలదు. వస్తు వాహనాలు సమకూర్చుకొనటంలో నిమగ్నులు కాగలరు. కావలసిన ధనం ఏలాగో చేకూరగలదు, వెనుక ముందులాలోచింపక క్రమానుగుణ్యంగా కార్యరంగలో దిగండి. స్త్రీలకు : నాల్గువిధాలా యోగదాయక వారమే.

**కుంభం :** భారీ వ్యాపారమయినా, పత్రికా ప్రకటనా వ్యవహారమయినా, సంగీత సాహిత్య రంగాన మీకు నైపుణమున్నా, చిత్రలేఖనమందు ప్రావీణ్యమున్నా, స్థిరాస్తి పెంప చేసకోగల ప్రయత్నాలున్నా మీకు లాభదాయకమే. స్త్రీలకు : అభివృద్ధి, ఆర్థికంగా మేలు, ఉద్యోగ రీత్యా వృద్ధి చేకూరనున్నది.

**మీనం :** మీకు ఏ రంగాన పరిచయమున్నా, మీరు ఏ వ్యాపారం సాగించినా, ఏ వ్యవహారం పరిష్కారం కావాలన్నా, రాజకీయంగా అభివృద్ధి సాధింపదలచినా, ఈ వారం ప్రయత్న లోపం చేయకండి, అభివృద్ధి కనిపించి తీరుతుంది. అయితే, చాలా మందికి చుట్టుప్రక్కల గొడవలు, అయినవారి మూలాన చికాకులు సంభవించనున్నవి, జాగ్రత్త! స్త్రీలకు : 'కోర్టు' వ్యవహారాలున్నా, గృహసంబంధ పరిష్కార వ్యవహారాలున్నా, చికాకులున్నా, ఆర్థిక లోపమున్నా, ఈ వారం సమసిపోగలవు. గ్రహించండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# మిగిలున్న వెలుగు

## వి. రాజారామమోహనరావు



నారాయణమూర్తిగారికి ఆత్రుతగా వుంది. ఎప్పుడు ఆటో యిల్లు చేరుతుందా అనుంది. రాత్రంతా చేసిన ప్రయాణం వో ఎత్తు, యీ అరగంట ప్రయాణం వో ఎత్తుగా వుంది ఆయనకి.

కొడుకు కనపడగానే సాధారణంగా ఆయన అడిగే ప్రశ్న .. 'కోడలెలా వుంది... పిల్లలెలా వున్నారు...' అని. కానీ యీసారి అలా అడగలేదు. 'ఏరా యిల్లు విశాలంగా వుందా... ఎన్ని గదులు...' అనడిగారు.

తల్లీతండ్రిని రిసీవ్ చేసుకోటానికి గోపాలకృష్ణ స్టేషన్‌కి వచ్చాడు. ఇంకా అతను కంపార్టుమెంట్ లోంచి సామాను దింపేస్తున్న హడావిడిలో వుండగానే నారాయణమూర్తిగారు మళ్ళీ యింటి వివరాలు అడిగారు.

'వరండా వుందా... ముందు వెనకు ఖాళీ జాగా వదిలారా... వీధి అరుగుందా...'

స్టేషన్ దాటి బైటికివచ్చి ఆటో ఎక్కేలోపు యింటి తాలూకు వివరాలు చాలానే చెప్పాడు గోపాలకృష్ణ. అయినా నారాయణమూర్తిగారికి పూర్తి తృప్తి కలగలేదు.

"ఎంత...వో అరగంటలో మీరే చూస్తారుగా" అన్నాడు చివరికి గోపాలకృష్ణ తండ్రి ఆత్రుతకి చిరునవ్వు నవ్వుతూ.

అద్దె యిళ్ళల్లో అసౌకర్యం పెరిగినప్పుడు, ఆ యిబ్బంది తట్టుకోలేక తప్పనిసరిగా యిళ్ళు మారే టప్పుడు, చాలామంది కళ్ళల్లో కదిలే తియ్యటి కల సొంత యిల్లు. మధ్యతరగతి మనసుకి ఈ కల మరింత ఎక్కువ. ఆయన అరవై ఏళ్ళ జీవితంలో

నారాయణమూర్తిగారిక్కూడా ఈ కల చాలాసార్లు వచ్చింది. యిద్దరు ఆడపిల్లల పెళ్ళి, కొడుకు చదువు బాధ్యతల వల్ల ఆయన ఆ కల కలలాగే మిగిలిపోయింది.

తను సాధించలేంది తన కొడుకు సాధించాడు. గోపాలకృష్ణ సొంతయిల్లు సాధించాడు. సొసైటీ ఆధ్వర్యంలో, సొసైటీ లోన్‌మీద కట్టిన యిల్లు. లేకపోతే నారాయణమూర్తిగారు ఎప్పుడో వచ్చి యింటి కట్టుబడిని దగ్గరుండి చూసేవారే లాటరీవేసి తీసే వరకు వీళ్ళ యిల్లు ఏదో వీళ్ళకి తెలియకపోటం వల్ల ముందుగా వచ్చి యిల్లు చూసే అవకాశం లేక పోయింది మంచి రోజు కలిసి రావటంవల్ల యిల్లు చేతికందిన వెంటనే గృహప్రవేశం ఏర్పాటు చేసేసు కున్నారు.

నారాయణమూర్తిగారికి గర్వంగా వుంది. పోతరం కన్నా మరోతరం ఆర్థికంగా బలపడితే గలిగే గర్వం తను పెంచి పెద్దచేసిన చెట్టు నీడన విశ్రాంతి తీసుకునే అవకాశం కలిగిన గర్వం. అద్దె యిల్లు వదిలేసి కొడుకు దర్జాగా వుండొచ్చన్న గర్వం.

ఆటో దిగ్గానే కోడల్ని గబ గబా పలకరించి యిల్లు చూట్టం మొదలెట్టారు నారాయణమూర్తి గారు. రెండు గదులు, వో హాలు, వంటిల్లు ...... డాబాయిల్లు. వుత్తరోత్రా పైన కూడా కట్టు కోటానికి అవకాశంవున్న యిల్లు. నారాయణమూర్తి గారికి నచ్చింది. ఎటొచ్చీ ఏ మొక్కైనా వేసుకోటానికి వెనక ఖాళీస్థలం లేకపోటం ముందు విశ్రాంతిగా కూచోటానికి వీధి, అరుగు లేకపోవటం లోటుగా తోచింది. అయినా హైదరాబాదు నగరంలో యిల్లన్నప్పుడు అలాంటివన్నీ పెట్టుకో కూడదని మనసుని సర్దుబాటు చేసుకున్నారు.

మర్నాడే గృహప్రవేశం. దానికిగాను వంట మనిషి, షామియానా... భోజనాలలోకి చేయిస్తున్న పదార్థాలు... వీటన్నింటి వివరాలు తండ్రితో వివరంగా చెప్పాడు గోపాలకృష్ణ. అన్నీ విన్నారు నారాయణమూర్తిగారు. విన్నాక... "వొరే కిష్టుడూ .. యీ షామియానా బదులు కొంచం శ్రమయినా తాటాకు పందిరి వేయిస్తే బావుంటుంది. యిలాంటి శుభకార్యాలలో తాటాకు పందిరి వేసి, పచ్చగా మావిడి తోరణాలు కడితే శుభప్రదం..." అన్నారు

"నిజమే నాన్నగారు... కానీ యిప్పటికిప్పుడు తాటాకులు దొరకవు అదీకాక పందిళ్ళు వెయ్యటం యిక్కడవాళ్ళకి అలవాటు లేదు మనం దగ్గరుండి చేయించాలి యీ ఒక్క రోజులో అంత తేలిగ్గా అయ్యేపని కాదు... యిలాంటివి మీకు తృప్తిగా వుండవని తెలిసినా తప్పనిసరై యిలా చెయ్యక తప్పటం లేదు టైము అంతగాలేదు. అందుకే ఏదో రకంగా బతిమాలి మిమ్మల్నే సర్దుబాటు చేసుకోమందామని యిలా చేశాను" అన్నాడు గోపాలకృష్ణ తప్పుచేసిన వాడిలా ముఖంపెట్టి.

"పోనీలేరా .. దాందేముంది ఊరు పద్ధతిని బట్టే మనం మారకతప్పదు అలా అయితే బావుం టుందని అన్నాను అంతే తప్ప నిన్ను దిగులుపడమని కాదు" అన్నారు. మనిషంత మనిషై కూడా కొడుకు తనకిస్తున్న ఆ విలువకి మరింత తృప్తి కలిగింది నారాయణమూర్తిగారికి. 'ఇంక తనకేం కావాలి ... అన్ని బాధ్యతలు తీరిపోయాయి. నిశ్చింతగా కొడుకు దగ్గర నీడపట్టున వుండి ... కాలక్షేపం చెయ్యటమే ...' అనుకున్నారు. దానికి తగినట్టుగానే "ఏకంగా యిల్లు ఖాళీచేసి సామానంతా తీసుకుని వచ్చేయాల్సింది. యిన్నాళ్ళు అద్దిల్లు యిరుకు, మాకు యిబ్బందని గట్టిగా చెప్పలేదు. ఇంక మీరు, అమ్మ యిక్కడ వుండటమే. అక్కడికి వెళ్ళటానికి వీల్లేదు" అని అంతకుముందే గోపాలకృష్ణ అన్నాడు.

తన పిల్లలు పుట్టినప్పుడు, వాళ్ళ బారసాలప్పుడు పెళ్ళిళ్ళ సమయంలో యిలా జీవితంలో చాలాసార్లు ఆనందం, ఆత్రుత, తృప్తి కలగలిసి కమ్ముకున్నాయి నారాయణమూర్తిగారి మనసుని. అలాగే యీసారీ మనసులో అవన్నీ కదులుతున్నా, యిదివరకటికన్నా తృప్తిగా వుంది. నడిచి, నడిచి గమ్యం చేరిన తృప్తి. బాధ్యతలన్నీ గడిచిన తృప్తి. రేపటి శుభకార్యంలో అజమాయిషీగా ఆనందించటమే తప్ప, నెత్తిమీద వేసుకుని చెయ్యాల్సిన పనేంలేని చిత్రమైన అధికారపు తృప్తి... తెల్లారటం కోసం, వెలుక్కన్నా ఆత్రుతగా ఎదురుచూశారు ఆ రాత్రి నారాయణ మూర్తిగారు.

* * *

నారాయణమూర్తిగారు వూహించిన దానికన్నా బాగానే జరిగింది గృహప్రవేశ కార్యక్రమం. ఆయన ముఖం సంతోషంతో వెలిగిపోతోంది. కూతుళ్ళు, అల్లుళ్ళు వచ్చారు. నిండుగా, హాయిగా వుంది.

గోపాలకృష్ణకీ తృప్తిగానే వుంది. తల్లీతండ్రీ నట్టింట నిలబడి శుభకార్యం జరిపించటం ఆనందంగా వుంది. నారాయణమూర్తిగారు చాలా విషయాలకి సర్దుకున్నట్టే, గోపాలకృష్ణ కొన్ని కార్యక్రమాలు తండ్రికి అనుకూలంగా మార్చాడు. వడ్డన అదీ యిబ్బంది అని యింటిముందు షామియానాలో బఫే పద్ధతిలో భోజనాలు ఏర్పాటు చేద్దాం అనుకున్నాడు. కానీ గృహప్రవేశం అంటే కొత్తింట్లో విస్తరేస్తేనే అన్నశాంతి అంటంతో శ్రమైనా భోజనాలు తండ్రి చెప్పినట్టు ఏర్పాటు చేశాడు. అన్నీ బాగానే జరిగాయి. యింక సాయంత్రం వ్యవహారం గురించి తండ్రికి ఎలా చెప్పాలా అన్న మీమాంసలో పడ్డాడు గోపాలకృష్ణ. టైమ్ లేదు. సాయంత్రం దగ్గర పడుతోంది. యింక తొందరపడక తప్పదని తండ్రి దగ్గరికి వెళ్ళి... "నాన్నగారు .. మరి..' అని నీళ్ళు నమిలాడు. చెప్పక తప్పదు. చెప్పాలంటే జంకుగా వుంది.

"ఏమిట్రా .. ఏమిటి ?" అన్నారు నారాయణ మూర్తిగారే కొడుకు తటపటాయింపు చూసి...

"ఏంలేదు నాన్నా .. ఈ రాత్రికి మిమ్మల్ని, అమ్మని మా స్నేహితుడింటికి తీసుకెడతాను. కొంచెం యిబ్బంది అనుకోక ఈ ఒక్క రాత్రి అక్కడ గడపమని . " అన్నాడు.

ఇల్లు విశాలంగానే వుంది. పెద్దగా మిగిలున్న బంధువులు లేరు. పడకలకేం యిబ్బంది లేదు. మరి కొడుకు ఎందుకలా అంటూన్నాడో అర్థంకాలేదు నారాయణమూర్తిగారికి అందుకే.. "ఎందుకురా... యిల్లు విశాలంగానే వుందిగా. చోటు లేనట్టు ఎవరింటికో ఎందుకురా ... " అన్నారు.

"అది కాదు నాన్నగారు . సాయంత్రం నా స్నేహితులు కొందర్ని పార్టీకి పిలవక తప్పలేదు వాళ్ళందరు వస్తే కొంచెం హడావిడిగా గోలగోలగా వుంటుంది. ఆ గోల, యిబ్బంది మీ కెందుకనీ ... " అన్నాడు గోపాలకృష్ణ

ఏదో పెద్దసమస్య అనుకున్న నారాయణమూర్తి గారికి అది వినగానే నవ్వొచ్చింది "భలేవాడివిరా.. శుభకార్యం అన్నాక ఇల్లు హడావిడిగా వుండక, నిశ్శబ్దంగా వుంటుందా నాకేం గోల, యిబ్బంది వుండదు. . నువ్వేం బెంగపెట్టుకోకు శుభకార్యం జరిగిన యింట్లో అందరం నిద్రచెయ్యటం మంచిది. ." అన్నారు.

"అదికాదు నాన్నగారు . మా స్నేహితులు గందరగోళం... మీ వూహకి మించి వుంటాయి అందుకని నా మాటవిని... " అన్నాడు తిరిగి గోపాలకృష్ణ.

"వొరే. నువ్వారికే యిదవ్వకు. నేను సర్దుకోగలను యింక నా గొడవ వొదిలేసి నీ పని నువ్వు చూసుకో." అన్నారు నారాయణమూర్తిగారు యింక ఏం అనటానికి తోచలేదు గోపాలకృష్ణకి

* * *

రాత్రి ఎనిమిదిన్నరకి మొదలైంది పార్టీ డాబా మీద కూడా షామియానా వేయించాడు గోపాలకృష్ణ. పార్టీ అక్కడే జరుగుతోంది

వూహించినదానికన్నా ఎన్నో రెట్లు హడావిడిగానే వున్నా, పదిన్నరవరకూ తనకేం సంబంధం లేనట్టే వూరుకున్నారు నారాయణమూర్తిగారు ఆ తర్వాతే ఆయనలో యిబ్బంది తలెత్తింది

కోడలు, కూతుళ్ళు, భార్య, తనూ ఎవ్వరూ భోంచెయ్యలేదు. అది పెద్ద సమస్య కాదు. ఆయన వూహించింది టీ, ఫలహారం... యిలాంటి పార్టీ. . కానీ జరుగుతున్నది వేరు.

డాబామీద అడుగుల చప్పుడు కిందదాకా వినపడుతున్నాయి అరుపులు, కేకలు, చప్పట్లకి అంతేలేదు. డాబామీంచి యిటుపక్కకి అటుపక్కకి ఖాళీసీసాలు విసిరేస్తున్నారు.

ఈ తరం కుర్రాళ్ళు తాగుతారని, యిలాంటి సరదాలు వాళ్ళకుంటాయని నారాయణమూర్తిగారికి తెలుసు. కానీ అవి ఎలా వుంటాయో, వాటి స్వరూపం ఎలా వుంటుందో ఆయనకి తెలియదు. ఇప్పుడే చూట్టం.

తన వుద్యోగం. యిల్లు పిల్లలు వాళ్ళ సౌఖ్యం, బాధ్యత వీటవరకే పరిమితమైన జీవితం ఆయనది తమ గురించి నలుగురు ఏమనుకుంటారు. నలుగురి దృష్టిలో మనం ఎలావుండాలి అన్న పరిధిలోసాగే ఆలోచన ఆయనది

పదకొండున్నర అయినా పార్టీ సాగుతూనే వుంది పైకి వెళ్ళే సరుకు వెడుతూనే వుంది. ఆ తీరు చూస్తే ఆ పార్టీ తెల్లారేవరకూ సాగేలా కనపడింది నారాయణమూర్తిగారికి.

పన్నెండు దగ్గర పడ్డాక యింక ఆగలేక పోయారు నారాయణమూర్తిగారు. పైనుంచి వినిపిస్తున్న నవ్వులు, కేకలు ఆయనకి నోట్ల రూపంలోకి మారి ఖర్చు కళ్ళముందు మెదిలింది.

'ఇంటిమీద తీర్చాల్సిన అప్పుంది. ఇంటికి యింకా చెయ్యాల్సిన పని చాలావుంది. అదీకాక కిష్టుడు పిల్లాపాప వున్నవాడు. పరిమితమైన...సంపాదన ... ఈ వుత్సాహంలో ఖర్చు ఎంత అయిందీ తెలీదు. తెల్లారి తెలిశాక బాధగా వుంటుంది. దీన్ని ఇంతటితో ఆపటం తండ్రిగా తన ధర్మం. అదీకాక కొడుకూ, కోడలు ఈ రాత్రి కొత్తింట్లో నిద్ర చేయాలన్నది ఆయన మనసుని పట్టుకుని పీడిస్తున్న పెద్దశంక. పై హడావిడి యింకా అలాగే సాగితే కొడుకు వొంటి మీద స్పృహలేకుండా పడిపోటం ఖాయం అనిపించింది ఆయనకి. అందుకే యింక ఆగలేక డాబా మీదకి ప్రయాణం అయ్యారు.

ఒక్కొక్క అడుగు వేస్తుంటే గుండె అదిరి నట్టనిపించింది నారాయణమూర్తిగారికి. 'ఏమవుతుందో...?' అన్న జంకుగా వుంది.

ఆయన అనుకున్నట్టే అయింది. పైకి వెళ్ళి అక్కడి వాతావరణం చూశాక నారాయణమూర్తిగారు తనని తను అదుపులో పెట్టుకోలేకపోయాడు. ఆయన గట్టిగా నోరు చేసుకున్నాకే ఆ హడావిడి ఆగింది. అంతా అయ్యాక కానీ ఎంతగా ఆయన ఆవేశపడింది ఆయనకి అర్థం కాలేదు.

ముసలాయన కేకలకి... గోపాలకృష్ణ వుండమని ఎంత బతిమాలినా వినకుండా అతని స్నేహితులందరూ వెళ్ళిపోయారు.

ఉక్రోషం, బాధ, కోపం అన్నీ కలిసికట్టుగా వచ్చాయి గోపాలకృష్ణకి. అన్నీ అనందంగా గడిచి, చివరికి అపశృతిలా మారిన ఆ వాతావరణం గోపాలకృష్ణ కోపాన్ని మరింత పెంచింది. తండ్రి ఎదురుగా లేకపోతే ఏం జరిగేదో... కానీ దానికంతకీ కారణంగా తండ్రి ఎదురుగా కనిపించేటప్పటికి అదుపు తప్పాడు.

"యిప్పుడు బావుందా మీకు... రేపు వాళ్ళందరికీ నేను ఎలా ముఖం చూపించాలి. అయినా మిమ్మల్ని పైకి ఎవడు రమ్మన్నాడు. అందుకే మధ్యాన్నమే చెప్పాను... యింట్లో వుండొద్దని... విన్నారా... బతుకన్నాక నా గొడవలు నాకుంటాయి. అర్థం చేసుకోపోతే ఎలా... ఒక్క రాత్రి సద్దుకోలేకపోయారు. ఛీ...ఛీ... ఏం బతుకు... యీమాత్రం అర్థం చేసుకోలేని వెధవ పెద్దరికం ఎందుకు... యిప్పుడు మీరొక్కరే స్మశానంలా వున్న యీ డాబాని చూసి ఆనందించండి..." అని కిందకి వెళ్ళిపోయాడు.

నారాయణమూర్తిగారికి నోట మాట రాలేదు. నిజంగా స్మశానంలో వున్నట్టే వుంది నారాయణమూర్తిగారికి. అదే యింట్లో తన వాళ్ళందరూ వున్నా ఒంటరిగా వున్నట్టే వుంది. అందరూ తలోచోట పడుకున్నారు. కిటికీ పక్కగా మంచంమీద పడుకున్నారు నారాయణమూర్తిగారు.

కిటికీలోంచి వచ్చి తగుల్తున్న చల్లగాలి రంపపు కోతలావుంది ఆయనకి. 'తను చేసిన తప్పేమిటి ... ఈ కుటుంబం కోసం, వీడికోసం జీవితమంతా ఎంత శ్రమ పడలేదు. కొంచెం తను ఆవేశపడిన మాట నిజమే ... అయినా దేనికోసం. వాడిబాగు కోసమేగా కన్నతండ్రికన్నా మిగిలిన జీవితం ఎక్కువై పోయిందా .. వెనకాముందు చూడకుండా అన్ని మాటలంటాడా .. ఎన్నింటికి తను సద్దుకోలేదు. వాడు యిబ్బంది పడకుండా చూడలేదు. అదేమేనా ఆలోచించాడా ... అయినా పొరపాటు తనది. ఎవరికి ఎవరూకాని జీవితం యిది. తన బతుకేదో తనే బతకాలి . . ఎవరి పంచనా చేరకూడదు.'

నిద్ర పట్టటం లేదు నారాయణమూర్తిగారికి. జీవితంలో సర్వవిలువలు ధ్వంసం అయిపోయినట్టు బాధగా వుంది. యీ అనుబంధాలు, యీ జీవితం అంతా శూన్యం అన్నంత వైరాగ్యం కమ్ముకుంది ఆయన మనసుని. పైకిరాని ఏడుపు ఆయన్ని మింగిస్తోంది. ఆ క్షణాన 'ఆ యిల్లు వొదిలి వెళ్ళిపోవాలి' అనిపించింది. అయినా దానికీ వోపికచాల్లేదు. అలాగే కదలకుండా పడుకుని వుండిపోయాడు.

గోపాలకృష్ణకీ నిద్దరపట్టలేదు. సొంత యింట్లో ఎంతగానో మనసుపడ్డ ఆ పడగ్గది బంధిఖానాలా వుంది. ఎంతో సంతోషంగా వూహించుకున్న ఆ రాత్రి నరకంలా వుంది.

'దీని కంతటికీ కారణం ముసలాయన కదు ... అంతకీ అడుగడుగునా ఎంత జాగ్రత్తగా వున్నాడు. ఆయనికి ఏ మాత్రం యిబ్బంది కలకూడదని ఎంతగా ప్రయత్నించాడు. యిలాంటిదేదో జరుగుతుందని శంకగానే వుంది. అందుకే అసలు పార్టీ యింట్లో పెట్టకూడదనుకున్నాడు. అయినా స్నేహితులు వినలేదు. బలవంతం చేశారు ... ఛాలెంజి చేశారు. వాళ్ళవల్ల చాలా సహాయాలు పొందాడు. స్నేహితులు, వో సర్కిల్ అంటూ లేకపోతే యీ నగరంలో సాధించగలిగిందేంలేదు. అది యీ ముసలాయనకి ఎలా తెలుస్తుంది .. అయినా యీయనకి అక్కర్లేని గొడవలు ఎందుకు... అనవసరం... యింక ఆయన గురించి ఆలోచించటం అనవసరం...' అనుకున్నాడు.

అలా అనుకున్నాక నిద్రపోవాలని, పోయేముందు పక్కనేవున్న భార్యని దగ్గరికి తీసుకోవాలని ప్రయత్నించాడు గోపాలకృష్ణ. సాధ్యపడలేదు మనసు లోపల అతిమెత్తటి ముళ్ళు గుచ్చుకుంటున్నాయి అంత వరకూ తాగిన మత్తు కూడా సహకరించటం లేదు.

తండ్రే గుర్తొస్తున్నాడు చిన్నతనం, ఆయన పెంపకం గుర్తొచ్చాయి. యింటి విషయంలో ఆయన ముఖంలో మెదిలిన ఆనందం గుర్తొస్తోంది. సర్వం తనే తనదే అనుకునే ఆయన అమాయకపు ధీమా నిష్కల్మషమైన రూపం గుర్తొస్తోంది. కుటుంబం బాగే తప్ప యింకేం ఆలోచించని, అనుభవించని ఆయన జీవితం గుర్తొచ్చింది

అంతే యింక అలా పడుకోలేకపోయాడు గోపాలకృష్ణ. 'ఛీ...ఛీ. . ఎంత వెధవపని చేశాను పండగనాడు తండ్రిని బాధపెట్టాను. ఆయన మనసు తెలిసీ మూర్ఖంగా ఆలోచించాను.' అనుకున్నాడు. అలా అనిపించాక తెల్లారి స్నేహితులకి ఏదో రకంగా నచ్చచెప్పి మరో పార్టీ యిస్తే జరిగింది పెద్ద నష్టం అనిపించదు...

నెమ్మదిగా గదిలోంచి బైటకివచ్చి తండ్రి పడుకున్న చోటికి వచ్చాడు కిటికీవేపు తిరిగి కళ్ళు మూసుకు పడుకున్న తండ్రి కనిపించాడు. కిటికీ లోంచి వస్తున్న చల్లటి గాలికి ఆయన జుట్టు ఎగురుతోంది.

ఆయన కాళ్ళ దగ్గరున్న దుప్పటి తీసి... తండ్రికి చలిగాలి తగలకుండా కప్పాడు గోపాలకృష్ణ. తండ్రిని నిద్ర లేపాలనిపించలేదు.

'పొద్దునే నాన్నని బతిమాలుకోవాలి...' అనుకున్నాడు.

గదిలోకి వెడుతున్న కొడుకుని తడికంటితో ప్రేమగా, తృప్తిగా చూసుకున్నారు కళ్ళు తెరిచి నారాయణమూర్తిగారు.

'ఒక్క క్షణంలో జీవితాన్ని ఎంత వక్రంగా ఆలోచించాను. ఎవరి బతుకు వాళ్ళదేనని ఎంతగా భ్రమపడ్డాను. యింకాస్త తొందరపడితే...' యింక ఆలోచన సాగలేదు నారాయణమూర్తిగారికి. గాలిలో రెపరెపలాడే దీపానికి కాపుగా రెండు చేతులు అడ్డు పెట్టిన వెచ్చదనం ఆయన గుండెలదాకా పాకింది.

'వెర్రివెధవ ఎంత మథనపడ్డాడో ...' అనుకున్నారు కొడుకు కప్పిన దుప్పటిని మరింత దగ్గరగా లాక్కుంటూ నారాయణమూర్తిగారు. ★



'ముద్దుల మొగుడు'లో ఎ. ఎన్. ఆర్., నాగేష్, సుహాసిని

## బలిదానంలో బస్‌లో మిస్ అయిన 'మిస్'

విజయ్(శోభన్ బాబు)హడావిడిగా బస్ఎక్కాడు. జనాన్ని తప్పించుకుంటూ మాధవి [మాధవి] సీటు



దగ్గరికి వెళ్తున్నవాడల్లా ఒక వ్యక్తి కాలుతొక్కాడు. ఆ వ్యక్తి (కాశీ విశ్వనాథ్) 'కుయ్యో' మన్నా పట్టించుకోకుండా మాధవి ఎదురుగా వెళ్ళి నిలబడ్డాడు. "మీకోసం ప్రాణాలకు తెగించి మరీ బస్సు ఎక్కానండీ," అన్నాడు.

ఆ వ్యక్తి పేపర్ చూస్తూ, "అంత అవసరం ఏమొచ్చింది, నాయనా?" అన్నాడు.

ఆ వ్యక్తి వైపు విజయ్ కొరకొరా చూస్తూ మాధవితో "మీరు నమ్మటం లేదాండీ? మీరు దూకమంటే ఈ బస్సులోంచి ధన్‌మని దూకేస్తాను తెలుసాండీ?" అన్నాడు.

"గేస్!" అన్నాడా వ్యక్తి. విజయ్ తీక్షణంగా చూసేసరికి ఆ వ్యక్తి పేపర్‌లోని వార్త చదువుతున్నట్టుగా "ప్రజా నాయకుల ఉపన్యాసాల్లో గేస్ ఎక్కువై పోవడంచేత— సోడాల్లో గేస్ తగ్గిపోతోందని శాస్త్రజ్ఞులు కనిపెట్టిన విధానం—" అంటూ ఆగాడు.

ఈ మారు అతన్ని విజయ్ పట్టించుకోకుండా మాధవితో "మీరు... నాపేరు మీరు అడిగినట్టుంది కదూ? నా పేరు విజయకుమార్... నేను..." అంటూండగా బస్సు హఠాత్తుగా ఆగిన కుదుపుకు మాధవి తలను ఢీకొన్నాడు. మాధవి "అబ్బా!" అనేసరికి "మీకు నొప్పెటిందాండీ? నాకు అస్సలు నొప్పెట్టనే లేదండి— ఒట్టు!" అన్నాడు.

'దున్నపోతుకు నొప్పెట్టదులెండి," అన్నాడు ఆ వ్యక్తి.

విజయ్‌కు కోపం ఆగింది కాదు. "ఏమిటోయ్! నేను బస్సెక్కిందగ్గర్నుంచి వాగుతున్నావ్? నేను దున్నపోతునా?"

"మీరు దున్నపోతు ఎందుకవుతారులెండి! మాట్లాడుతున్నారుగా? దున్నపోతులు మాట్లాడవుగా?" అన్నాడావ్యక్తి.

← 'త్రిశూలం'లో జయసుధ



# సినిమా

"యూ, రాస్కెల్!" అంటూ విజయ్ చివాలున ఆ వ్యక్తి షర్ట్ పట్టుకొని పైకి ఎత్తబోయాడు. ఇంతలో బస్ కదిలింది. విజయ్ కంగారుగా పక్కకు తిరిగితే, మాధవి సీట్లో లేదు. ఆమె బస్సు దిగి రోడ్డమ్మట వెళ్లటం కనిపించింది. గాభరాతో "స్టాప్! ఏయ్, డ్రైవర్! బస్సు ఆపవయ్యా! హోల్డాన్! ఏయ్, కండక్టర్! బస్సు ఆపమనవయ్యా, బాబూ!" అని మొత్తుకుంటూ నోటితో విజిల్ కొట్టాడు కూడా.

"మధ్యలో ఆపడానికి మా రూల్స్ ఒప్పుకోవు. కూర్చోవయ్యా— నెక్స్‌ట్ స్టాప్‌లో దిగుదువుగాని," అన్నాడు కండక్టర్.

పేపర్ చదువుతున్నట్టునటిస్తూన్న ఆ వ్యక్తి "పాపం! అతగాడిప్రాణం ఆ స్టాప్‌లో దిగిపోయింది. బాడీ ఒక్కటే గిలగిలా కొట్టుకుంటోంది," అన్నాడు.

"రేయ్! అసలిదంతా నీ మంచే వచ్చింది. నిన్నేం చేస్తానో చూడు!" అంటూ ఆ వ్యక్తిమీద విజయ్ కలియబడబోయాడు. ఇంతలో పక్కస్టాప్‌లో బస్సు ఆగింది.

ఆ వ్యక్తి ఫకాలున నవ్వుతూ, "ముందు బస్సు దిగి— నీ ప్రాణం ఎక్కడికి పోతోందో చూస్కో

'మా ఇంటాయన కథ'లో



# విశేషాలు

**-జి. వి. జి.**

వయ్యా! నా సంగతి తర్వాత చూద్దువుగాని–'' అన్నాడు.

విజయ్ తిట్టుకుంటూ బస్సులోంచి బయటకు గెంతాడు. తన మనోహరి కోసం పరుగుతీశాడు.

ఎస్. ఎ. చంద్రశేఖర్ దర్శకత్వం వహించిన ''బలిదానం'' చిత్రం త్వరలో విడుదలవుతుంది.

## విజం చెబితే నేరమా ? లో విలకుమీద తేలిన విజం

రజని (జయప్రద) మెల్లగా ఆ గదిలోకి ప్రవేశించి, చివాలున తలుపుమూసి, గొళ్ళెం పెట్టేసింది. మూలన ఓ మంచంమీద నీరసంగా, దిగాలుగా పడుకొని ఉన్న సుందరి (మమత) కంగారుగా లేచింది. ''అమ్మాయిగారూ ఎలా వచ్చారు లోపలికి ?''

''ఏం రాకూడదా ?'' రజని అడిగింది.

''రాకూడదని కాదు. బయటి నుండి ఒక్క పురుగుకూడా లోపలికి రానివ్వకుండా ఈ గదిలో నన్ను బంధించి మీ మామయ్య – మనుషుల్ని కాపలా పెట్టారు ... అమ్మాయిగారూ! నన్ను బతక నివ్వరు. మా మామని చంపినట్లే అయ్యగారు నన్ను కూడా చంపేస్తారు ... ''

రజని నివ్వెరపోయింది. ''నీ మామను ఎవరు చంపారు ?''

చంద్రమోహన్, సులక్షణ





'బెజవాడ బెబ్బులి'లో రాధిక, కృష్ణ, సత్యనారాయణ

''మీ మామయ్యగారే చంపారు. నా కళ్ళారా చూశాను. ఈ మాట ఎక్కడా అనొద్దు. నన్ను చంపేస్తారు,'' సుందరి భయంగా చూసింది.

''నీ మామను మా మామయ్య చంపడం నీ కళ్ళారా చూశావు గదా ? ఈ విషయం కోర్టులో చెప్పగలవా ?''

''అమ్మో! కోర్టులోనే ... ? మీ మామయ్య నన్ను బతకనిస్తారా ?''

''నీ ప్రాణానికి ఏమీ ప్రమాదం లేకుండా నేను ఏర్పాటు చేస్తాను ... కొన్నాళ్ళు ఇలాగే ఉండు. నేను బయట ఏర్పాట్లుచేసి మళ్ళీ వచ్చి చెబుతాను,'' అంటూ రజని బయలుదేరబోయింది.

''అమ్మాయిగారూ! నాకు భయంగా ఉంది,'' అంటూ సుందరి దగ్గరగా వచ్చింది.

''ఏ భయంలేదు. నువ్వు ధైర్యంగా కోర్టులో విజం చెబితేనే బతుకుతావు. లేకపోతే – ఈ ఇంట్లో ఇలాగే కుళ్ళి కుళ్ళి చస్తావు. నా మాట విను ... ఏం ? నేను మళ్ళీ వస్తాను,'' అంటూ వెళ్లి కారులో కూర్చున్న రజనిని పానకాలు (రావు గోపాలరావు) అనుచరులు దూరం నుంచి పరిశీలించారు.

ఎం. బాలయ్య కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తూ, సమర్పించే అమృతా ఫిలిమ్స్ ''నిజం చెబితే నేరమా ?'' చిత్రం విడుదలకు సిద్ధమవుతోంది.

## అడవి సింహాలు

కృష్ణ, కృష్ణంరాజులతో కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మిస్తున్న చిత్రానికి పై పేరు పెట్టినట్లు వైజయంతీ మూవీస్ అధినేత చలసాని అశ్వనీదత్ చెప్పారు. శ్రీదేవి, జయప్రద, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, రావు గోపాలరావు, మాడా, చలపతిరావు ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు.



'పిచ్చిపంతులు'లో మురళీమోహన్, మాధవి→



'నిజం చెబితే నేరమా'లో నిర్మల, రాజ్యలక్ష్మి, కృష్ణంరాజు, నూతన్‌ప్రసాద్



'యువరాజు'లో సుజాత

# సినిమా

## డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు హిందీ చిత్రాలు

★ "ఊరికి మొనగాడు" చిత్రాన్ని హీరో కృష్ణ సమర్పణలో పద్మాలయా ఫిలిమ్స్‌వారు "హిమ్మత్‌వాలా"గా నిర్మిస్తున్నారు. జితేంద్ర, శ్రీదేవి, అమ్జద్‌ఖాన్, ఖాదర్ ఖాన్, శక్తికపూర్ పాత్రధారులు. జి. ఆదిశేషగిరిరావు నిర్మాత. "జస్టిస్ చౌదరి" చిత్రాన్ని కూడా పద్మాలయా కంబైన్స్ అదే పేరుతో నిర్మిస్తోంది. చలసాని గోపి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. జితేంద్ర, శ్రీదేవి ముఖ్య పాత్రధారులు.

'యువతరం పిలిచింది'లో శ్రీశైలజ



★ వైజయంతీ మూవీస్ "అడవి సింహాలు" చిత్రాన్ని హిందీలో అర్జునరాజు, అశ్వనీదత్ నిర్మిస్తున్నారు. జితేంద్ర, ధర్మేంద్ర, శ్రీదేవి, పర్వీన్‌బాబి వగైరా నటవర్గం.

## అంతిమ విజయం "ప్రజాశక్తి"దే!

"మా చిత్రంలో ఒక టెలిఫోన్ సంభాషణ నాకు ఆదోళా అనిపించింది. దాన్ని తొలగించేస్తానని నేనే అంటే, అది చాలా బాగుంది — దాన్ని నిక్షేపంగా అట్టే ఉంచెయ్యవచ్చు. మేము సూచించినవే అభ్యంతరకరమైనవి — అన్నారు సెన్సార్ బోర్డ్ వారు," అని తెలియజేశారు మాదాల రంగారావు ఇటీవల "ప్రజాశక్తి" చిత్రాన్ని అన్ని భాషల పాత్రికేయుల అభిప్రాయాల కోసం ప్రత్యేకంగా ప్రదర్శించినప్పుడు. ఈ చిత్రంలో అసభ్యకరమైన సన్నివేశాలుగాని, ద్వంద్వార్థ సంభాషణలుగాని మచ్చుకైనా లేవు. వాస్తవానికి సెన్సార్ గైడ్ లైన్స్‌ని, రాజ్యాంగాన్ని గౌరవించి తీసిన చిత్రం. మూఢాచారాలను అనాదిగా స్వార్థపరులైన నీచులు సామాన్య ప్రజానీకాన్ని మభ్యపెట్టడం కోసం సృష్టించారన్నది ఈ చిత్రంలోని సందేశం. ప్రజలు కాలక్రమాన మేలుకుంటూ విజ్ఞానవంతులవుతున్నారని స్పష్టంచేసే ఉత్తేజకరమైన, ఉద్రిక్తమైన ఎన్నో రసవద్ఘట్టాలు అమాయకులను చైతన్యవంతం చేస్తుంది. లోగడ ప్రజలను మోసగించే దొంగస్వాముల, సాధువుల, గురువుల గుట్లను బయటపెట్టే చిత్రాలు ఎన్నో వచ్చాయి. అలాగే దొంగ పూనకాల అభినయంతో అమాయకులను తప్పుదారి పట్టించే నకిలీ దేవుడమ్మ అన్యాయాలను "అంతా మన మంచికే" చిత్రంలో భానుమతి ఎంతగానో చూపించారు. కాని, ఇప్పుడు ఈ చిత్రంలో ఇలాంటివి అభ్యంతరకరమైనవంటూ సెన్సార్‌బోర్డు విచక్షణారహితంగా, నిర్లక్ష్యవైఖరితో తృణీకారభావంతో సర్టిఫికేట్ ఇవ్వడంలో అసాధారణ జాప్యం జరపడం కేవలం 'కక్ష సాధింపు'కు నిదర్శనం తప్ప మరేమీ కాదనీ, అంతిమ విజయం 'ప్రజాశక్తి'దేననీ, పాత్రికేయులందరూ మాదాలను ముందుగానే అభినందించారు.

'రంగుల కల'లో బి. నరసింగరావు, మల్లిక్





'నవోదయం'లో అరుణ, విజయశాంతి, కవిత

## సినిమా

### "ప్రేమించి చూడు"

రాంశ్యాం ఆర్ట్ క్రియేషన్స్‌వారి "రాగం తానం పల్లవి" చిత్రం పేరును "ప్రేమించి చూడు"గా మార్చినట్లు డైరెక్టర్ తాతినేని ప్రసాద్ తెలియజేశారు. చంద్రమోహన్, పూజా సక్సేనా, హరిప్రసాద్, కట్టా సుబ్బారావు, చక్రవర్తి, వేటూరి సుందరరామమూర్తి ప్రభృతులు పాల్గొన్నారు. కాశీ విశ్వనాథ్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, కె. రామలింగేశ్వరరావు శిల్పం, కె. సత్యం కూర్పు, టి. వి. సుబ్బారావు నిర్వహణ, చింతపల్లి ప్రసాద్ సమర్పణలో ఈ చిత్రాన్ని నిర్మించిన డాక్టర్ టి. కె. ఎం. ఛటర్జీ "డిసెంబర్‌లో విడుదల చేయడానికి ఏర్పాట్లు చేస్తున్నాం," అన్నారు.

### కొలంబియా పిక్చర్స్ డబ్బింగ్ చిత్రం

"బ్లూ లాగూన్" చిత్రాన్ని కొలంబియా పిక్చర్స్ హిందీలో డబ్ చేస్తోంది. ఈ సంస్థ ఇలా భారతీయ భాషలోకి తమ చిత్రాన్ని డబ్ చేయడం ఇదే తొలిసారి. మిక్సింగ్ కార్యక్రమాలు లండన్‌లో పూర్తయ్యాక ఈ చిత్రం డిసెంబర్‌తో మన దేశంలోని ప్రధాన కేంద్రాలలో విడుదలవుతుంది.

'మనిషికో చరిత్ర'లో చంద్రమోహన్, ప్రభ



"నాకు డాన్స్ వచ్చా రాదా అని సందేహ పడకండి! సిన్సారే లేకపోయినట్టయితే అసలు డాన్స్ అంటే ఏవిటో చేసి చూపించగల్ను!"





'ఈ నాడు'లో కృష్ణ

# సినిమా

## "ఇంపా"లో రిజిష్టర్ చేయబడిన తమాషా టైటిల్స్

ఇండియన్ మోషన్ పిక్చర్స్ ప్రొడ్యూసర్స్ అసోసియేషన్‌లో ఈ కింది హిందీ చిత్రాల పేర్లు నమోదు చేయబడ్డాయి బహార్ పిక్చర్స్‌వారి చిత్రం "36–24–36". మెట్రో గోల్డన్ మూవీస్ "టాటా బిర్లా మోడి", రామాయణ చిత్ర "షాట్ గన్", చౌదరి ఎంటర్‌ప్రైసెస్ "సర్కారీ డాకూ" చిత్రాలు నిర్మిస్తాయట మరికొన్ని సంస్థలు "మేనక, హిట్లర్, పాలెస్టీన్, లిబరేషన్ ఆర్గనైజేషన్" పేర్లను రిజిష్టర్ చేశాయి.

## కొన్ని దాసరి కొత్త చిత్రాలు

★ "పొద్దు తిరుగుడుపూలు": కె. రామలక్ష్మి తాను రాసిన కథ ఆధారంగా నిర్మించే చిత్రం వచ్చే సంవత్సరం మొదలవుతుంది.

★ "పద్మశ్రీ రంజిత్‌కుమార్"·ఎ.ఎన్.ఆర్ విలక్షణమైన భూమికను నిర్వహించే తారకప్రభు ఫిలిమ్స్ చిత్రం డిసెంబర్ 22న ప్రారంభమవుతుంది. మోహన్‌బాబు, జయసుధ, సుహాసిని, రమాప్రభ, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ప్రభృతులు పాల్గొంటారు.

★ హీరో కృష్ణతో చిత్రం · "బండోడు – గుండమ్మ" అనంతరం దాసరి – కృష్ణ కాంబినేషన్‌లో నిర్మాత నిత్యానంద్ భట్ త్వరలో ఓ చిత్రాన్ని ప్రారంభిస్తారు.

'సకల కళా ప్రియుడు'లో పూర్ణిమాజయరాం



# హిందీ చిత్ర విచిత్రాలు

★ బొంబాయిలో సినిమా టికెట్లను బ్లాకులో విక్రయించే ఓ ఘనుడు "కేవలం అమితాబ్ బచ్‌చన్ నటించిన చిత్రాల మూలంగా నేను సంపాదించిన డబ్బుతో ఒక ఇల్లు కొనుక్కోగలిగాను. ఇద్దరు చెల్లెళ్ళకు ఘనంగా పెళ్ళిళ్ళు చేయగలిగాను," అని ప్రకటించాడట.

★ జబల్‌పూర్‌లోని జయంతి థియేటర్‌కు "శక్తి" చిత్రాన్ని చూడ్డానికి వచ్చిన అసంఖ్యాక స్టూడెంట్స్ ఘర్షణను అదుపులోకి తేవడానికి నానా యాతనలు పడ్డారు థియేటర్ యజమానులు. చివరికి కలెక్టరు ఆ థియేటర్‌ను తన ఆధీనంలోకి తీసుకుని, పోలీసుశాఖ ద్వారా టిక్కెట్ల విక్రయపు ఏర్పాట్లు చేశారు

★ అమితాబ్‌బచ్‌చన్ నటించిన ప్రకాష్ మెహ్రా చిత్రాలన్నీ స్వర్ణోత్సవాలు జరుపుకున్నాయి. తొలి చిత్రం "జంజీర్" నుంచి "హేరా ఫేరీ, ముఖద్దర్‌కా సికందర్, లావారిస్" వరుసగా ఆ వేడుకలు జరుపుకున్నాయి ఇటీవలే రజతోత్సవం జరుపుకున్న "నమక్ హలాల్" బొంబాయిలో 30 వారాలు తప్పకుండా ఆడతీరుతుందట.

★ బి. ఆర్. చోప్రా చిత్రం "నిక్కా" కథను డాక్టర్ అచ్‌లా నగర్ అనే రచయిత్రి రాసింది. తదుపరి చిత్రం "కిరాయే దార్"కు కూడా మాయా బాల్సే అనే మహిళ కథ తయారుచేస్తోంది

★ కిశోర్‌కుమార్ "దూర్ వాడియోమే కహీం" అనే చిత్రాన్ని పూర్తిగా కాశ్మీర్‌లో తయారుచేశాడు. ఈ చిత్రంలో ఒక్క పాటైనా లేకపోవడమే కాకుండా అసలు బాక్‌గ్రవుండ్ మ్యూజిక్ కూడా ఉండదట.

★ ఇటీవల విడుదలైన "దీవర్–ఇ–యార్" చిత్రంలో ఎనిమిది పాటలు, "స్టార్" చిత్రంలో తొమ్మిది పాటలు ఉన్నాయి.

★ తొలి టాకీ "ఆలమ్ ఆరా" తయారైన బొంబాయిలోని జ్యోతి స్టూడియోస్ ఇటీవలే పడగొట్టబడింది. దానిస్థానే ఆకాశహర్మ్యాలు నిర్మింపబడతాయట.

## సినిమా



'ప్రేమజ్వాల'లో విజేత, కమలాకర్

### దిలీప్‌కుమార్‌కు మనోజ్‌కుమార్ ప్రశంస

"దిలీప్‌సాబ్‌ను నాటి నుండి నేటి వరకూ అందరూ ఎందుకంతగా గౌరవిస్తారు? ఆయన తోనూ, ఆయన తర్వాతనూ సినిమా రంగంలో ప్రవేశించిన ఎందరో నామరూపాలు లేకుండా పోయారు. ఆయన ప్రతిభావంతుడైన నటుడు మాత్రమే కాదు. వృత్తి పట్ల ఆయనకుండే భక్తి శ్రద్ధలు ఇంతా అంతా కాదు. నా 'క్రాంతి' చిత్రం షూటింగ్ సమయంలో దిలీప్‌సాబ్ ఒకసారి వరుసగా మూడు నాలుగు రోజులపాటు ఏ పనీ లేకుండా కూర్చోవలసి వచ్చినా ఏ మాత్రం విసుక్కోలేదు. ఇప్పటి కొందరు సహాయ పాత్రధారులు సైతం కొన్ని గంటల వరకు అలా ఉండవలసి వస్తే, 'మా షాట్ ఎప్పుడొస్తుందండీ?' అంటూ ఎంతో సహనాన్ని కోల్పోయినట్లు ప్రతి అయిదు నిముషాలకో సారి నిట్టూరుస్తూ, తొందర పెడ్తుంటారు. కాని, దిలీప్‌సాబ్‌కు స్వతస్సిద్ధంగా పఠాన్‌కు ఉండ వలసిన చిరాకు ఏ మాత్రం లేకపోగా – కాల్‌షీట్ వేళకు కరెక్ట్‌గా హాజరై, మేకప్ వేసుకుని, ఓపికగా పిలుపు కోసం ఎదురుచూస్తూ కూర్చునే వారు," అన్నాడు మనోజ్‌కుమార్.

ఈ నలభై ఏళ్ళలో దిలీప్ యాభై చిత్రాల్లో నటించి ఉంటాడేమో! కాని, "బాబీ" చిత్రంతో తొమ్మిదేళ్ళ క్రితం చిత్రసీమలో ప్రవేశించిన ఋషికపూర్ ఇప్పటికే నలభై చిత్రాల్లో నటించేశాడు. ★

### శత్రుఘ్నసిన్హా.... వాడు – నేడు

శత్రుఘ్నసిన్హాకు నేడు ఐశ్వర్యవంతులు నివసించే ప్రాంతంలో ఒక లంకంత భవంతి ఉంది. స్వంత చిత్ర నిర్మాణ సంస్థ, ఎన్నో కార్లు ఉన్నాయి. బాంక్‌లో ఎంతో ధనం మూలుగుతోంది. మిత్ర పరివారం ఎంతోమందున్నారు. కాని, ఒకప్పుడు అతను బొంబాయిలోని సద్గురు లాడ్జిలో ముగ్గురితో కలిసి ఓ గదిలో ఉంటూ, అరవై రూపాయల అద్దె చెల్లించడం కోసం కూడా ఇంటినుంచి వచ్చే మనిఆర్డర్ కోసం ఎదురుచూసేవాడు. ఇప్పటి 'శత్రు సామ్రాజ్యం' ఒక్కనాటితో నిర్మింపబడినది కాదు కదా?

### వింత ప్రయత్నం

సాధారణంగా హిట్ అయిన చిత్రాన్ని ఇతర భాషలలో నిర్మించడం రివాజు. ఈ మామూలును ఛేదిస్తూ నిర్మాతలు రీనారాయ్, బర్కారాయ్ "టిక్ టిక్ టిక్" అనే ఫ్లాప్ అయిన భారతీరాజా దర్శకత్వం వహించిన తమిళ చిత్రాన్ని హిందీలో నిర్మించడానికి పూనుకున్నారు. బహుశా ఆ సబ్జెక్టు హిందీ ప్రేక్షకులనే విశేషంగా ఆకర్షించేదై ఉండాలని ఆ సోదరీమణుల నమ్మిక కావొచ్చు. డిసెంబరులో సెట్స్‌కు వెళ్ళే ఈ చిత్రానికి భారతీరాజా బిజీగా ఉన్నందున ఐ. వి. శశి దర్శకుడుగా నియుక్తుడయ్యాడు. ఇందులో రీనారాయ్‌తోపాటు కమల్‌హాసన్, టీనాముసీమ్, స్వరూప్ సంపత్, గెస్ట్‌గా పర్వీన్‌బాబీ పాల్గొంటారు.

'నటన'లో భువన, నాగేంద్రబాబు



# దుశ్శాలువ

## కె. గోదావరి శర్మ

వీధిలో ఏం చేసి, ఏం చూసి వచ్చాడోగాని, వెంకటశాస్త్రి ధుమధుమలాడుతూ ఇంట్లో కొచ్చాడు. పెరట్లోకెళ్లి కాళ్లు కడుక్కొచ్చి ఇల్లంతా కలయజూశాడు. "వీడేడీ, ఈ వెధవ ?" అనడిగాడు, జనాంతికంగా.

కొడుకు ఆంజనేయశాస్త్రి గురించి వేసిన ప్రశ్న అది. ఆ ప్రశ్నకి వెంటనే సమాధానం రాలేదు.

రేడియో బల్ల దగ్గర కూచుని పేపరు చూస్తున్న చిన్నశాస్త్రి తలెత్తి, "ఇవాళ గ్రంథాలయంలో కవి సమ్మేళనంట. మన ఆంజనేయుడికి కూడా దుశ్శాలువ కప్పి సత్కరిస్తారట. అక్కడికి వెళ్లాడు" అని చెప్పేడు, మాటల్ని వీలైనంత సాధారణంగా ధ్వనింపజేస్తూ.

వెంకటశాస్త్రి ఆశ్చర్యాన్ని ప్రకటించేడు. "ఏవిటి ? వీడి కవిత్వాన్ని మెచ్చుకుని దుశ్శాలువలు కప్పే వాళ్లూ ఉన్నారూ ?" అన్నాడు వెటకారంగా.

చిన్నశాస్త్రికి కొంచెం కోపం వచ్చినా ఏమీ అనలేదు. వెంకటశాస్త్రి అత్తగారు మాత్రం అంతా వింటున్నదల్లా కొంచెం హాస్యంగా అన్నట్టు అంది, "వాడి కవిత్వం నీకు నచ్చకపోతే ఇంకెవళకీ నచ్చదుటోయ్ ? వాడీడు పిల్లలంతా వాణ్ణి అంత ఇదిగా మెచ్చుకుంటుంటేను..." అని.

"ఆఁ, ఆఁ! వాళ్లే మెచ్చుకోవాలి! చదువా సంధ్యా ? సినిమాలూ తిరుగుళ్లూ చాలక కవిత్వం కూడాను వీళ్లకి" అన్నాడు వెంకటశాస్త్రి. ఇంకొకప్పుడైతే ఆంజనేయశాస్త్రినీ అతడి స్నేహితుల్నీ ఇంకా దురుసుగా తిట్టేవాడే. ఇవాళ సన్మానమూ దుశ్శాలువా అనేసరికి కొంత మెత్తబడ్డాడు.

పేరు వెంకటశాస్త్రి అయినా అతడు కోపంవస్తే కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధాన్లులాగా, శాంతంగా ఉన్నప్పుడు కంఠాభరణంలో సోమావధానిలాగా ఉంటాడు. వేదం ఎనభై రెండు పన్నాలూ సుస్వరమైన కంఠంతో టేపరికార్డర్‌లాగా చదవగలడు. కాని వాటి అర్థం, దాని వెనక ఉన్న ఆధ్యాత్మిక విశేషాలూ తెలుసుకోగలిగినంత పండితుడు కాడు. అందుచేత ఆచరణ దగ్గరకి వచ్చేసరికి వంశపారంపర్యంగా వస్తున్న ఛాందసం, మూఢనమ్మకాలూ వదులుకోలేదు.

అసలతనకి మొదటినుంచీ కవిత్వమూ కళలూ అంటే సరిపడదు. అతడికెందులోనూ ప్రవేశమూ లేదు, ఆసక్తీ లేదు. ఏదో నేర్చుకున్న ముక్కామ్ముక్కా మరిచిపోకుండా వల్లే వేసుకుంటూ వార్షికం పోకుండా నాలుగిళ్లలో పౌరహిత్యం చేసుకుంటే దినం అదే గడిచిపోతుందని అతడి అభిప్రాయం. అందుకే అందొచ్చిన తమ్ముణ్ణికూడా తనతోనే తిప్పుతూ పౌరహిత్యంలో తర్ఫీదు ఇస్తున్నాడు. అంతేగాని ఈ కవిత్వాలూ సంగీతాలూ మనలాంటి వాళ్లక్కాదు అని అతడి నమ్మకం.

కాని అతని కుమారుడు ఆంజనేయశాస్త్రికి ఇంటర్‌లో ఉండగానే కవిత్వంలో అభిరుచి కలిగింది. వాళ్ల తెలుగు లెక్చరర్ ఒకాయన అభ్యుదయభావాలు కలవాడు. ఆయన తన క్లాసులో ఏదో సందర్భం కల్పించుకుని ఆధునిక కవిత్వం గురించి విద్యార్థులకి చెపుతూ ఉండేవాడు. ప్రస్తుత సమాజ స్థితిగతులు, ఇప్పుడు కవిత్వం ఎలా ఉండాలో, విప్లవ కవులూ ప్రజాకవులూ ఎలా రాస్తున్నారో మొదలైనవన్నీ చెప్పేవాడు. ఆ విషయాలు మిగతా విద్యార్థులకి ఎంతవరకు పనికొచ్చేయోగాని ఆంజనేయశాస్త్రినిమాత్రం బాగా ప్రభావితంచేశాయి. అతడు పత్రికల్లోపడ్డ ప్రతికవితా విశ్లేషణాత్మకంగా చదివేవాడు, తనకీ ఏమైనాభావాలువస్తే రాసి లెక్చరర్‌గారికి చూపించేవాడు. ఆయన శాస్త్రిని బాగా ప్రోత్సహించాడు. క్రమంగా కాలేజీ మేగజైన్ లోను, స్థానిక పత్రికల్లోనేగాక ఒకటిరెండు ప్రముఖ పత్రికల్లోకూడా అతడి రచనలు అచ్చయ్యేసరికి మిత్రులందరికీ అతడోహీరో అయిపోయాడు.

కొడుకు కవితావ్యాసంగంగురించి వినగానే మండిపడ్డాడు వెంకటశాస్త్రి. అసలు తండ్రికొడుకు లిద్దరికీ ఎప్పుడూ షష్టాష్టకమే. "ఛందస్సా వ్యాకరణవాఁ వల్లకాడా ? ఇంతోటి వీడి పాండిత్యానికి తోడు వీడు కవిత్వం వెలగబెట్టడం కూడానా ? ఒళ్లు దగ్గరపెట్టుకుచదివి ఆ బీకాంఏదో అయిందనిపిస్తే చాలు" ఇదీ అతడిఅభిప్రాయం.

కాని అతడితమ్ముడు చిన సూర్యనారాయణ శాస్త్రి ఒక్కపిసరు ఈకాలం మనిషి. ఆపదలో ఉన్నప్పుడల్లా ఆంజనేయుణ్ణి వెనకేసుకొస్తూ ఉంటాడు. "పోనిద్దూ అన్నయ్యా, చిన్నగుంటడు! వాడేదో సరదాకి నాలుగువాక్యాలురాస్తే అది కవిత్వం అయిపోతుందా, దాన్తో వాడు చెడిపోతాడా ? అయినా వాడి చదువేదో వాడు బాగానే చదువుకుంటున్నాడు కదా! మొన్న క్లాసుపరీక్షలో మార్కులూ బాగానే వొచ్చాయి" అన్నాడు సమర్థిస్తూ.

"ఊఁ ఊఁ, బుద్ధి పెడతోవలు పట్టడం ఎంతసేపు ? పిలక్కితాడుకట్టుకుని చదివేవాళ్లం మా చిన్నప్పుడు. వీడు ఇలాగే కవిత్వాలూ కథలూ మరిగేడంటే ఇహ చదువు కోటాకు వేసినట్టే! డబ్బెక్కువయిపోయి చదివిస్తున్నావాఁ కాలేజీ చదువులు ?" అని నాలుగు రోజులదాకా సణుగుతూనే ఉన్నాడు వెంకటశాస్త్రి.

ఆంజనేయశాస్త్రి కవిత్వం రాస్తున్నాడంటే అందరికంటె ఎక్కువ సంతోషించింది వాళ్ల అమ్మమ్మ. అక్షర జ్ఞానం లేకపోయినా, మనవడిమీద అభిమానంకొద్దీ అతడేదో గొప్ప కవిత్వమే రాస్తున్నాడనుకుంటుంది. అందులోనూ తాతగారి పోలికతో పుట్టేడు మరి! "మీ నాన్న కూడా పద్యాలల్లేవారు కదుటే ? అన్నవరం సత్యనారాయణస్వామి మీద శతకం రాసేరు కూడాను" అని కూతురికి గుర్తుచేసింది ఆవిడ.

ఎవరేమన్నా అనుకున్నా ఆంజనేయశాస్త్రి కవిత్వాన్ని వదిలిపెట్టదలుచుకోలేదు. అతడికి మొదటినుంచీ తండ్రి మూర్ఖత్వం, తల్లి చాదస్తం, అమ్మమ్మ అమాయికత్వం చూస్తే ఏదో అసంతృప్తి, నిస్పృహ, వాళ్లమీద జాలీ కలిగేవి. క్రమంగా కవిత్వంలోనేగాక ఇతరత్రాకూడా అభ్యుదయభావాలు, శాస్త్రీయ దృక్పథం, తిరుగుబాటుధోరణి పెరిగాయి. కాని వాద ప్రతివాదాల్లో రచ్చగెలుస్తున్నాడుగాని ఇంట గెలవలేకపోతున్నాడు.

కారణం సెంటిమెంట్లు. ఇంటికొక్కడు మగపిల్లడు. ఆడపిల్లలందరూ పెళ్లిళ్లై అత్తారిళ్లకి వెళ్లిపోయాక ఆఖరివాడు తనొక్కడే మిగిలాడు వాళ్లకి. ఇంట్లో నలుగురు పెద్దవాళ్లకీ తనమీదే ప్రాణాలన్నీ. చూస్తూ చూస్తూ ఎలా ఎదిరించగలడు వాళ్లని ? మిగిలిన వాళ్లముందు కనీసం తన అయిష్టాన్ని ప్రకటించగలడు గాని తండ్రి మరీ అగ్గిరాముడు. తన కోపాన్ని బలహీనతగా కాక గొప్పతనంగా నిలబెట్టుకొస్తున్నవాడు. 'కోపం వస్తే మనిషిని కాను నేను. ఏవఁనుకుంటున్నావో !' అని బెదిరిస్తూ ఉంటాడు. 'కోపం రాకపోతే మాత్రం మనిషి ఏవిటి' అని గొణుక్కుంటాడు శాస్త్రి.

చిన్నప్పుడోసారి వెంకటశాస్త్రి ఎందుకో ప్రళయరుద్రుడై ఇంటిల్లిపాది మీదా ఒంటికాలిమీద భరతనాట్యం ఆడుతూ ఉండగా శాస్త్రికి ఓ ఐడియా తట్టింది. తన వాచకంతీసి తండ్రికి వినిబడేటట్టుగా 'తన కోపమె తన శత్రువు' పద్యం చదివాడు. దాన్తో తండ్రి పశ్చాత్తాపపడలేదు సరిగదా, "నువ్వు నాకు నీతులు నేర్పుతావురా గుంజ కక్కగట్టా" అని శాస్త్రి వీపు సాపుచేశాడు. ఆ తర్వాత మరెప్పుడూ తండ్రిని సంస్కరించే ప్రయత్నం చెయ్యలేదు శాస్త్రి.

కాని అంతకంతకీ తండ్రి అంటే నిర్లక్ష్యం, అగౌరవం పెరిగాయి. తండ్రి తిట్లకి; దెబ్బలకి మొండికెత్తి, వీలయినంతవరకు తండ్రి ఏం చెప్తే దానికి సరిగ్గా వ్యతిరేకంగా చేసేవాడు.

"ఆంజనేయశాస్త్రిట. అంతకంటె అందమైన పేరు తట్టలేదు కాబోలు! జాంబవంతుడని పెట్ట వలసింది. ఛీ ఛీ! బొత్తిగా ఈస్థటిక్ సెన్స్ లేదు. కన్నకొడుక్కి కోతిపేరు పెట్టుకునే వాళ్లని





ఏమనాలో..." ఓ సారి గొణుక్కుంటున్నట్టు ఫిర్యాదు చేశాడు— తల్లి, పినతండ్రి ఉన్నప్పుడు.

ఆ మాటలు వెంకటశాస్త్రి విననే విన్నాడు. తకిలీతో దారం తీస్తున్నవాడల్లా ఆగి, "ఏవిఁరా? నీ అందానికి ఆపేరు చాల్లేదా ఏవిఁటి? జుట్టు పోరిగాడిలా జులపాలూ నువ్వూను?" అని ఎంచేతో శాంతంగానే అడిగాడు.

"మరి చెవులకి పోగులు తీసేస్తే మీరు ఒప్పుకోరు కదా! లేకపోతే మీ ఇష్టం వచ్చినట్టే అంటకత్తెర వేయించుకుందును. పోగులు తీసేస్తే మీ రొప్పుకోరు, ఉంటే కాలేజీలో అందరూ నవ్వు తారు. అందుకని జుట్టు పెంచుకుని చెవులు కనబడ కుండా ఏదో బాధపడుతున్నాను" సణుగుతూ సంజాయిషీ ఇచ్చేడు ఆంజనేయశాస్త్రి.

"అఘోరించేవు ఎవళ్లో కాలేజీలో వెధవలు నవ్వుతారంటే నువ్వెందుకు పట్టించుకోవాలి? అసలు— సహవాసదోషం— కాని బుద్ధులు పుట్టే యంటే పుట్టవూమరి?" అని అక్కడినుంచి లేచి పోయాడు వెంకటశాస్త్రి.

ఎవరైనా తన ఫ్రెండ్స్‌ని తక్కువచేసి మాట్లా డడం సహించలేదు శాస్త్రి. కాని తండ్రి అలా అనడం అలవాటేగనక పట్టించుకోవడం మానేశాడు. అతడి అభిమానానికి పెద్దదెబ్బ అతడు ఇంటర్‌లో ఉండగా తగిలింది.

కొడుక్కి ఉపనయనం తలపెట్టేడు వెంకట శాస్త్రి. పంచశిఖలు పెట్టుకోవాలని పట్టుపట్టేడు. ఆంజనేయుడికీ తతంగం అంతా చికాకనిపించింది. "నాకిష్టంలేదు. నేనలా కాలేజీకివెళ్తే నన్నో వింత మృగాన్నిచూసినట్టు చూస్తారు" అని చెప్పిచూశాడు.

"ఏడిశారు బోడివెధవలు! వాళ్ళేదో అంటారని పంచశిఖలు వద్దంటావా? షట్కర్మలూ శ్రౌతంగాలేకపోయినాక ఇహ బ్రాహ్మడేమిటి? అంత ఎవళకీ మొహం చూపించలేకపోతే ముండమోసిన దాన్లా ఇంట్లో పడిఉండు, ఏదో కానిపనిచేస్తున్నట్టు సిగ్గుపడక్కర్లేదు." అని తెగేసిచెప్పేడు.

ఆ ఘడియ రానేవచ్చింది. మంగలాడు శాస్త్రి తలని తన అధీనంలోకి తీసుకుని నిర్దాక్షిణ్యంగా గీసి పారేశాడు. తరువాత లెక్కచూసుకుంటే నాలుగే శిఖలు ఉన్నాయి గుండుమీద. "నీ అమ్మకడుపుమాడా, ఇదేవిఁట్రా?" అని వెంకటశాస్త్రి క్షురకుడిమీద విరుచుకుపడ్డాడు.

వాడు, "పొరపాటే బాబూ" అని ఒప్పుకున్నాడు.

ఒప్పుకుంటే మాత్రం, నాలుగు అయిదెలా అవుతాయి? ఉన్న జుట్టు గొరిగించగలరు గాని లేనిది అప్పటికప్పుడు ఎలా మొలిపించగలరు! "పంచశిఖ లంటే అయిదు ఉండాలి గదా; ఆ మాత్రం నీకు బుద్ధిలేదేవిఁరా!" అని మరోసారి మంగలి మీద ఎగిరాడు.

"నాకేటి తెలుస్తాది బాబూ? అయినా ఇయ్యాలా రేపూ ఎవురూ ఒడుగులు ఇలగ సేయించడం లేదుగదా! అలవాటు తప్పిపోయింది మాకున్నూ" అన్నాడు వాడు.

ఇంక ఎవరిని ఏమని ఏం ప్రయోజనం? ఆఖరికి చిన్నశాస్త్రి ముహూర్తం మించిపోకుండా ●









ఉపాయం యోచించేడు. "నెత్తిమీదున్న ఒక శిఖని మధ్యలో కొంత తీసేసి రెండుగా చేస్తే మొత్తం అయిదు సంఖ్య సరిపోతుంది కదా!" వెంకటశాస్త్రి ఈ పదత్తికి ఒప్పుకోక తప్పలేదు.

"చాలా శాస్త్రోక్తంగా చేయించాడోయ్ మీ నాన్న నీ ఒడుగు" అని ఫ్రెండ్సంతా నవ్వుతూ అంటూంటే శాస్త్రి హృదయం బాగా గాయపడింది ఆ అవమానాన్ని, దానికి కారణమైన తండ్రి చాదస్తాన్నీ అతడెప్పుడూ మరిచిపోలేక పోయాడు

అదీ ఆ ఇంటి పరిస్థితి, ఆ తండ్రీ కొడుకుల వ్యవహారమున్నూ.

ఇవాళ దీన్ని శాలువ మడిచి పట్టుకుని సగర్వంగా ఇంట్లోకొచ్చేడు ఆంజనేయశాస్త్రి. అతడి హృదయం ఉత్సాహంతో ఉరకలు వేస్తోంది ఇది అతడు తన స్వయం ప్రతిభతో సంపాదించినది. లతడి కవిత్వానికి ఇంత గుర్తింపు ఎప్పుడూ రాలేదు. అంటే తనూ కవేనన్నమాట!

అతడింట్లోకొచ్చేసరికి తండ్రీ, పినతండ్రీ అప్పుడే భోజనాలకూర్చున్నారు ఎడంచేత్తోటే శాలువ అందుకుని చూశాడు చినశాస్త్రి. ఆ తర్వాత అది చేతులు మారింది. మౌనంగానే తిరిగి దాన్ని అందుకున్నాడు శాస్త్రి.

తన ఇంటి సంగతి తనకి తెలిసిందే అయినా ఎవరూ తనని ప్రశంసించకపోవడంతో అతడి ఉత్సాహం అంతా చల్లారిపోయింది. చిన్నాన్న అయినా ఒక్క మంచి మాట అంటే ఏం పోయింది? శాస్త్రి చిన్నబుచ్చుకున్నాడు.

అది గమనించాడు చినశాస్త్రి. "ఊఁ అయితే దీన్ని 'దుశ్శాలువ' అని ఎందుకంటార్రా ఆంజనేయుడూ?" అనడిగాడు సరదాగా

శాస్త్రికి వెంటనే సమాధానం తోచలేదు.

"మంచి పనికి ఇచ్చిన మంచి శాలువ కదా, 'సత్శాలువ' అనక 'దుశ్శాలువ' అని ఎందుకన్నట్టు?" ప్రశ్న మళ్ళీ వివరించాడు చినశాస్త్రి.

ఆంజనేయశాస్త్రి చురుగ్గా ఆలోచించాడు. "ఒంటి బ్రాహ్మడు ఎదురైతే దుశ్శకునం అంటారు. బ్రాహ్మలు ఎక్కువగా దీన్ని వేసుకుంటారు. అంచేత ఒంటి బ్రాహ్మడితోబాటు వాడి ఒంటిమీదున్న శాలువ కూడా..." అని అర్థోక్తిలో ఆపేశాడు

"అఘోరించేవు, వెధవ తెలివితేటలూ నువ్వూను." అని వ్యాఖ్యానించేడు వింటున్న

## దుశ్శాలువ

వెంకటశాస్త్రి.

ఇంతలో వాళ్ల అమ్మమ్మ వచ్చింది అక్కడికి. మనవడి ఘనకార్యం విని పొంగిపోయింది. "చెప్పేను కాదుటే నేను? వీడికి వాళ్ల తాతగారి పోలికే అంతాను" అని కూతురితో చెప్పింది.

"అమ్మమ్మా, ఆ శాలువ నీకే" అన్నాడు ఆంజనేయశాస్త్రి. అతడి మనసు ఇప్పుడు ఉల్లాసంగా ఉంది.

"నాకెందుకురా నాగన్నా నువ్వు కష్టపడి సంపాదించుకున్నది" అని మొహమాటపడింది ముసలావిడ.

"అలా కాదమ్మమ్మా! చలికాలంలో కప్పుకోడానికి పనికొస్తుంది నీకు" అన్నాడుశాస్త్రి. అలా అంటున్నప్పుడు చిన్నప్పుడుచదివిన ప్రేమ్‌చంద్ కథ 'ఈద్‌గాహ్' గుర్తొచ్చింది. అందులో అవ్వకి పటకారు కొనిచ్చిన మనవడిలాగే ఫీలయ్యాడు.

"నాకు నా బూర్నీసుఉంది కద్రటా! పోనీలే, ఆ మాట అన్నావు, అంతేచాలు"అని మురిసిపోయింది ఆవిడ.

శాస్త్రి శాలువతీసుకెళ్ళి తన పెట్టెలో భద్రంగా దాచాడు.

కొన్నాళ్లకి, మూఢాలూ శూన్యమాసమూ వెళ్ళేక, పెద్ద గాలివానా తుపానూవచ్చింది ఇల్లంతా కురుస్తూ ఉండడంవల్ల కూచోడానికీ నిలబడడానికీ చోటులేక నానా భీభత్సంగానూఉంది వెంకటశాస్త్రికీ చినశాస్త్రికీ ఈ మధ్య చేతినిండా పనిలేక పోవడంవల్ల ఇల్లు అయ్యవారి నట్టిల్లులాగేఉంది. పల్లెటూళ్ళో గోష్పదమంత కొంప్ర ఉందన్నమాటే గాని అదెప్పుడూ బాపనవ్యవసాయమే అంచేతకూడా ఇల్లు ఎలా ఉండాలో అలా ఉంది.

దీనికితోడు కరువులో అధికమాసం అన్నట్టు ముసలావిడకి అంపకంపాలమీద ఊష్ణం. ఓ దగ్గిర మంచంవెయ్యడానికి లేదు, వేసినమంచం అరగంటసేపు అక్కడ ఉంచడానికిలేదు, ఈ ముసురెప్పుడు తగ్గుతుందాఅని మీన మేషాలు లెక్కపెడుతూ కూచున్నారు ఇంటిల్లిపాదీను.

ధర్మాసుపత్రి అరఖు ఎన్నాళ్ళువాడినా ఫలితం ఉండదని చినశాస్త్రి వీధిచివరఉన్న ప్రైవేటు డాక్టర్ని పిలుచుకొచ్చాడు. ఆయన ఫీజుకీ ఆయన కొనమన్న మాత్రలకీ నలుగురిదగ్గర ఉన్న డబ్బులూ ఊడ్చి ఇవ్వాల్సివచ్చింది. రేపివాన తగ్గకపోతే ఎలాగాలని వెంకటశాస్త్రిమనసులోభయంముసురుగాపట్టుకుంది

ఆ సాయంత్రం ముసలావిడకి జర్వం ఎక్కువైంది. ఇంట్లో ఉన్న కుక్షిణిబొంతలూ, చింకిదుప్పట్లూ అన్నీ ఆవిడ మంచం మీదే ఉన్నాయి. అయినా చాలడంలేదు. నాల్రోజులై ఎండ మొహం చూడక పోవడాన్ని అన్నీ తడితడిగా వాసనగా ఉన్నాయి

"ఆంజనేయుడేడీ? వాడి కవి సమ్మేళనం శాలువా కప్పితే వెచ్చగా ఉంటుంది" అన్నాడు చినశాస్త్రి.

ఆంజనేయశాస్త్రి అయిపులేడు.

"ఏడీ ఈ వెధవ? ఇంత వానలోనే కాలెగరేసుకుంటూ వెళిపోయేడా ఊరిమీదకి? రోడ్లన్నీ సర్వే చేసి అక్కడ హాజరు వేయించుకోకపోతే ఒప్పుకోరు కాబోలు వాడి ఫ్రెండ్సు.." తన సహజ ధోరణిలో అన్నాడు వెంకటశాస్త్రి.

"పోనిద్దురూ. పొద్దుట్నించి గోలా ఇంటో కూచుని ఎంతసేపుంటాడు? తోచొద్దూ వాడికి మాత్రం?" అంది భార్య.

"వాడి పెట్లో కాబోలు పెట్టేడు ఆ శాలువ. చూడు, తీసుకురా" అని తమ్ముడికి పురమాయించేడు వెంకటశాస్త్రి.

పెట్లో శాలువలేదు. ఇల్లంతా గాలించేరు. "ఎక్కడ పెట్టేడు చెప్మా" అని ఆశ్చర్యపడ్డారు, చికాకుపడ్డారు, అంతా.

### బ్రదుకు తీరు

పెట్టిన మొక్కలు కొన్ని
పెట్టినట్లే ఉండిపోతాయి
పడి మొలచినవి
విజృంభిస్తాయి!
'పూవో' అంటూ పెంచిన పిల్లలు
ముడుచుకుపోతూ ఉంటారు
గాలికీ ధూళికీ పెరిగినవారు
దుక్కలల్లే ఉంటారు!
అల్లా అని — మొక్కలను
నాటకుండా ఉండలేం —
పిల్లలను గాలికి
వదలివేయలేం —
వేటి బ్రదుకు వాటిది!
ఎవరి బ్రదుకు తీరు వారిది!

— పైడిపాటి సుబ్రరామశాస్త్రి



100 కి. మీ. వర్గం కుస్తీ పోటీలో భారత్‌కి చెందిన సత్‌పాల్‌సింగ్, జపాన్‌కి చెందిన అకినా సుజూకీని చిత్తుచేసిన దృశ్యం.

భారత్ – పాకిస్తాన్ జట్ల మధ్య జరిగిన హాకీ ఫైనల్స్ పోటీలో పాకిస్తాన్ ఫార్వర్డ్ హసన్ సర్దార్ గోలు చేస్తున్న దృశ్యం. ఈ పోటీలో పాకిస్తాన్ (7–1) గెలిచింది.



మహిళల 100 మీటర్ల ఫ్రీస్టయిల్ ఈత పోటీలో రికార్డు టైంలో విజయాన్ని సాధించిన జపాన్ వనిత కవోరీ యనాసే.

ఆసియా క్రీడోత్సవాలు

## పతకాల వివరాలు

| దేశం | స్వర్ణ | రజత | కాంస్య | మొత్తం |
|---|---|---|---|---|
| చైనా | 61 | 51 | 41 | 153 |
| జపాన్ | 57 | 52 | 44 | 153 |
| దక్షిణకొరియా | 28 | 28 | 37 | 93 |
| ఉత్తరకొరియా | 17 | 19 | 20 | 56 |
| భారత్ | 13 | 19 | 25 | 57 |
| ఇరాన్ | 4 | 4 | 4 | 12 |
| ఫిలిప్పైన్స్ | 2 | 3 | 9 | 14 |
| పాకిస్తాన్ | 3 | 3 | 5 | 11 |
| సిరియా | 1 | 1 | 1 | 3 |
| కువాయిట్ | 1 | 3 | 3 | 7 |
| ఇండోనేసియా | 4 | 4 | 7 | 15 |
| మంగోలియా | 3 | 3 | 1 | 7 |
| లెబనాన్ | 0 | 1 | 0 | 1 |
| మలేషియా | 1 | 0 | 3 | 4 |
| థాయ్‌లాండ్ | 1 | 5 | 4 | 10 |
| ఇరాక్ | 2 | 3 | 4 | 9 |
| సింగపూర్ | 1 | 0 | 2 | 3 |
| హాంకాంగ్ | 0 | 0 | 1 | 1 |
| వియత్నాం | 0 | 0 | 1 | 1 |
| బహారిన్ | 0 | 0 | 1 | 1 |
| అఫ్ఘనిస్థాన్ | 0 | 1 | 0 | 1 |
| కటార్ | 0 | 0 | 1 | 1 |
| అరేబియా | 0 | 0 | 1 | 1 |





స్త్రీల జిమ్నాస్టిక్స్‌లో స్వర్ణ పతకాన్ని అందుకున్న చైనా మహిళ ఊ జియానీ.



పురుషుల 100 మీటర్ల పరుగులో స్వర్ణ పతకాన్ని పొందిన రబువాన్ పిట్ (మలేసియా)



కువైట్ – ఇరాన్‌ల ఫుట్‌బాల్ క్వార్టర్ ఫైనల్స్‌లో గోల్ కాదని చెయ్యెత్తి సూచిస్తున్న కువైట్ ఆటగాళ్ళు, బంతికి అడ్డం పడ

## విద్యార్థి లోకం వ్యాసరచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

విద్యార్థుల ప్రధానాశయం విద్యార్జన. విద్య ద్వారా విజ్ఞానాన్ని సంపాదించటం, ఆ సంపాదించిన విజ్ఞానాన్ని సక్రమ మార్గంలో దేశాభ్యున్నతికి వినియోగించటం, తద్వారా తన జీవన భృతిని సంపాదించుకొని, వ్యక్తిగత జీవితాన్ని కూడా సుఖమయం చేసుకోవటం విద్యార్థుల ఆశయాలు.

కాని, ప్రస్తుత పరిస్థితులలో విద్యార్థుల ఆశయాలు అణచివేయబడినాయి. పవిత్రమైన విద్య కలుషిత రాజకీయాలతో నిండిపోవటం దీనికి ఒక కారణము. ప్రస్తుతము విద్యార్థుల ఆశయాలు ఏ విధంగా రూపుదాల్చాయంటే, ఏదో విధంగా బతకడానికి సరిపడ విద్యని అభ్యసించాలనే తప్ప విజ్ఞానాన్ని ఆర్జించాలనే తపన చాలమంది విద్యార్థులలో కనపడుటలేదు.

### రచయిత పరిచయం



"స్వస్థలం పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాలోని కొత్తపల్లి అగ్రహారం. ప్రస్తుతం విశాఖపట్టణంలో బి. వి. కె. కాలేజిలో బి. ఎ. మూడవ సంవత్సరం చదువుతున్నాను. ఇప్పటివరకూ కళాశాలలో నిర్వహించిన వ్యాస రచనా పోటీలలో బహుమతులు వచ్చాయి. కాని ఒక పత్రిక నిర్వహించిన పోటీలో బహుమతి రావడం ఇదే ప్రథమం. ఆ బహుమతినిచ్చి ప్రోత్సహించిన ఆంధ్ర సచిత్ర వార పత్రికకు నా కృతజ్ఞతలు."

**మల్లంపల్లి వెంకట సుబ్రహ్మణ్యం**

అదీగాక, చదివే చదువుకీ, చేసే ఉద్యోగానికి ఏమాత్రమూ సంబంధము ఉండటములేదు.

ఇకపోతే, మా విద్యార్థిలోకం ఎదుర్కొంటున్న సమస్యలు అనేకం ఉన్నాయి. విద్యాలయాలలో ప్రవేశించటమే కష్టం. ప్రవేశించిన తరువాత పాఠ్య పుస్తకాలు సంపాదించటం ఒక యజ్ఞం. ఆ పుస్తకాలలో ఉన్న అవకతవకలను దాటి పరీక్ష వ్రాసి ఉత్తీర్ణులవటం చాల కష్టం.

కొన్ని విద్యాలయాలలో పూర్తి సంఖ్యలో ఉపాధ్యాయులు ఉండరు. ఒకవేళ ఉన్నప్పటికీ వారు సరిగా తమ బాధ్యతలను నిర్వహించరు.

విద్యాలయాలలో రాజకీయాలు ప్రవేశించుటవలన విద్యార్థుల ఆశయాలు అణగారిపోయాయి. రిజర్వేషనులు, ఉత్తరాయణాలు, దక్షిణాయణాల వలన నిజమైన అర్హత, ఆసక్తి ఉన్న విద్యార్థులు అణచివేయబడుతున్నారు. కీలక రంగమైన విద్యారంగంలో ఈ రకమైన అవినీతి ప్రబలడంవలన మిగిలిన రంగాలు కూడ కలుషిత మవటానికి అవకాశము కలుగుతున్నది.

కొన్ని కళాశాలలో గ్రంథాలయ, వసతులు సరిగా లేకపోవటంవలన చాలమంది విద్యార్థులు ఇబ్బంది పాలవుతున్నారు.

వీటన్నింటికంటె నేటి పరీక్షా విధానము అనేక లోపములతో నిండియున్నది. విద్యార్థులలో విజ్ఞానాన్ని కొలవటానికి ఈ విధానము సరియైనది కాదు. ఉదాహరణకి మొదటనుంచీ శ్రద్ధగా చదివిన విద్యార్థికంటె పరీక్ష రేపనగా రాత్రి గైడు కొని చదివిన విద్యార్థి ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడవుతున్నాడు. ప్రభుత్వాలు మారినప్పుడల్లా పరీక్ష విధానాలను మార్చడం అనేది విద్య యొక్క ఔన్నత్యాన్ని కించపరిచేదిగా ఉంది.

పై సమస్య లన్నింటినీ ఒక రోజులో పరిష్కరించడం అనేది సాధ్యపడేది కాదు. ముందర విద్యార్థులు తమ ఆశయసిద్ధి కోసం దీక్షతో కృషి సలపాలి. ఉపాధ్యాయులు కూడా వారికి పూర్తి సహకారాన్ని అందజేయాలి. ప్రభుత్వమువారు కూడా విద్యార్థులకు అవసరమయ్యే అన్ని సదుపాయాలను కల్పించి వారి అభివృద్ధికి దోహదము చేయవలెను.

ముఖ్యంగా విద్యార్థులు పూర్తిగా విద్యార్జన మీదే తమ దృష్టిని కేంద్రీకరించాలి. మా విద్యార్థిలోకం యొక్క ఆశయాలను ప్రజలు ప్రభుత్వము సఫలీకృతము చేయుటకు సహకరించుట ద్వారా ఉత్తమ పౌరులను దేశానికి అందజేయవచ్చును. ★

## దుశ్శాలువ

ఎనిమిదవుతూంటే నీళ్ళోడుతూ వచ్చాడు ఆంజనేయశాస్త్రి. బట్టలూ తలా అంతా తడిసిపోయి ఉన్నాయి. చేతిలో ఏదో కాగితం పొట్లం తడిసిపోకుండా భద్రంగా తెచ్చేడు.

"ఏవోయ్! దొరగారికి ఇప్పటికి ఇల్లు గుర్తొచ్చిందేవిటి? అదేమిటి ఆ పొట్లం చేతిలో?" అనడిగేడు వెంకటశాస్త్రి.

"అమ్మమ్మకి" అని క్లుప్తంగా చెప్పి, పొట్లం పినతండ్రి చేతికిచ్చి, తను బట్టలు మార్చుకునే ప్రయత్నంలో పడ్డాడు ఆంజనేయశాస్త్రి.

చినశాస్త్రి పొట్లం కొద్దిగా విప్పి అందులోకి చూస్తూ, "ఇవన్నీ ఏమిట్రా? ఎక్కడివీ డబ్బులు నీకివన్నీ కొనడానికి?" అనడిగి, వెంటనే ఏదో స్ఫురించి, "కొంపదీసి నీ శాలువగాని." అని ఆగేడు, అనుమానంగా చూస్తూ.

"ఔను. కొంపతియ్యడం ఎందుకూ? శాలువా అమ్మేశాను." నిర్లిప్తంగా చెప్పి ప్యాంటు జేబులోంచి మిగిలిన డబ్బులు తీసి పినతండ్రి చేతికిచ్చేడు శాస్త్రి.

"అమ్మేసేవూ?" అని నోరు తెరుచుకుని ఉండిపోయేడు వెంకటశాస్త్రి.

"ఔను. మనకి ఉపయోగం లేనప్పుడు ఇంకెందుకూ అది? మనకెన్నో అవసరమైన ఖర్చులు ఉండగా..."

"ఐతే మాత్రం? ఇలా ఇంటో వస్తువులు తీసుకెళ్ళి బజార్లో అమ్ముకోవడం ఇంటావంటా ఉందిరా? అందులోనూ శుభవా అని కొత్త బట్ట." వెంకటశాస్త్రి ఇంకా ఆశ్చర్యపోతూనే ఉన్నాడు.

"ఏం? తప్పేమిటి? మన అవసరానికి అదీ ఇలా పనికొచ్చింది" తనని తాను సమర్థించుకుంటూ అన్నాడు శాస్త్రి.

"కాని శాలువ శాలువగా కూడా పనికొస్తుంది కదరా! ఇందాకా అమ్మమ్మకి బాగా చలిగా ఉంటే కప్పడం కోసం ఇల్లల్లా వెతికేం. ఉంటే పనికొచ్చేది కదా!" అన్నాడు చినశాస్త్రి, పొట్లంలోంచి ఏపిల్సూ, బత్తాయిలు, గ్లూకోజు పేకెట్ తీసి స్టూలుమీద పెడుతూ.

అవన్నీ చూసిన ముసలమ్మగారు కలగజేసుకుని, "పోనీయ్రా! చిన్నవెధవ ఏదో చేసేడు" అంది హీనస్వరంతోనే.

ఆంజనేయశాస్త్రి అమ్మమ్మ మంచందగ్గరకి వెళ్ళికూచున్నాడు. "నువ్వుచెప్పు అమ్మమ్మా! ఈ శాలువకాంపోతే ఇలాంటిది ఇంకోటి సంపాదించుకోలేనూ నేను? అంతకన్న నువ్వు, నీ ఆరోగ్యం ముఖ్యంకాదూ మాకు?" అనడిగాడు గారంగా.

"మా నాయనే, మా తండ్రే! ఎంత పెద్ద బుద్ధిరానీది!" అని పొంగిపోయింది ఆవిడ. మనవడి చేతులుపట్టుకు నిమురుతూ, "ఎందుకు సంపాదించ లేవురా? ఇలాంటివి బోలెడుశాలవలూ, సన్మానాలూ వాస్తాయి నీకు... చెప్పేనుకదుటే, వీడు వాళ్ళ తాతగారి పోలికనీ! అంతవాడూ అవుతాడు......" అని ఆయాసపడుతూ శ్వాసపీల్చుకుంది ఆవిడ.

వెంకటశాస్త్రి మొట్టమొదటిసారి కాబోలు, కొడుకునైపు మెచ్చుకుంటూ చూశాడు. ★



# నీలాకాశం

సీరియల్ — శ్యామల



ఇందిర హాలు ద్వారం వరకు వెళ్ళి చూసింది. అప్పుడే మలుపు తిరిగి వెళ్ళిపోయారు వాళ్ళు.

పనిమనిషి కూడా అక్కడే నిలబడి చూస్తున్నది. ఇందిరను చూసి "మీరూ వస్తారా అమ్మా ? పాపం రంగయ్యని చూసి వద్దాం" అంది.

ఇందిరకీ వెళ్ళి చూడాలనే ఉంది, పనిమనిషి వెంట బయల్దేరింది దాదాపు ఫర్లాంగు నడిచాక వరుసగా పొలాలు కనిపించాయి. పొలం గట్ల వెంబడే ఉన్న తాటి చెట్ల క్రింద గుంపుగా ఉన్నారు జనం. ఇందిర వెళ్ళి ఆ గుంపులో తొంగిచూసింది. మధ్యలో ఒక వ్యక్తి — రంగయ్య కాబోలు — మట్టిలో పడుకొని ఉన్నాడు అతని ప్రక్కనే మోకాళ్ళ పైన కూర్చొని డాక్టర్ జాక్సన్ ఏదో నచ్చజెపుతున్నాడు

"వద్దు బాబుగారూ ! వద్దు !" అంటున్నాడు ఆ పడుకున్న వ్యక్తి.

"పాముల నరసయ్య వద్దకు మనిషి వెళ్ళాడు బాబుగారూ ! పోనీ రంగయ్య ఇష్టం వచ్చినట్లే చేద్దాం" అన్నాడు ఒక వ్యక్తి.

"మంత్రం వేయించుకో రంగయ్యా ! నేను వద్దనటంలేదు. ముందర ఓ ఇంజెక్షన్ కూడా చేయించుకో" అన్నాడు డాక్టర్ జాక్సన్

ఆయన తెలుగు ఉచ్చారణ వింతగా ఉంది కాని వాళ్ళెవరూ వింతగా చూడటంలేదు, బాగా అలవాటయిపోయింది కాబోలు — అనుకుంది ఇందిర.

రంగయ్యలో పాము కరిచిన బాధకంటే, భయం ఎక్కువగా కనిపిస్తున్నది "సూది తీసుకుంటే మంత్రం పని చెయ్యదని వాడి భయం బాబుగారూ !" అన్నాడు మరొకడు

"బాబుగారు అంతగా చెప్తుంటే వినవేమిటి రంగా ! సూది తీసుకో !" ఇంకొకడు అన్నాడు.

"అసలు, రంగయ్యా చాలా తక్కువ పాములలో

*(గత సంచిక తరువాయి)*

విషం ఉంటుంది. నిన్ను కరిచినది విషంది కాక పోవచ్చు ! నేనిచ్చే ఇంజెక్షన్ పాముకాటు గురించినది కాదు. ఊరికే కరిచిన చోటు చీము అదీ పట్టకుండా ఉండాలని, అంతే —"

డాక్టర్ జాక్సన్ మాటలు రంగయ్య వినిపించుకోవటంలేదు. "వద్దు బాబుగారూ ! నాకు ఏ సూదులూ వద్దు! పాముల నరసయ్యని పిలిపించండి" ప్రాణభయంతో వణికిపోతున్నా, అతను ఇంజెక్షన్ మాత్రం వద్దనే అంటున్నాడు

అతని మనస్థితి డాక్టర్ జాక్సన్‌కి అర్థమైంది మంత్రంలో అతనికి గల గాఢవిశ్వాసం గుర్తించాక, ఆయన ఇంక ఇంజెక్షన్ గురించి బలవంతం చేయలేదు "పోనీలే రంగయ్యా, ఇంజెక్షన్ వద్దులే! నరసయ్యని రానివ్వు — మంత్రం వేయించుకుందువు గాని" మృదువుగా అన్నాడు. పాము కరిచిన చోటుకి పై భాగంలో కట్టిన కట్టుని మరొకసారి గట్టిగా కట్టి లేచి నిలబడ్డాడు. కొద్దిదూరంలో చేతిలో సంచీతో వస్తున్న వ్యక్తిని చూసి, చకచకా అతని దగ్గరకు వెళ్ళి ఏదో మాట్లాడాడు. అతను తలూపి, రంగయ్య వద్దకు వచ్చాడు

ఆ వ్యక్తిని చూడగానే, పాలిపోయిన రంగయ్య ముఖం కొంత తేరుకుంది "ఏం భయంలేదు, రంగడూ!మంచిమంత్రం వేస్తాను"అంటూ రంగయ్య ప్రక్కనే కూర్చొని, సంచీలోనించి ఏవో మూలికలు తీసి, పాము కరిచిన చోటున వాటిని ఉంచి, ఏవో మంత్రాలు చదివాడు. తర్వాత "అంతే రంగడూ ! విషం దిగిపోయింది— ఇంజెక్షన్ కూడా వేసుకో, ఎందుకయినా మంచిది" అన్నాడు

ఆ మాటకోసం ఎదురుచూస్తున్నట్లు డాక్టర్ జాక్సన్ ముందుకి వచ్చి ఇంజెక్షన్ చేశాడు. ఈ మారు రంగయ్య ప్రతిఘటించలేదు తర్వాత నలుగురి సహాయంతో అతనిని తన క్లినిక్‌కి తీసుకువచ్చి పడుకోబెట్టాడు దగ్గర్లో ఉన్న టౌన్‌కి ఫోన్ చేసి అతినికి పామువిషం విరుగుడు మందు తెప్పించి ఇప్పించాడు.

"రంగయ్యా, సాయంత్రం వరకూ ఇక్కడే పడుకో ! తర్వాత వెళ్ళిపోవచ్చును వేడి పాలు పంపిస్తాను, తీసుకో" అని ఆదరంగా చెప్పాడు

కృతజ్ఞతతో దండం పెట్టాడు రంగయ్య

తన గదిలోకి వెళ్ళి అలసిపోయినట్లు కూర్చున్నాడు డాక్టర్ జాక్సన్ ఇందిర వెళ్ళింది ఆయన వద్దకు.

"ఇందిరా, ఈ రోజు మనం అదృష్టవంతులం అతనికి తగిన మందులు ఇవ్వగలిగాము.."

"ఆ పాము అసలు విషపూరితం కాదేమో—" అన్నది ఇందిర.

"అయినా, కాకపోయినా అవసరమైన వైద్యం చేయాలి. ఒకమారు... దాదాపు పదిహేనేళ్ళ క్రితం— ఒక వ్యక్తి పాము కాటువలన మరణించాడు, నేను చూస్తుండగానే! ఇలాగే ఇంజెక్షను వద్దన్నాడు—" భారంగా అన్నాడాయన ఆయన మనస్సు ఏదో బాధాయుతమైన గతంలోనికి వెళ్ళిందని గుర్తించిన ఇందిర మరేమీ మాట్లాడలేదు చేతిలోని కాగితాలు చదువుకుంటూ కూర్చుంది.

* * *

"ఉపనిషత్తులలోని ఋషిని "దేవుడు అంటే ఎవరు ?" అని ప్రశ్నించాడొక శిష్యుడు. ఆయన మౌనంగా ఉండిపోయాడు భగవంతుడంటే మౌనం — ప్రశాంతత — అని ఆయన ఉద్దేశం. "అలా కాదు స్వామీ దయచేసి మాటల్లో దైవాన్ని నిర్వచించండి" అన్నాడు శిష్యుడు. అప్పుడా మహర్షి "నేతి, నేతి" అన్నాడట అంటే "ఇది కాదు — అది కాదు" అని అర్థం ఇంకా వివరంగా చెప్పమని కోరితే "తత్వమసి" అని క్లుప్తంగా జవాబిచ్చాడు. అంటే "నీవే ఆ శక్తి" అని భావం.

భగవత్ స్వరూపాన్ని — ఈ విశ్వమంతటినీ ఆవరించి ఉన్న పరమాత్మను — అవగాహన చేసుకోవాలంటే నీ ఆత్మ స్వరూపాన్ని ముందుగా చూడగలగాలి. ఆత్మ అనేది ఆ పరమాత్మలోని భాగమే — తిరిగి పరమాత్మలో ఐక్యమయి తాదాత్మ్యం చెందటమే ఆ శక్తి పరమావధి. పరమాత్మ నుంచి విశ్వాత్మ విశ్వాత్మ నుంచి జీవాత్మ... జీవాత్మ తిరిగి పరమాత్మలో ఐక్యత .. జీవన స్రవంతి నిరంతరంగా ప్రవహిస్తూనే ఉంటుంది. ఇదంతా ఎందుకు ? ఉపనిషత్తులు జవాబు నందిస్తాయి ఇదంతా సృష్టి అనే ఆనందం కొరకు. ప్రపంచంలో

---

**జరిగిన కథ — 8** ఆ రోజు రామారావ్ సుభద్రల సిల్వర్‌జూబిలీ సెలిబ్రేషన్స్‌కి అన్ని ఏర్పాట్లు చేస్తారు వారి సంతానం ఇందిర, రమేష్, సురేష్, ఉష. దానిలో భాగంగా రామారావ్, సుభద్రలను సినిమాకి పంపుతారు పిల్లలు. సినిమా చూసి స్కూటర్‌మీద వస్తూ యాక్సిడెంట్‌లో మరణిస్తారు ఆ దంపతులు. మధుతో ఇందిర పెళ్ళి గతంలోనే ఖాయం చేయడం జరుగుతుంది తన తమ్ముళ్ళ, చెల్లి భవిష్యత్తు తీర్చిదిద్దడానికి మధుకి యిష్టం లేకపోయినా ఉద్యోగంలో చేరాలనుకుంటుంది ఇందిర. తన స్నేహితురాలు వీణ సహాయంతో ఓ ఫైవ్ స్టార్ హోటల్లో టెంపరరీ పోస్ట్‌లో ఇందిర టైపిస్ట్‌గా జేరుతుంది తన కుటుంబాన్ని పైకి తీసుకువచ్చేవరకు ఆగమని ఇందిర ఎన్ని విధాల నచ్చజెప్పినా వినని మధు ఆమెతో తెగతెంపులు చేసుకోవడానికే నిశ్చయించుకొంటాడు. డాక్టర్ జాక్సన్‌తో ఇందిరకు పరిచయం కల్గుతుంది. ఆయన వివరాలు తెలుసుకొని ఆశ్చర్యపోతుంది. అక్కడ జాబ్ పూర్తికాగానే తన దగ్గర టైపిస్ట్‌గా జేరమని జాక్సన్ ఇందిరను ఆహ్వానిస్తాడు. పరీక్షలవగానే చెల్లిని తీసుకు రమ్మని తమ్ముళ్ళకి చెప్పి తను ముందుగా వస్తుంది ఇందిర. లక్ష్మీపురంలో రైలు దిగి, అక్కడి పోర్టర్ సాయంతో ఆ పల్లెకు బయల్దేరుతుంది. తను ఎవరి మూలంగా అక్కడి జాబ్ వదులుకొని ఇక్కడికి వచ్చిందో అతనే డా॥ సుధాకర్ ఇందిరను జాక్సన్ దగ్గరకు చేరుస్తాడు

---

దుష్కృత్వం ఎందుకు ? దానిలోనించి మంచి ఉప్పొంగటానికే ! చీకటి ఎందుకు ? వెలుగు మరింత కాంతివంతంగా అవటానికే ! బాధలు ఎందుకు ! ఆత్మ పరిపూర్ణత చెందటానికే ! త్యాగంలోని ఆనందం అనుభవించటానికే ! ఈ సృష్టికి పరమార్థం ఏమిటి ? ఆనంద రసపానం ప్రతి జీవికీ లభ్యమవటానికే .........'

ఇందిరకు చదువుతున్నది పూర్తిగా అర్థమంయీ కాకుండా ఉన్నది. అయినా మనస్సులో క్రొత్త జ్ఞానకాంతులు చూస్తున్న తృప్తి కలుగుతున్నది. చదువుటంలో నిమగ్నమయింది.

మధ్యాహ్నం ఇందిర సుదర్శనం మాస్టారుగారి యింటికి వెళ్లేసరికి పద్మ ఎదురు వచ్చింది. "నీ కోసమే చూస్తున్నాను. రా, భోజనం చేద్దాం" అంటూ వంట గదిలోకి తీసుకువెళ్ళింది. స్నేహ స్వభావంకల పద్మ ఆ కొద్ది పరిచయంలోనే ఇందిరను ఆకట్టుకుంది. "అమ్మ భోజనం చేసి ఇప్పుడే పడుకుంది. మనిద్దరమే ఇప్పుడు తినవలసింది" అని పీటలు వేసి కంచాలు పెట్టింది.

"డాక్టర్ జాక్సన్ సంగతి ఏమిటి ? ఆయన భోజనమూ వగైరా—" అడిగింది ఇందిర.

"ఆయనకు హరి అని మంచి వంట మనిషి ఉన్నాడు. పండగలు అవీ వస్తే మా యింటికి పిలుస్తాము. నాన్నగారు, ఆయన ప్రాణ స్నేహితులు. నేను పుట్టకముందు నించి కూడా ఆయన ఆ యింట్లో, నాన్నగారు ఈ యింట్లో ఉంటున్నారు. 'నా పుస్తకం టైప్ చేసేందుకు హైదరాబాదు నించి ఒక అమ్మాయి వస్తుంది' అని అంకుల్ చెప్పగానే అమ్మ, నాన్న పేయింగ్ గెస్ట్‌గా మా యింట్లో ఉండవచ్చునని అన్నారు. ఎక్కువ సమయం నేను ఒంటరిగా గడుపుతూంటాను ఇందిరా ! ఇప్పుడు నీవు వచ్చావని నాకు చాలా సంతోషంగా ఉంది."

"నీకు అక్కచెల్లెళ్ళు అన్నదమ్ములు ఎవరూ లేరా పద్మా ?"

"ఒక్కడే అన్నయ్య ఉన్నాడు, విజయవాడలో ఉద్యోగం. అప్పుడప్పుడు సెలవ పెట్టుకొని అన్నయ్య వదిన వస్తూ ఉంటారు."

"వచ్చేవారం మా చెల్లెలు వస్తుంది. తను, నేను ఇద్దరమూ ఉంటే మీకు ఇబ్బంది కాదుకదా—"

"ఇబ్బంది ఏం కాదు, ఈ యింట్లో గదులన్నీ విశాలమైనవే ! చెల్లెలంటే, ఎన్నేళ్ళేమిటి ?"

"పదేళ్ళ పాప. దానికి ఆరోగ్యం బాగాలేదు పల్లెగాలి, వాతావరణం మంచివని డాక్టర్లు అన్నారు అసలు నేను ఈ ఊరు రావటానికి ముఖ్యకారణాల్లో అదొకటి."

మాటల్లోనే భోజనం ముగిసింది. తిరిగి డాక్టర్ జాక్సన్ ఇంటికి వెళ్ళింది ఇందిర. ఆయనకు మధ్యాహ్నంపూట పడుకొనే అలవాటు ఉన్నదిట — హరి చెప్పాడు. ఇందిర తన ఆఫీసు గదిలోకి వెళ్ళి కూర్చొని టైప్ చేయటం మొదలుపెట్టింది.



మూడు గంటలకు డాక్టర్ జాక్సన్ వచ్చారు అక్కడికి. "ఎలా ఉందమ్మా పని?" పలకరించాడు.

"ఇంటరెస్టింగ్‌గా ఉన్నదండీ!" నవ్వుతూ జవాబిచ్చింది ఇందిర.

"వెరీ గుడ్!" అని మరొక కుర్చీలో కూర్చున్నారు ఆయన. హరి రెండు కప్పుల్లో టీ తీసుకువచ్చాడు టీ త్రాగుతూ ఆయన ఉష ట్రీట్‌మెంట్ గురించి అడిగారు. మందులు, వివరాలు చెప్పింది ఇందిర.

"త్వరలోనే తగ్గిపోతుంది ఇందిరా! ఏం ఫర్వాలేదు" అని ధైర్యం చెప్పారు ఆయన "ఇంకా పేషంట్స్ వచ్చే టైమవుతున్నది. నీకు ఎప్పుడు వెళ్ళాలనిపిస్తే అప్పుడు వెళ్ళమ్మా" అని చెప్పి తన కన్సల్టింగ్ రూమ్‌లోనికి వెళ్ళాడాయన.

'మరి కొంతసేపటికి బిల్డింగ్‌లో సందడి మొదలయింది. కాంపౌండర్ వచ్చి తన గదిలో కూర్చొని మందుసీసాలు సర్దసాగాడు. ఆ పల్లెటూరిలో నర్స్ దొరకటం కష్టంగా ఉన్నది, ఎవరు వచ్చినా ఎక్కువకాలం ఉండటం లేదుట; ప్రస్తుతం ఎవరూ లేరు పేషంట్స్ చాలామంది — స్త్రీలు, పురుషులు, పిల్లలు — చుట్టుప్రక్కల ఊళ్ళవాళ్ళు కూడా రాసాగారు.

ప్రొద్దున పాము కరిచిన వ్యక్తి క్షేమంగా ఉన్నాడు. బంధువులు యింటికి తీసుకువెళ్ళారు. అయిదు గంటల ప్రాంతంలో టైప్‌రైటర్ మూసేసి, కాగితాలు సర్ది బయటకు వచ్చింది ఇందిర. హాల్లో బెంచీల మీద కూర్చొని ఉన్న జనాన్ని



చూస్తూ బయటకు నడిచింది. ద్వారం వద్ద ఒక నిమిషం ఆగింది — వెళ్ళే ముందు డాక్టర్ జాక్సన్‌కి చెప్పి వెళ్తే మర్యాదగా ఉంటుందేమోననే ఆలోచనతో. కాని, బిజీగా ఉన్నారాయన, డిస్టర్బ్ చేయటమా, వద్దా అని ఆలోచిస్తూ ద్వారం వద్ద నిలబడి పోయేసరికి —

"ఎక్స్‌క్యూజ్‌మీ" అన్న స్వరం వినిపించింది.

ఉలిక్కిపడి చూసేసరికి ఎదురుగా డాక్టర్ సుధాకర్ నిలబడి ఉన్నాడు. "ఎవరూ లోపలికి రాకూడదా ఏమిటి?" నవ్వుతూ అడిగాడు.

తడబాటుగా "సారీ" అని ప్రక్కకి తప్పుకుంది.

"రాత్రి అలసట అంతా తీరిందా? ఈ రోజే డ్యూటీలో జాయిన్ అయినారా"? అడిగాడు.

అవునన్నట్టు తలూపింది ఇందిర.

"మాస్టరు గారింట్లో మీరు ఉండటానికి ఏర్పాటు చేశానన్నారు అంకుల్. అంతా వసతిగా ఉన్నదా?"

అతను ఇలా కుశల ప్రశ్నలు అడుగుతుంటే ఇందిరకు ఆశ్చర్యంగా ఉంది. నిన్న ఏ మాత్రం స్నేహంగా కనబడలేదు ఇతను.

మళ్ళీ తలూపింది ఇందిర.

"నేను ప్రతి సాయంత్రం ఇక్కడికి వచ్చి అంకుల్‌కి పేషంట్స్‌ని చూడటంలో అసిస్ట్ చేస్తూంటాను" తన గురించి చెప్పాడు.

ఏదయినా మాట్లాడకపోతే బాగుండదు అనుకుంది ఇందిర. కాని అదేమిటో, ఏం మాట్లాడాలనేది — ఒక్క ముక్క కూడా — తోచలేదు

రెండు నిమిషాలు మౌనంగా గడిచాక "నేను మిమ్మల్ని ఆపుతున్నట్లున్నాను, వెళ్ళండి!" అని లోపలికి వెళ్ళిపోయాడు.

ఇందిర మనసంతా ఏదోగా అనిపించింది. నిన్న రాత్రి, పాపం స్కూటర్‌మీద ఇంతదూరమూ తీసుకువచ్చి దింపాడు; ఈ రోజు పాత పరిచయస్థుడిలాగా పలకరించాడు. తను మూగమొద్దులాగా నిలబడిపోయిందేమిటి!? క్రొత్తవాళ్ళతో జంకు, సిగ్గు ఫీలయ్యే స్వభావం కాదు తనది. మరి అతని దగ్గర ఏం మాట్లాడాలో తోచనేలేదు ఎందుకని? తను రూడ్‌గా ప్రవర్తించిందని అతను అనుకొని ఉంటాడు.

ఇంట్లో అడుగు పెడ్తూనే "కాఫీ రెడీ ఇందిరా!" అంది పద్మ.

"థాంక్స్ పద్మా, ఇప్పుడే వస్తా" అంటూ, బాత్‌రూమ్‌లోనికి వెళ్ళి ముఖం, కాళ్ళు, చేతులు కడుక్కొని వచ్చింది. ముఖానికి పౌడరు వేసుకొని, తిలకం దిద్దుకుంటూండగా కాఫీ గ్లాసులు రెండు తీసుకొని వచ్చింది పద్మ. ఇందిర గ్లాసు అందుకొని కుర్చీలో కూర్చుంది.

"ఏం ఇందిరా, ఎలావుంది జాబ్?"

"చాలా బాగుంది పద్మా! డాక్టర్ జాక్సన్ నిజంగా చాలా లోతయిన మనిషి. ఆయన రాసినవి చదువుతుంటే నాకు ఏదో కొత్త లోకాలు చూస్తున్నట్టు అనిపించింది."

"అన్నట్టు సుధాకర్ వచ్చాడా? రోజూ సాయంత్రాలు వస్తాడు" అంది పద్మ.

"ఆఁ, వచ్చారు. నీకు అతను బాగా తెలుసా?"

"నాకు తెలియకపోవటం ఏమిటి? అతను ప్రక్క యింట్లో జాక్సన్ అంకుల్ వద్ద పెరిగాడు."

ఆశ్చర్యంగా చూసింది ఇందిర. "అతనికి తల్లి తండ్రులు, కుటుంబం లేదా?"

"అదంతా ఓ కథ ఇందిరా! సుధాకర్‌తో కాస్త పని ఉంది. ఇప్పుడే వచ్చేస్తాను" రివ్వున వెళ్ళిపోయింది పద్మ.

ఇందిర ఖాళీగ్లాసులు తీసుకువెళ్ళి, కడిగి పెట్టింది. వరలక్ష్మిగారు బియ్యం ఏరుతుంటే తనూ ప్రక్కనే కూర్చొని ఏరసాగింది.

"నీ కెం దు క మ్మా పని?" నవ్వుతూ వారించింది ఆవిడ.

ఆవిడ చిరునవ్వు ఎందుకో తల్లిని గుర్తుకు తెచ్చింది. తదేకంగా ఆవిడ ముఖంలోకి చూస్తూ "మా అమ్మ కూడా ఇంతే! ఏ పని చేయబోయినా 'నీ కెందుకమ్మా పని' అనేది" అన్నది ఇందిర.

తర్వాత ఆవిడ ప్రశ్నలకు జవాబుగా తల్లి తండ్రుల గురించి, వాళ్ళు యాక్సిడెంట్‌లో పోవటం— అన్నీ చెప్పింది. తమ్ముళ్ళ చదువు, ఉష అనారోగ్యం, సమస్యల గురించి వివరించింది. ఆవిడ సానుభూతిగా అంతా విని, "మీ చెల్లాయి వచ్చాక కూడా ఇక్కడే ఉండవచ్చును ఇద్దరూ! దక్షిణం ప్రక్క గది విశాలంగా ఉంటుంది. ఇక్కడే భోజనాలు కూడా చేయవచ్చును. ఆడపిల్లలు ఒక్కరే ఎక్కడ ఉండగలరు?" అన్నది.

పద్మ వచ్చి "ఇందిరా, మా ఊరు చూపిస్తాను, వస్తావా?" అంది.

"సిటీలో పుట్టి పెరిగిన అమ్మాయికి మన ఊరిలో ఏం వింతలు, విశేషాలు ఉంటాయి పద్మా!" అంది వరలక్ష్మిగారు.

"అట్లాగనకు అమ్మా, మన వాగు, గుడి, పొలాలు — వీటి అందం చూసి ఇందిర ఆశ్చర్యపోతుంది! ఇటువంటి దృశ్యాలు ఏ సిటీలోనూ ఉండవు! పద ఇందిరా!"

ఇద్దరూ కలిసి అరమైలు నడిచి, ఊరి వెలుపలికి వచ్చారు. పద్మకి తెలిసిన వాళ్ళెవరెవరో కనిపించటం, వాళ్ళు నిర్మొహమాటంగా "ఈ అమ్మాయి ఎవరు?" అని అడగటం జరిగింది. అందరికీ "పెద్ద డాక్టరు బాబుగారి దగ్గర పని చేయటానికి వచ్చింది. మాబంధువే, మాయింట్లోనే ఉంటున్నది" అని చెప్పింది.

తర్వాత ఇందిరతో "బంధువని చెప్పకపోతే, ఇంకా వివరాలు అడుగుతూ పోతారు ఇందిరా! అందుకని అట్లా చెప్పాను" అంది.

"చెప్తే ఏంలే పద్మా!" నవ్వింది ఇందిర "డాక్టర్‌జాక్సన్‌ని ఇక్కడ అంతా పెద్దడాక్టరుబాబు, అంటారేమిటి?"

"వెనక ఊరికే 'డాక్టరుబాబు' అనే వాళ్ళు. సుధాకర్ మెడిసిన్ పూర్తి చేసుకొని వచ్చాక, అతనిని 'చిన్న డాక్టర్‌బాబు' అనేవాగారు. అప్పుడు అంకుల్ ఆటోమాటిక్‌గా 'పెద్ద డాక్టర్‌బాబు' అయిపోయారు!"

"బాగుంది! సుధాకర్ ఉద్యోగం ఎక్కడ?"

"ఇక్కడికి ఇరవై మైళ్ళ దూరంలో తాలూకా ముఖ్యపట్టణం ఉంది. అక్కడి గ వర్న మెం ట్ హాస్పిటల్‌లో సుధాకర్ డాక్టరుగా జాబ్ చేస్తున్నాడు. సాయంత్రాలు ఇక్కడికి వచ్చి అంకుల్‌కి సాయపడ్తూంటాడు. టౌన్‌లో ఉద్యోగం, ఒక్కోసారి నైట్ డ్యూటీలు, వీలయినపుడల్లా ఇక్కడి క్లినిక్‌లో పని — క్షణం ఊపిరి సలపదు అతనికి. పాపం జాలి అనిపిస్తుంది నాకు."

"కావాలని బిజీగా పని చేసుకుంటున్నపుడు జాలి దేనికి పద్మా?"

"కావాలనే — అనుక్షణం బిజీగా ఉండాలనే పని కల్పించుకుంటున్నాడు నిజానికి! ఏవేవో జ్ఞాపకాల నుంచి తప్పించుకోవటానికి ..."

"అతనిని చూస్తే ఏమీ చింతలు కల మనిషి లాగా లేడే?" ఆశ్చర్యంగా అంది ఇందిర. కాస్త పొగరుగా, మరి కాస్త దర్జాగా కనిపించే వ్యక్తికి చింతలా??

"ఉన్న చింతలు, చికాకులు పైకి కనబడకుండా ఉండాలనే గర్వం అనే ముసుగు వేసుకున్నాడు. అది ముసుగు మాత్రమే! నిజానికి మనిషిలో అహంకారమే లేదు, మంచితనం తప్ప! సరేకాని ఇందిరా, నీవు అతనితో సరిగా మాట్లాడనేలేదుట?"

"నీతో అలాగని అన్నాడా?"

"ఛ, లేదు! 'ఇందిరని చూశావా, ఎంత స్నేహంగా ఉన్నదో ఆ అమ్మాయి' అని నేను అంటే 'నాతో మాత్రం స్నేహంగాలేదు, మాటే మాట్లాడలేదు' అన్నారు. నేను నవ్వి 'అది నీ బ్యాడ్‌లక్ — ఇది నా గుడ్‌లక్' అని వచ్చేశాను. నిజంగా ఇందిరా, నీవు ఫ్రెండ్‌గా దొరకడం నా అదృష్టం ..నీవు ఎందుకో నాకు చాలా నచ్చావు!"

ఇందిర నవ్వి ఊరుకుంది. వాళ్ళు మాటల్లోనే ఊరి బయటకు వచ్చేశారు. ఎదురుగ్గా వాగు వడిగా ప్రవహిస్తున్నది. వాగు ఒడ్డునే తాటిచెట్లు, దగ్గర్లోనే ఎత్తుగా ఉన్న ఒక పెద్ద గుట్టపైన దేవాలయం ఉంది. తల ఎత్తి, నీలాకాశాన్ని అంటుతున్నట్లుగా ఉన్న గోపురాన్ని, ధ్వజస్తంభాన్ని చూస్తూ "ఎంత అందంగా, ఎంత ప్రశాంతంగా ఉన్నది ఇక్కడ!" అంది సంభ్రమంగా ఇందిర.

"నేను చెప్పలేదూ, మా ఊరిలో ఎంతో అందమైన దృశ్యాలు ఉన్నాయని!" గర్వంగా అంది పద్మ.

ఇద్దరూ గుట్ట ఎక్కసాగారు.

"ఇందిరా, దైవం అంటే నమ్మకం ఉందా?" సడెన్‌గా అడిగింది పద్మ.

"ఏమో. పద్మా, నేను చెప్పలేను. నాకు నమ్మకం ఉన్నదో లేదో నాకే తెలీదు. ఒక్కోసారి, బాధలు, సమస్యలు చుట్టుముట్టినపుడు దైవమనే కరుణామయుడే ఉంటే— ఇటువంటి క్లిష్ట పరిస్థితులు కల్పిస్తాడా అనిపిస్తుంది. మళ్ళీ డాక్టర్ జాక్సన్ వంటివారు ఇదంతా ఆయన లీల అన్నపుడు అదీ నిజమే, అనిపిస్తుంది. ద్వైదీ భా వా ల తో ఉంటుంది నా మనస్సెప్పుడూ. ఏమయినా, నాకు గౌతమబుద్ధుడి మాటలు యిష్టం— 'సృష్టికర్త గురించి యోచించకండి. నేను ఈ ప్రపంచంలోకి ఎందుకు వచ్చాను, ఎక్కడికి పోతున్నాను అని మధన పడకండి. ఈ సృష్టి అంతరార్థం తెలుసుకోవాలని శాస్త్రాలు చదువుతూ కాలం గడిపివేయకండి. సద్వర్తనతో, అహింసతో, కరుణతో జీవితాలు గడపటం ముఖ్యం — ఈ దైవపూజలు, వ్రతాలు, నోములు చేయటం కంటె! ఈ విషయాన్ని వివరించటానికి బుద్ధుడు ఒక కథ కూడా చెప్తాడు — ఒక వ్యక్తికి ఎక్కడి నించో వచ్చి విషపూరితమైన బాణం ఒకటి తగిలిందనుకో. అతని మిత్రులు

## నీలాకాశం

వెంటనే వైద్యుని తీసుకువస్తే, ఆ వ్యక్తి ఆ బాణం వేసిన వ్యక్తి కులం ఏమిటో, పేరేమిటో తెలిసే దాకా వైద్యం చేయవద్దని అంటే ఎలా ఉంటుంది ? ఆ బాణం వేసిన వ్యక్తి రూపురేఖలు ఏమిటి — ఈ బాణం వచ్చిన దిక్కు ఏమిటి— ఈ విషం తయారీ ఎక్కడ— ఇవన్నీ విచారిస్తూ కూర్చోవటం మంచిదా ? ముందు ఆ బాణాన్ని తీసివేసి ఆ వ్యక్తి బాధోప శమనం కలిగించటం మంచిదా ? అందుకనే ఇక్కడ నీవు జీవిస్తున్న జీవితాన్ని గురించి ఆలోచించు; గత జన్మ గురించి, రాబోయే జన్మ గురించి, ఏది శాశ్వతం ఏది అశాశ్వతం అనే విషయాల గురించి ఆలోచించటం వృథాప్రయాస ... నాకు ఎందుకనో ఈ థియరీ నచ్చుతుంది పద్మా ! కాని భగవంతుడు లేడనే నాస్తిక వాదాన్నీ ఈ మనస్సు పూర్తిగా అంగీకరించదు. ఎక్కడ తర్కం ముగుస్తుందో, ఎక్కడ మూఢనమ్మకం మొదలవుతుందో నాకే అర్థం కాదు ...'' మనసులోని భావాలన్నీ క్రొత్త స్నేహితురాలు పద్మకి విడమర్చి చెప్పింది ఇందిర.

''ద్వైదీభావాలు మానవ స్వభావానికి సహజం కాబోలు. బమ్మెర పోతన వంటి భక్తుడే ఒకానొక సమయంలో 'కలడు కలడనెడివాడు కలడో లేడో' అన్నాడుట. మొన్నొక రోజు ఒక ఆధునిక కవి మాటలు చదివాను.

'ఈ సృష్టికి ఏమర్థం<br>మానవునికి గమ్యమేమి<br>ఒక సకలాతీత శక్తి ఉన్నట్లా లేనట్లా'

ఇందిరా, నీవు నా కంటె బాగా చదువుకున్న దానివి, నా మాటలకు నవ్వుకుంటున్నావేమో ?''

''లేదు పద్మా ! స్నేహితుల మధ్యలో చదువు, డబ్బు, అందం — ఇటువంటి వాటి ప్రసక్తే లేదు. నీకు ఇంత మంచి విషయాల్లో ఆసక్తి, శ్రద్ధ ఉన్నందుకు నాకు సంతోషంగా ఉంది.''

''జాక్సన్ అంకుల్, సుధాకర్ ఇటువంటి విషయాల గురించి మాట్లాడుకుంటూ గంటలు గంటలు గడుపుతూ ఉంటారు ... నాకు, అంకుల్‌కి కరుణామయుడైన భగవంతుడు ఒకడున్నాడని విశ్వాసం. సుధాకర్ ఒట్టి సినిక్, ఈ విశ్వాసం అనేది ఓ బలహీనత అంటాడు.''

''ఇందాక అతనికి చింతలు అన్నావు — ఇప్పుడు అతనొక సినిక్ అంటున్నావు — ఏమిటబ్బా, ఈ వ్యక్తి ప్రత్యేక దృక్పథానికి కారణం ?''

''నీకు సుధాకర్ ఇంతక్రితమే తెలుసా ?''

''ఊహూఁ ... ఒకసారి హైదరాబాదులో కలుసుకున్నాను'' ఆ రోజు గుర్తుకు వస్తేనే అవమాన భారంతో తనకు ఒళ్ళు భగ్గుమంటున్నది. ''పోనీలే, పద్మా ! అతన్ని గురించి మనం మాట్లాడుకోవటం ఎందుకు ? మీ ఊరి గురించి ఏమయినా చెప్పు !''

ఆమె స్వరంలో ఏ భావన ధ్వనించిందో కాని, ''సుధాకర్ చాలా మంచివాడు ఇందిరా ! నాకు స్వంత అన్నలో సమానం'' అంది పద్మ.

ఇందిర ఏం మాట్లాడలేదు.

**(ఇంకా ఉంది)**

## విద్యార్థిలోకం వ్యాసరచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

"విద్యార్థుల ఆశయాలు—సమస్యలు" అనే విషయం చర్చించుకునేముందు ఒక్క మాట. పూర్వం విద్యాలయాలు అంటే దేవాలయాలుగా భావించేవారు కాని నేడో, వ్యాపార కేంద్రాలుగా మారాయి అంటే అతిశయోక్తి కాదేమో! ఎంతో శ్రమపడి సీటు సంపాదించి, ఎన్నో కష్టనష్టాలకోర్చి సకాలంలో విడుదల కాని పుస్తకాల కోసం ఎదురుతెన్నులు చూసి, చివరకు వచ్చినా అవి కొందరికి మాత్రమే దక్కి, రవ్వంత నిరాశకులోనై ఉన్న గ్రంథాలయం సాయంతోనైనా నోట్సు తయారుచేసుకుందా మనుకుంటే ఆ గ్రంథాలయం కూడా నామ మాత్రమే అని తెల్సినప్పుడు విద్యార్థులు ఎంత నిరాశకులోనౌతారో చెప్పనక్కరలేదనుకుంటాను. ఈ పరిస్థితులు అన్ని విద్యాలయాలలోనూ లేక పోవచ్చు. నూటికి 60 శాతం ఈ విధంగానే ఉన్నాయి ఇంక పల్లెటూళ్ళల్లో విద్యాలయాలు నామ మాత్రమే విద్య నేర్చుకునే విద్యార్థులూ ఉండరు, ఏ కొద్దిమందో ఉన్నా, చెప్పించే స్థోమత, ఆసక్తి లేక తల్లితండ్రులు వారి పిల్లలకు విద్యా అవకాశాలు కల్పించుటలేదు తల్లితండ్రులను నేర్పుగా ఒప్పించినా పిల్లలకు ప్రోత్సహించే ఉపాధ్యాయులూ ఉండరు

ఇకపోతే, ఆశయాలు అందరికీ ఉంటాయి నెరవేరే అవకాశాలు మాత్రం కొందరికే ఉంటున్నాయి ప్రతీ విద్యార్థి తన విద్యార్థి దశలో ఎన్నో ఆశయాలతో తన భావిజీవితాన్ని గురించి రంగు రంగుల బంగారు కలలుకంటారు తాము పెద్ద పెద్ద చదువులు చదవాలని, మంచి మంచి ఉద్యోగాలు చేయాలనీ, విదేశాలు వెళ్ళి ఉన్నత విద్యను అభ్యసించాలనీ, సమాజంలో ఒక పేరున్న వ్యక్తిగా అందరూ గుర్తించాలనీ ఇలా ఎన్నో రకాలుగా ఊహించుకుంటూ ఉంటారు ఈ రోజుల్లో విద్యార్థి దశదాటి బయటి ప్రపంచంలో అడుగుపెట్టగానే తను కన్న కలలకూ వాస్తవానికీ మధ్య ఉన్న దూరాన్ని గ్రహించి నిరాశకు లోనౌతున్నాడు చదివిన చదువుకు తగిన ఉద్యోగం దొరకాలనీ, ప్రతీ విద్యార్థి యొక్క కనీస ఆశయము కాని ఈ రోజులలో అది ఒక తీరని కోర్కగానే మిగిలి పోతోంది చదువుకు తగిన ఉద్యోగం దొరకదనే నిరాశతో చదువుమీద శ్రద్ధాశక్తులు కూడా సన్నగిల్లుతున్నాయి ఈ నిరాశకు మరొక కారణం కూడా ఉంది సంవత్సరమంతా ఎంతో కష్టపడి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులు అవ్వడం కోసం నిద్రాహారాలు మాని చదివి, ఫలితాల కోసం ఎదురుచూసే విద్యార్థులకు ఆశించిన ఫలితాలు కనిపించటంలేదు ఇందుకు ప్రథమ కారణం ఉపాధ్యాయుల నిర్లక్ష్యవైఖరి కొందరు ఉపాధ్యాయులు తమ స్వప్రయోజనాల కోసం ధనమునకు ఆశపడి, అప్రయోజకులైన విద్యార్థులను ఉత్తీర్ణులను చేయుటవలన ప్రయోజకులైన విద్యార్థుల సమర్థత మరుగున పడిపోతోంది శ్రమ ఒకరిది, ఫలితం మరి ఒకరిదీ అయిపోతోంది. అందువలన అతను ఏ రంగంలోకి అడుగుపెట్టినా ఆయా రంగాలలో సమర్థత లోపించి కొన్ని అస్తవ్యస్థ పరిస్థితులకు కారణ భూతమగుచున్నది ఇలాంటి అక్రమాలు జరగకుండా ఉపాధ్యాయులకు తగిన వేతనాలు కల్పించడం ద్వారా ఈ విధమైన లంచగొండితనం నివారించబడి సమర్థులైన విద్యార్థులకు చేయూత నిచ్చినవారు అవుతారు

## రచయిత పరిచయం



"పేరు సత్యవోలు శ్రీనివాసరావు.

జననం విజయనగరం, 1966-8-26.

తల్లిదండ్రులు సత్యవోలు శ్రీరామ మూర్తి (డెప్యూటీ కలెక్టరు), అన్నపూర్ణ

చదువు ఇంటర్ రెండవ సంవత్సరం, విశాఖపట్టణం, లంకపల్లిబుల్లయ్య జూనియర్ కళాశాల

హాబీలు టేబుల్ టెన్నిస్, పత్రికా పఠనం

నా ఈ ప్రప్రథమ రచనను ప్రోత్సహించి బహుమతినిచ్చిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" సంపాదకులకు నా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను."

**— సత్యవోలు శ్రీనివాసరావు**

వెనుక బడిన జాతుల, కులాల విద్యార్థులకు అంటూ ప్రత్యేక సదుపాయాలను, సౌకర్యాలను కల్పిస్తోంది ప్రభుత్వం ఇది సంతోషించ దగ్గ విషయమే కాని అగ్రకులాలలో కూడా ఆర్థికంగా ఎంతో చితికిపోయి, కనీస అవసరాలు కూడా తీరని పరిస్థితులలో ఉన్నా, చదువు మీద ఎంతో ఆసక్తి ఉండి చదువుకునే స్థోమత లేక ఎవరి నుంచీ ఏ విధమైన సహాయమూ లేక, తమ ఆశలను, ఆశయాలను సమూలంగా సమాధి చేసి దొరికిన ఉపాధితో నిరాశక్తంగా బ్రతుకు భారంగా గడుపుతూ ఉంటారు అలాటి విద్యార్థులకు ప్రభుత్వ సహాయం ఎంతైనా అవసరం కుల మతాలను జాతులను బట్టికాక అర్హతను బట్టి సహాయ సహకారాలను ప్రభుత్వం అందిస్తే వారికి ఉన్నతావకాశాలు కల్పించినవారు అవుతారు

ఒకొక్క విద్యార్థికీ, ఒకొక్క అంశం మీద ఆసక్తి ఉండటం సహజం ఉదాహరణకు సంగీతం, చిత్రలేఖనం, సాహిత్యం, నాట్యం, క్రీడలు మొదలగునవి, విద్యార్థి దశలో నేర్చుకునే అవకాశం అంతగా ఉండదు కొన్ని కొన్ని విద్యాలయాలలో ఉన్నప్పటికీ అవి సక్రమంగా అమలు జరగటం లేదు ఉదా క్రీడలకు ఒక పీరియడ్ కేటాయిస్తారు ఆడుకునే పరికరాలు ఉండవు పరికరాలు ఉంటే ఆటస్థలం ఉండదు ఇలా ఆటల యందు ఆసక్తికల విద్యార్థుల ఆశలు అణగారి పోతున్నాయి విద్యాభ్యాసానంతరం ఉద్యోగ సముపార్జన, కుటుంబ పరిస్థితులు లేక మరేదైనా అవాంతరాలు కలిగి తాను అభిమానించే అంశాన్ని నేర్చుకోలేక పోవచ్చు అలా జరగకుండా విద్యాలయాలలోనే తగిన అవకాశాలు కల్పించాలి వారు విద్యతోపాటే నేర్చుకుని ప్రావీణ్యత సంపాదించవచ్చు విద్యతోపాటు లలిత కళలలో కూడా ప్రావీణ్యం ఉంటే వేడినీళ్ళకు, చన్నీళ్ళు అన్నట్లుగా జీవనోపాధికి తోడ్పడవచ్చు

రోజు రోజుకూ విద్యార్థుల సంఖ్య పెరుగుతోందే కాని తగినన్ని విద్యాలయాలు, విద్యావకాశాలులేవు కనుక ఈ విషయమై విద్యాలయాధికారులు, ప్రభుత్వము కూడా తగినంత శ్రద్ధ వహించాలి విద్య పూర్తి అయిన వెంటనే విద్యార్థులు ఉద్యోగులుగా మారే సదవకాశం కల్పించాలి సమర్థత గల విద్యార్థులకు స్కాలర్ షిప్‌లు, పేద విద్యార్థుల నిధి మొదలగు సదుపాయాలు సమకూర్చి వారి, వారి సమర్థత నిరూపించుకునే అవకాశం కల్పించాలి ★




**ఎ. ఎన్. కె. — మద్రాసు**

నాకు చిన్నప్పటినుంచి పెద్దచదువులు చదవాలనిఆశ, కాని మా యింట్లో చదివించేఅర్హత లేక పోవడంవల్ల— ఆశలన్నీ నిరాశలై పోయాయి. ప్రస్తుతం ఇంటర్ చదువుతున్నాను.

★ ఇలాంటి బీదార్పులు ఆరిస్తేనే చికాకు తమిళనాడులో పి యు సి వరకు ఉచితవిద్య, గవర్నమెంటు కాలేజీలో జీతాలుతక్కువ— ఎన్నో రకాల సంస్థలు ఎన్నో ఉపకారవేతనాలు, ఉచితపుస్తకాలు అందించేవివున్నాయి, నిజంగా చదువుకొని డిగ్రీ తెచ్చుకోవాలంటే— కష్టపడిచదవాలి అదిముఖ్యం— చదువుకోలేకపోడానికి కారణాలు వెదకడంకాదు

**ఆర్. ఎ. వి. — ఏర్పూరు**

డబ్బున్నవాడు డబ్బులేనివాడు డబ్బుకోసం ప్రాకులాడుతారు ఎందువల్ల వీరిలో ఎవరుమారాలి?

★ డబ్బువిలువ మారాలి

**వి. ఆర్. ఎమ్ — సిద్దిపేట**

మేటి విద్యావిధానంపై మీ అభిప్రాయం?

★ అలాంటిదొకటి వుండాలని?!

**బి. ఎమ్. ఆర్ — భిలాయి**

నా మనస్సులో ఎల్లప్పుడు కొన్ని కొన్ని కోర్కెలు కొన్ని కొన్ని వూహలు నా మనస్సులో పుట్టుకొస్తుంటాయి, ఎందువల్ల?

★ మనసు బ్రతికివుందికనుక

**ఎన్. ఎస్. ఎన్. ఎమ్ — తాడేపల్లిగూడెం**

భూమి మీద మానవుడుపుట్టి ఎన్నికోట్ల సంవత్సరములై వుంటుంది?

★ తెలియదుగాని ప్రకృతినే నాశనంచేస్తూ— తన ఉనికిని ప్రశ్నార్థకంగా తయారుచేసి పెట్టుకున్నాడు!

**బి. వి. డి. డి. — అరిసవల్లి**

మనిషినై పుట్టినందుకు జీవితంలో ఏదైనా సాధించాలని వుంది కాని ఏం సాధించాలో తెలియడం లేదు.

★ సాధించలేక పోవచ్చు— పెళ్లి చేసుకుంటే హాయిగా 'సాధించు'కోవచ్చు కదా దుర్గాదేవీ?

**కె. డి. — అంకింపాలెం**

నేను కధరాయాలనుకుంటున్నాను తెల్లకాగితం మీద ఒకవైపురాయాలా; రెండువైపులా రాయవచ్చా?

★ తెల్లకాగితంపై ఒకవైపురాస్తే కంపోజిటర్లు సుఖపడతారు! ఇక మీ కధ శాశ్వతంగా ప్రాచీనగ్రంధంలా నిలిచిపోవాలనుకుంటున్నారా? తాళపత్రంపై రాయండి! (లేకపోతే ఏమిటిది ప్రతివారం రచయితలకు సూచనలు ప్రచురిస్తూనే వుంటారు మీరు చదవరా?!)

**కె. జి. ఎస్. కె. — కుప్పం**

మీ రచనలలో ఎటువంటి సమస్యలకు ఎక్కువ ప్రాధాన్యత యిస్తారు?

★ నాకు తెలిసినవి, సాదామనుషులకు నచ్చేవి తీసుకొందుకు ప్రయత్నిస్తాను.

**జి. వి. ఆర్ — హైదరాబాదు**

కొందరు అంతా తమకే తెలుసునన్నట్లు మాట్లాడుతారు.

★ అంతే! పైసా వేసినా పెద్దడబ్బాలో— పెద్ద చప్పుడు చేస్తుంది— వీళ్లూ అంతే ననుకోండి.

**బి. ఎస్. ఆర్. — ఏలూరు**

ద్వారానికి తారామణి హారం, హారతి వెన్నెల కర్పూరం, మోసం ద్వేషం లేని సీమలో మొగసాలి వెలిసెనీ మందారం అంటే అర్థం ఏమిటి?

★ నాకూ తెలియలేదు. ఓ సారి శాస్త్రిగారిని అడిగాను కూడ. అది సినిమాపాట అని రాశారు నవ్వుతూ

**సి. ఆర్. ఎమ్ — సిద్దిపేట**

ఈ సమాజంలోని మంచి చెడ్డలని గుర్తించి కూడా వాటి గురించే పట్టించుకోలేక పోతున్న ఈ న్యాయస్థానాలు చట్టాలు వున్నా లేకున్నా ఒకటే అంటాను

★ కనీసం యీ మెల్లకన్నులాంటి న్యాయస్థానాలు వుండబట్టే— కాస్తైనా ధైర్యం యివి లేకుండా ఓసారి యీ నాటి వ్యవస్థని వూహించుకు చూడండి

**బి. బి. హెచ్. — కాళీఖగ్గ**

వరకట్న దురాచారాన్ని రూపుమాపగల వ్యక్తులే యీ దేశంలో లేరా?

★ వుంటారు— వారు ఆచరణలో చూపుతారే గాని ఉపన్యాసాలివ్వరు వ్యక్తి సమస్యలని వ్యక్తిగతంగా పరిష్కరణ జరగాలి. కట్న సమస్య ప్రధమంగా వ్యక్తి సమస్య తరవాతే— సమాజసమస్య అబ్బాయిలకీ అమ్మాయిలకీ— వుండాలి ఆత్మగౌరవం అప్పుడుగాని యిది— పోయే అవకాశం లేదు

**ఎం. ఎన్. ఆర్. — బైపల్లి**

ఒక కవికి గుర్తింపు ఎప్పుడు?

★ నల్గురి నోళ్లలో పడ్డప్పుడు!

కన్నీళ్లకు ఖరీదెంత?

★ వాటికి ఖరీదు కట్టే షరాబు లేదు

ప్రతి ప్రేమకధకు ముగింపు విషాదమేనా?

★ కానక్కరలేదు

**ఎమ్. డి. ఎన్. — కొత్తగూడెం**

మనిషికి సుఖం ఎప్పుడు లభిస్తుంది?

★ తృప్తిగా బ్రతకడం అలవాటు చేసుకున్నప్పుడు

ప్రేమ ఒక యాక్సిడెంట్ అయితే పెళ్లి?

★ ఫస్ట్ఎయిడ్

**వీర్. — సామర్లకోట**

సుత్తండమ్మా!!!

★ స్టాపిట్, కాపీకాట్, సొంతజోకేదైనా ఉంటేచెప్పు. ★






# గురుదక్షిణ

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలా ప్రసాద్



"ఓరేయ్ రాజా "

ఇంటికి వస్తూనే పిల్చాడు కుమార్.

జవాబు లేదు.

"రాజా . ఒరేయ్ — రాజా .."

ఈసారది పిలుపులాగా లేదు. గర్జనలాగా వుంది!

"లేడండీ —" అంటూ వచ్చింది స్వర్ణ

"లేడూ — ఎక్కడికెళ్లాడు ? పిలుముందు." భార్యని కసిరాడు

భర్త ఉగ్రరూపం చూసి హడలెత్తింది స్వర్ణకి!

గబుక్కున వంటింట్లోకి వెళ్లి — పనిమనిషిని పంపించింది, ఆడుకుంటున్న కొడుకుని పిల్చుకు రమ్మని!

కొడుకు వచ్చేలోపల భర్త కోపం చల్లార్చడం ఎట్లాగో అర్థంగాక సతమతమవసాగిందామె. కొడుకు వస్తున్నాడేమోనని చూస్తూ — అప్పుడే రాకుండా వుంటే బావుండునని కూడా అనుకుంటోంది ఆమె గుండెలు దడదడలాడసాగాయి!

ఇవతల కుమార్ అశాంతిగా అటూ, ఇటూ పచార్లు చెయ్యసాగాడు అతడి కోపం ఇంకా తగ్గకపోగా .. ఆలోచించిన కొద్దీ కొడుకు రావడం ఆలస్యమయినకొద్దీ ఎక్కువ కాసాగింది.

ఇంతలో రానేవచ్చాడు కొడుకు రాజా! "రా రా ఇటు" చెవి పట్టుకుని లాగాడు వాడ్ని కెవ్వుమన్నాడు — వాడు

తల్లి ప్రాణం గిలగిల లాడింది

"నిన్న పరీక్షలో ఏం చేశావు "

" . . "

చెవి చేతిలోనే వుంది

"చెప్పు . వెధవా ?!" గట్టిగా మెలితిప్పాడు, చెవిని. వాడు పెద్దగా ఏడ్చాడు

"ఏడుపు కాదు — చెప్పముందు "

వాడు మాట్లాడలేదు

"చెప్పారి . లేకపోతే చంపేస్తాను . కాపీ చేశావా లేదా ?"

మళ్లీ మౌనం గుడ్లల్లో నీళ్లు !!

"చెప్పు !!!"

స్వర్ణ కూడా ఉలిక్కిపడింది

"అవును చేశాను..." బుగ్గల మీద కన్నీళ్లు జారాయి!

"వేలెడంత లేవు వెధవా . ఎందుకు చేశావు ? చెప్పు ఎందుకు చేశావు ?. . నిన్ను . . నిన్ను " ఆ చెంపా — ఈ చెంపా — ఎడాపెడా వాయించాడు జుట్టు పట్టుకుని గుంజి వంగదీసి వీపు మీద ఫెడీ ఫెడీమని బాదాడు!

దెబ్బ దెబ్బకీ బాధతో అరుస్తూ . ఏడుస్తున్నాడు రాజా !

వాడు ఏడ్చినకొద్దీ కోపం ఉధృతమవుతోంది కుమార్‌కి. తన వళ్లు తాను మర్చిపోయాడు. బెల్టు వూడదీశాడు

"చేస్తావురా ఎప్పుడన్నా మళ్లీ చేస్తావురా... ఇడియట్ చీల్చేస్తాను " బెల్టుతో ఈడ్చి ...ఛెళ్లున కొట్టాడు

"అమ్మా " ఆక్రందన!

"నోర్ముయ్ రాస్కెల్ .. ఏడ్చావంటే..." మళ్లీ ఇంకోటి

మళ్లీ . మళ్లీ.

స్వర్ణ వచ్చింది ఒక్క దూకున — దెబ్బ బిడ్డ మీద పడకుండా బెల్ట్ పట్టుకుంది

"నువ్వడ్డులే . ఇవాళ వీడి సంగతేమిటో తేలిపోవాలి. వీడి అంతు చూస్తాను.. "

"ఏమిటా మాటలు ? మీకు మతి పోయింది పిల్లాడేదో తెలీక చేశాడని .."

"తెలీకా ? ఏమిటే తెలీనిది ? కాపీ చెయ్యగూడదని తెలీదూ ? వాళ్ల టీచరు ఏం రాశాడో చూడు. వీడి నిర్వాకం గురించి వీడు పరీక్షలింక రాయడానికి వీల్లేదూ — మా స్కూల్లో గూడా ఇంకనించీ చదవనియ్యమంటూ చూడు . నీకూ తెలుస్తుంది కన్నావు . నువ్వు తుణ్ణే ! అసలీ బుద్ధులు మీవైపునించే వచ్చుంటాయి — నువ్వు కొట్టుంటావు కాపీలు అవినీతి కుటుంబం . ఛీ ."

"మేమా ? . అవినీతిపరులమా ? —"

"అవును — మీరే —"

బెల్టు విసిరేసి — "చెప్పకో. ఏం చెప్పకుంటావో నీ కొడుక్కి చేసుకో. ఏం చేసుకుంటావో ఈ కొంపలో నేనింక క్షణం వుండను."

జేబులోంచి తీసి, ఒక కాగితం విసిరేసి వెళ్ళిపోయాడు కుమార్

చదివింది స్వర్ణ

వీడు కాపీ చేస్తున్నందుకు గాను — ఇతర్లకి అందిస్తున్నందుకు గాను— వీడ్ని స్కూల్లోంచి తీసెయ్యాల్సి వుంటుందనీ— తగిన చర్య తీసుకుని బుద్ధి చెప్పమనీ . వీడి వల్ల స్కూలు మొత్తానికే చెడ్డ పేరు వస్తోందనీ రాసుంది అందులో అది వాడి భవిష్యత్తుకే మంచిది కాదని కూడా వుంది అందులో

రాజా ఏడవ తరగతి పబ్లిక్ పరీక్ష రాస్తున్నాడు.

అంటే పబ్లిక్ పరీక్షలోనే వీడు కాపీనా ? అందులో ఏడవ తరగతిలో ?

స్వర్ణకి మతిపోయింది.

* * *

"స్వర్ణా వీడికి బోర్డింగ్ స్కూల్లో సీటు వచ్చింది, చేర్పేస్తాను ఇక్కడుండి మరీ చెడిపోతున్నాడు. వెధవ ! ఏమంటావు ?"

"ఒక్కగా నొక్కడు— వాడ్ని దూరంగా వుంచుకుంటామా ?"

"ఉంచుకోక ? చెడగొట్టుకుంటావా ? ఇక్కడ వీడికి చెడ్డ స్నేహాలు ఎక్కువవుతున్నాయి మొన్నటికి మొన్న వీడిచేతిలో సిగిరెట్టు చూశాను ఇంకోరోజు బడెగ్గొట్టి సినిమాకి వెళ్ళాట్ట ! ఈ రీతిలో సాగుతోంది వీడి వ్యవహారం నాకు టైములేదు వీడ్ని చూసుకోడానికి నీకూ అంతే ... '

ఏం మాట్లాడలేకపోయింది స్వర్ణ

మరి ఆమెకూడా ఉద్యోగస్థురాలేనాయె !

పగలిద్దరూ ఇంట్లో వుండరు.

* * *

పిల్లవాడ్ని తీసుకుని ప్రయాణమయ్యారు — స్వర్ణ, కుమార్‌లు

ఆ స్కూలు వాళ్లకి చాలా నచ్చింది చూశాక నిశ్చింత అనిపించింది.

పిల్లవాడ్ని స్కూల్లో చేర్చి...ఫీజు చెల్లించారు.

ఆ తరువాత హాస్టల్‌కి వెళ్ళారు

రూములో అన్నీ అరేంజ్ చేశారు

పిల్లవాడ్ని వదిలారు — రూము చక్కగావుంది. ఒక రూములో ఏడెనిమిది మంది వీడి ఈడు పిల్లలు ! ఒక్కొక్కళ్ళకీ ఒక్కొక్క మంచం, పరుపు, దిండు, బీరువా, గుడ్డల స్టాండు, చెప్పుల స్టాండు — అన్నీ వున్నాయి.

రాజాకి కూడా ఉత్సాహంగానే వుంది !

హవుస్ మాస్టర్ ఎక్కడికో వెళ్లి అప్పుడే వచ్చారన్నారు !

స్వర్ణ — కుమార్ ఆయన్ని కలుసుకోడానికి వెళ్లారు.

కుమార్ ఆగిపోయాడు.

ఆయన .

ఆయన రామచంద్రరావుగారు !!

తన మాష్టారు !

నమస్కారం చెయ్యాలనిగూడా తోచలేదు చెమటలు — వళ్లంతా !

"మీరా . మాష్టారూ " కుమార్ పెదవులు కదిలాయి !

"అవునోయ్ . నన్ను గుర్తు పట్టావన్న మాట ! రిటైయిరయినా మళ్లీ చేరక తప్పలేదు. కుటుంబ భారం వహించాలి గదా ? ఆడ్‌హాక్ టీచరుగా చేరాను ఇల్లంటూ వుండాలి గదా ? హవుస్ మాస్టరుగా వుండమంటే సరేనన్నాను ఏదో జరిగిపోతోంది కాలక్షేపం. మా రెండు పొట్టలు నిండకపోతాయా ? అవునూ. నువ్విప్పుడేం చేస్తున్నావోయ్ కూచో కూచో ఈ అమ్మాయి నీ భార్యా ? వీడు నీ కొడుకా ? . రా బాబూ రా భయపడకు నా దగ్గిర కూచో " పిల్లవాడ్ని దగ్గిరికి తీసుకున్నాడాయన.

కూచున్నాడేగానీ — కుమార్ మనసు మనసులో

## మతానికి ప్రాముఖ్యం

పశ్చిమ జర్మనీలో మతంపట్ల ఆసక్తి పెరుగుతున్నది మత సంబంధమైన పుస్తకాలకు మంచి గిరాకీ ఏర్పడుతున్నట్లు పుస్తక ప్రచురణ కర్తలు తెలియచేశారు ఎక్కువ మంది ప్రజలు "జీవితం అంటే ఏమిటి ?" అని ప్రశ్నిస్తున్నారు, ప్రశ్నించుకుంటున్నారు దీనికి సమాధానం మతపరమైన పుస్తకాల్లో తప్ప మిగిలిన గ్రంధాల్లో దొరకటం దుర్లభం. ఇటీవల ఫ్రాంకుఫర్టులో జరిగిన పుస్తక ప్రదర్శనలో మత పరమైన పుస్తకాలకు ప్రాముఖ్యం లభించింది అన్యమతాల గురించి కూడా ఈ ప్రదర్శనలో పుస్తకాలు లభించాయి పుస్తకాల తీరుకూడా మారింది. కేవలం చిన్న పిల్లల నీతి కథల మాదిరి కాకుండా పెద్దవారికి కూడా ఆసక్తికరంగా ఉండే పుస్తకాలనుకూడా ప్రచురిస్తున్నారు ఎన్నడూ మత గ్రంధాల జోలికి వెళ్ళని ప్రచురణకర్తలు కూడా వీటిని ప్రచురిస్తున్నారు

లేదు స్వర్ణ మాట్లాడేస్తోంది కొడుకు గురించి అప్పగింతలు పెడుతోంది !

కుమార్ మనసు గిర్రిగా గతంలోకి వెళ్లింది !

* * *

ఎస్ ఎస్ ఎల్ సి పబ్లిక్ పరీక్ష లింక వారం రోజులే వున్నాయి పరీక్షలంటె ఎప్పుడూ భయమూ లేదు లక్ష్యమూ లేదు తనకి ! సెలెక్షన్ పరీక్షలలో తనని సెలెక్ట్ చెయ్యలేదు చాలా రోషం వచ్చింది తనకి టీచర్లతో పొగరుమోతుగా మాట్లాడాడు

అప్పుడే కొత్తగా వచ్చాడు క్రూర టీచరు లెక్కలకి ఆయనే రామచంద్రరావుగారు ఆయనే- ససేమిరా తను పబ్లిక్ పరీక్షలకి కూచోడానికి వీల్లేదన్నది ! కారణం — తనకి లెక్కల్లో సున్నా వచ్చింది సెలెక్షన్లలోనే సైన్సులోను- మిగతా అన్నిట్లోనూ తప్పాడు పాసయింది ఒక్క తెలుగు లోనే ! "ఇట్లాంటి వాళ్లందర్నీ పరీక్షకి పంపిస్తే— వాళ్లు తప్పడమేకాదు — మన స్కూలుకి పేరు పోతుందని—" ఆయనే హెడ్‌మాస్టర్‌తో చెప్పాడు ! పైగా తనతో గూడా— 'నువ్వింత వీగ్గావున్నావు కాబట్టి— నువ్వింకో సంవత్సరం చదువు అది నీకే మంచిది నేను హెల్ప్ కూడా చేస్తాను' అన్నాడు !

"ఈయన బోడి సలహాలు ఎవడికి కావాలి ?" అనుకున్నాడు గూడా తను !

తన తండ్రి హెడ్‌మాస్టరుతో మాట్లాడి — హామీ ఇచ్చాక— తను బాగా చదివి పాసవుతానని ప్రామిస్ ఇచ్చాక— పరీక్షలకి కూచోడానికి అనుమతి ఇచ్చారు — ఎట్లాగయితేనేం

తను రామచంద్రరావుని చూసి వెక్కిరింపుగా నవ్వాడు ! పొగరుమోతుగా నవ్వాడు ! నిలక్ష్యమేమిటన్నట్లు నవ్వాడు !!

అప్పుడాయన మొహం ఎట్లావుంది ? బహుశా తనని చూసి జాలిపడ్డట్టు నవ్వాడేమో !! అప్పుడది తనకి తెలీలేదు

పబ్లిక్ పరీక్షలు భయపెడుతున్నాయి! చదవడం ఎట్లా ? పుస్తకం తెరిస్తే ఏమీ అర్ధంకావు బుర్రకెక్కవు. అసలెప్పుడన్నా క్లాసులో ఈ పాఠాలు వింటేగా — తనకి తెలియడానికి ? రామచంద్రరావుగారూ, మిగిలిన టీచర్లూగూడా — ఎక్కడ ఏవి తెలియకపోయినా — తమని అడగమనీ — క్లాసులోనైనాసరే — క్లాసు బయటయినాసరే — ఇంటి దగ్గిరైనాసరే చెప్తామనీ — మరీ, మరీ చెప్పారు అవి తనలాంటివాళ్ల చెవికెక్కలేదసలు !

చూస్తూండగానే వారంరోజులూ గడిచాయి ! తెల్లవారితే పరీక్ష !! ఏం చెయ్యాలి ? ఆలోచించి — ఆలోచించి ఇంపార్టెంట్ అనుకున్నవన్నీ ఒక కాగితం మీద రాసుకున్నాడు జాగ్రత్తగా దాచి తీసికెళ్లాడు అది కాపీ ! అవును కాపీనే !! జాగ్రత్తగా చూసి రాయడంలో ఆ రోజుకి కృతకృత్యుడయ్యాడు రెండో రోజు లెక్కల పరీక్ష.

తమతోబాటు సెంటరుకి రామచంద్రరావు గారొచ్చారు అందరికీ టిప్స్ ఇస్తూ, ధైర్యం చెప్తారు చివరికి పరీక్షహాల్లోకి పంపిస్తూ—ఆయన అందర్నీ చేరబిల్చి . చెప్పాడు. చాలామంచిగా — 'జేబులోంచి కాగితాలుంటే తీసెయ్యండి అది మన స్కూలుకి చెడ్డపేరు' అని ఎవ్వరూ ఏమీ







మాట్లాడలేదు. ఆయనే చనువుగా అందరి జేబులూ వెదికాడు. తన జేబులోంచి కాగితాలు బయట పడ్డాయి. అవతల ప్రైమవుతోంది. కంగారు

తన చెయ్యి పట్టుకుని మూలకి లాక్కెళ్ళాడాయన! ఎడాపెడా చెంపలు వాయించాడాయన! కాగితాలు ముక్కలు ముక్కలుగా చించేశాడు

"రాస్కెల్ నీకింకా బుద్ధి రాలేదా? అందుకే నిన్ను పరీక్షలకి సెలెక్ట్ చెయ్యొద్దన్నది! వెళ్ళు లోపలికి . బుద్ధిగా రాయి తెలిసింది. తప్పితే— తప్పితావు — ఫరవాలేదు ." అంటూ వెళ్ళిపోయాడు!

తనకి ఏడుపు — కోపం — రోషం — కసి — కచ్చ —!! పరీక్ష హాల్లోకి వెళ్ళాడు అట్లాగే — ప్రశ్న పత్రం అర్థమేకాలేదు అర్థమయినంతవరకూ కూడా రాయలేకపోయాడు! మనసు మండుతోంది! అరగంటన్నా గడవకముందే బయటికి వచ్చేశాడు ఆయన కనబడితే ఆ కోపంలో ఏం చేసేవాడో — ఆ రోజు! హత్యే చేసేవాడేమో మరి! కానీ ఆయన కనబడలేదు!

ఆ తరువాత పరీక్ష మరోటి. . అన్నీ అట్లాగే జరగాయి ఆయనమీద కచ్ఛతో కాపీ కొట్టడానికే ప్రయత్నించాడు వీలున్నప్పుడల్లా కాపీ కొట్టాడు! కానీ... ఆయన ఇతర టీచర్లతో ఏం చెప్పాడో మరి — వాళ్ళుకూడా తనని కంట గమనిస్తూనే వుండేవారు! అవకాశమంతగా దొరకలేదు తనకి! పరీక్షలయ్యాయి. అమ్మయ్య అనుకున్నాడు కాలేజీ గురించి ప్లానులు వేశాడు! కానీ పరీక్షలో తప్పాడు తను! ఇదంతా ఆ రామచంద్రరావుగారివల్లనే! ఆయనంటే కచ్ఛ పెరిగింది!

దీనికి తగ్గట్టు, మళ్ళీ ఆ స్కూల్లోనే చేరి చదవమన్నాడు తన తండ్రి!! ఎంత అవమానం — అది!! తన జూనియర్సు — తనకి క్లాసుమేట్సు!! మళ్ళీ రామచంద్రరావుగారే లెక్కల టీచరు! మళ్ళీ అదే తీరు!

ఈసారి ఈయన అంతు చూడాలనుకున్నాడు— తను! ఎన్నెన్నో కంప్లైంట్లు ఆయనమీద హెడ్‌మాస్టరుకి చేసేవాడు — తను — ఇంకా కొందరితో కలిసి!

## గు రు ద క్షి ణ

ఆడపిల్లలతో ఈయన ప్రవర్తన విపరీతంగా వుందని రాసి మరీ ఇచ్చాడు — ఒకసారి!

అట్లాచేసి — ఇట్లాచేసి — చివరికి ఆయన ఈ స్కూల్‌లో వుంటే— మేము క్లాసులకి రామనీ— ఆయన్ని ఇక్కడ్నించి పంపివెయ్యాలనీ గొడవ — గందరగోళం చేసి— చివరికి అది స్ట్రైకుగా మార్చాడు! క్లాసు రూములు— ఫర్నిచరు— ధ్వంసం చేశారు— తామంతా కలిసి!

ఆ స్కూలే కాదు— ఆ పట్టణ మంతా మారుమోగిపోయింది! ఆ స్ట్రైకే ఇంకెన్నిటికో దారి తీసింది! అందరికీ — అన్నిటికీ లీడరు తనే!!

చివ్వరికాయనే అక్కడే రిజైను చేసి వెళ్ళిపోయాడు!!

ఆ రోజుల్లో తన పేరంటే చాలా మంది టీచర్లకే హడల్! ఆ ఊళ్ళో తన పేరు తెలీని వాళ్ళూలేరు — అప్పట్లో! అదో ఘనకార్యం! తనో హీరో!! అదో విజయ గర్వం!!!

* * *

మేష్టారెక్కడి కెళ్ళారో— ఏ స్కూల్లో చేరారో— ఎట్లా వున్నారో— తనకి అక్కర్లేకుండా పోయింది అప్పుడు!

ఆయనకేం? ఆయన పేరుకి తగ్గవాడు! సత్యసంధుడు! న్యాయమూర్తి! ఎక్కడున్నా అట్లాంటి వారిని వారి సత్ప్రవర్తనే రక్షిస్తుంది!

అది తనకి తెలీలేదు అప్పట్లో!

"ఆయన ప్రధానోపాధ్యాయుడిగా కూడా పని చేసి— విదేశాలకి వెళ్ళివచ్చి— బెస్ట్ టీచరు— అవార్డు కూడా తెచ్చుకున్నారుట! ఇంత పేరున్న ఈ స్కూలు వాళ్ళు ఆయన రిటయిరయినా — ఆయన్ని వెళ్ళి స్వయంగా అడిగి— ఈ స్కూలుకి తెచ్చుకున్నారట— తనంతట తనే— ఆయన తనకే హోదాలూ వద్దనీ— పిల్లలకి పాఠాలు చెప్తూ— వాళ్ళతోనే వుంటాననీ అన్నారట! ఆయనంతటి నిరాడంబరజీవి మరొకరు వుండరు"

ఇవన్నీ ఇక్కడీయన్ని కలవక ముందు— ఈయన గురించి విన్న నిజాలు! ఇవన్నీవిని ఈయన్ని తప్పకుండా చూడాలనుకున్నాడు తను! కానీ

ఆయన ముఖం చూడడానికి కన్నా తన కర్మత వుందా?

లేదు! లేదు!! అంతదాకా ఎందుకు? తను తన కొడుకుని గొడ్డుని బాదినట్లు బాదాడే ఎందుకు? వాడు చేసిన తప్పేముంది? వాడు తన కొడుకు! తన అడుగుజాడల్లోనే నడిచాడు

తను ఎస్సెల్సీలో ఇది చేస్తే . . వాడు ఏడవ తరగతిలోనే ఇది మొదలుపెట్టాడు! ఇంక ముందు, ముందు? ఏవేవో సంఘటనలు ..

వద్దు — వద్దు ..

* * *

"అరెరే అదేమిటోయ్ ." లేవనెత్తారు మేష్టారు. కన్నీళ్ళతో పాదాభిషేకం చేస్తున్నాడు — కుమార్

"మేష్టారూ నన్ను క్షమించండి నేను చేసింది ఎంత పెద్ద తప్పో గ్రహించలేకపోయాను, అప్పుడు అందుకే అందుకే ఆ సరస్వతీదేవి నన్ను కరుణించలేదు. నా బిడ్డని మీ శిక్షణలో — మీ ఆశీస్సులతో — తీర్చిదిద్దండి మేష్టారూ వాడికి విద్యాదానం చెయ్యండి. వాడు నాలాగా గాకుండా వుండాలి మాష్టారూ "

అంతకంటే మాటలు పెగల్లేదు.

"నీ తప్పేముందోయ్ అంతగా బాధపడతావు? ఆ వయసు అట్లాంటిది!"

చల్లగా నవ్వుతూ — రాజా తలనిమిరారు మేష్టారు!

ఆయన కళ్ళల్లోనూ నీళ్ళు తిరిగాయి!! ★

## గగన కుసుమాలు

మెడిసిన్, ఇంజనీరింగ్ చదువులు
చదవగలిగిన వాళ్ళకి
అవి తెస్తాయి
ఎక్కడలేని
అంద చందాలు
వాటికి
చెల్లించవలసిన మూల్యం మాత్రం
సామాన్యుడి తాహతుకి
అందని 'చందా'లు!

— కాశీనాథ & కాశీనాథ

# ఘాటుక్షని డైరీ



## అఘాయిత్యపు అల్లుడు

నెల్లూరుకు చెందిన నటరాజన్ అనే అతనే భార్య వరలక్ష్మినిఅస్తమానూ పుట్టింటి నుంచి అవి పట్రా, ఇవి పట్రా అని వేధించుకు తినే వాడట. ఆమె వోర్చినంత వోర్చి, ఇకక దరక, సరే తెస్తానని పుట్టింటికి వెళ్లి అక్కడే ఉండి పోయిందట దాంతోనటరాజన్ ఎగిరిగంతేసి అత్తింటికి వెళ్లిభార్యను రమ్మంటే రానన్నదట. దాంతో అతని ఆవేశం పూని కత్తితో ఆమెను పొడవబోయి అడ్డొచిన అత్త మామలను పొడిచి చంపేసి, భార్యను గాయపరచి, తాను అంతర్థానమయిపోయాడట— వార్త!

## హత్యకి దారితీసిన అక్రమ సంబంధం !

పాలకోడుకు చెందిన కరగూరుకు చెందిన 35 ఏళ్ళ దురైస్వామి భార్య 30 ఏళ్ళ క్రిష్ణమ్మకు అదేవూరు ఒకనాటి కరణం వెల్లియప్పన్‌కు రహస్య ప్రేమాయణం సాగేదట. ఈ విషయం తెలిసిన దురైస్వామి 'ఎన్నడిక్లీయుదు?' అని అడిగేసరి కామె అలిగి, పుట్టింటికే వెళ్లిపోయిందట. దాంతో అతను వూరి పంచాయితీపెట్టి కాపురానికి రమ్మని కోరితే, 'నేను నా యిష్టం వచ్చినట్లు వుంటాను. నన్నేమీ అననంటేనే వస్తాను అవ్వాళవుడాన్' అన్నదట. ఇహ లాభంలేదని దురైస్వామి ఆమెను చంపేసి, నేరుగా పోలీస్‌స్టేషనుకు వెళ్లి విషయం చెప్పి అరెస్టయి పోయాట్ట.

## తనయుని డిబార్ చేసిన తండ్రి

గిర్వాన్‌కు చెందిన జవహర్‌లాల్ నెహ్రూ ఇంటర్మీడియెట్ కాలేజి ప్రిన్సిపాల్ మున్నాలాల్‌శుక్లా గారువో యిద్దరు పరమ రవుడీ కుర్రాళ్లను కాలేజి నుంచి డిబారు చేశారట. అందులో వో కుర్రాడు ఆ కాలేజి ప్రెసిడెంట్ గారి సుపుత్రుడు అయితే మరొకడు ఆయన సుపుత్రుడేనట. చివరికి ఆ ప్రెసిడెంట్‌గారి అభ్యర్థనమీదాతని కొడుకును కాలేజీలో తిరిగి తీసుకుని, తన కొడుకును తీసుకోలేదట. నా కొడుకుని నిశ్చయంగా తీసుకోను అన్నాడటాయన. ఆహా రియల్లీ ఏ సినిమాటిక్ క్యారెక్టర్!!

## వెర్రితలలు వేస్తున్న కామప్రవృత్తి !

వెస్ట్ వర్జీనియాలో ప్రభుత్వం ఒహ కొత్త చట్టం తెచ్చిందట. జంతువులతో కామక్రీడలు మానవులు జరుపడాన్ని ఆ చట్టం నేరంగాభావించి, నిర్ణయించి, ముఖ్యంగా కోళ్లతో అని చిన్నఅండర్ లైను కూడా చేసిందట. అమెరికాలో జంతు కామ క్రీడలు పెరిగిపోతున్నాయనీ, అందునా మగవారు మరీ విర్రవీగి పోతున్నారనీ ప్రభుత్వం అంచనా వేసి వాపోయిందట. 1977 లో సెక్స్ చట్టాలలో యీ జంతు సంగమం చేర్చబడలేదని, దానివల్ల యీ అనర్థాలు జరుగుతూ వున్నాయనీ వెస్ట్ వర్జీనియా లెజిస్లేచర్ అభిప్రాయ పడ్డదట— ఏమీ విడ్డూరము!

## డి. జి. పి. బ్రౌరంపాలెం వెళ్లొచ్చారు !

ఏలూరుకు సమీపంలో గల బ్రౌరంపాలెంలో వో బ్యాంకు దోపిడీలో సుమారు 14 లక్షలవిలువ చేసే బంగారునగలూ, నోట్లకట్టలూ పోయాయట. ఈ సందర్భంగా రాష్ట్ర పోలీసు డైరెక్టరు జనరల్ గారా వూరువెళ్లి, వస్తూ వస్తూ ద్వారకా తిరుమ లేసుని సందర్శించి తనను విసుగింపబోయిన విలేఖరులతో "బ్రౌరంపాలెం వెళ్లాను, వచ్చాను అంతే! చెప్పేదానికి విశేషాలేంలేవు" అని విరుచుకు పడ్డారట !

*




## త్రివేంద్రంలో విజయదశమి వేడుకలు

త్రివేంద్రంలో స్థానిక తెలుగు సాంస్కృతిక సంఘ సభ్యుల విజయదశమి వేడుకలు ఈ సంవత్సరం వైభవంగా జరుపుకొన్నారు. వి. ఎస్ ఎస్. సి. కాలనీ బాలలు తెలుగు సాంస్కృతికి అనఘ్న రత్నాలు గిరీశం, గణపతి మొదలైన పాత్రల్ని ప్రదర్శించి, నృత్యాలు చేశారు. శ్రీమతి భవానీ రావ్ గారు రచించిన "నిశ్చయ తాంబూలాలు" హాస్య నాటికను ప్రదర్శించారు. అనంతరం శ్రీ యండమూరి వీరేంద్రనాద్ రచించిన 'రుద్రవీణ' నాటికను శ్రీ డి వి ఎస్ శాస్త్రిగారి దర్శకత్వంలో ప్రదర్శించారు.

---

**సిటి పౌరుదలశాఖ (హైదరాబాదు) సాంస్కృతిక సంఘం 'జలతరంగిణి' వారు ఇటీవల హైదరాబాదు రవీంద్ర భారతిలో 'ఆశ్రయం' నాటిక ప్రదర్శించారు. రచయిత, నటుడు శ్రీ చందు సోంబాబు, నటి శ్రీమతి శకుంతల పాల్గొన్న దృశ్యాన్ని చిత్రంలో చూడవచ్చు.**



## కథల పోటీ

బరోడా ఆంధ్ర సమితి, కాలేజి విద్యార్థుల కోసం తెలుగులో కథల పోటీ నిర్వహిస్తోంది. మొదటి బహుమతి 300 రూ. రెండవ బహుమతి 200 రూ. బహుమతి పొందిన కథలు, ప్రచురణార్హమైన మరి కొన్ని కథలు సమితి 1983 వార్షిక సంచిక "నవత"లో ప్రచురింపబడుతాయి.

1 కథలు అరటావు సైజులో 12 పేజీలకు మించరాదు.

2. పోటీకి పంపబడిన కథలు తిరిగి పంపబడవు.

3. ప్రిన్సిపాలుగారి సర్టిఫికేట్ ("పంపబడిన కథ వ్రాసినది కాలేజి విద్యార్థే" అనే ధృవపత్రం) కథతో పాటు జతపరచ వలెను.

4. కథలు స్వీయ రచనే అని, దేనికి అనువాదము కాదు, అని హామీ పత్రం కూడా జతపరచవలెను.

5. బహుమతి నిర్ణయాధికారం సమితి వారిదే.

1983 జనవరి 1 వ తేదీలోగా కథలు ఈ క్రింది చిరునామాకు పంపవలెను.

డాక్టర్ కె.కె రావు, ఫార్మసీ డిపార్టుమెంట్, ఎం.ఎస్. యూనివర్సిటీ, కళాభవన్, బరోడా —390001.

## లక్నో ఆంధ్ర సంఘము

లక్నో "రవీంద్రాలయ"లో అక్టోబరు 13, 14, 15 తేదీలలో అఖిల భారత తెలుగు ఏకాంక నాటిక పోటీలు జరిగేయి.

సావనీర్ కమిటి చైర్మన్ శ్రీ దీనదయాల్, ముఖ్యఅతిథి శ్రీ బి. జె. దాయ్‌జీని పరిచయం చెయ్యడం తదుపరి ముఖ్య అతిథి సావనీర్‌ను విడుదల చెయ్యడంతో కార్యక్రమాలు మొదలయ్యాయి.

ప్రదర్శించ బడిన నాటికలు ప్రేక్షకులకు కన్నుల పండుగ జేశాయి. ప్రధాన న్యాయ నిర్ణేత శ్రీ నండూరి సుబ్బారావు పోటీ ఫలితాలను ప్రకటించారు.

'తమిళ మన్‌రమ్' సభ్యులు 'ఆకలి' అన్న నాటికని ప్రదర్శించి ఉత్తమ నటుడి బహుమతి పొందారు.

కుమారి రాజశ్రీ శ్రీపతి "వీణా కచేరి" అనంతరం శ్రీ ఆర్.సి. త్రిపాటి బహుమతిప్రదానం చేశారు.

## చిలుక తీర్పు

కథలు. రచన శ్రీ రావూరి భరద్వాజ. 50 పేజీలు, వెల 3 రూపాయలు. ప్రతులకు ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమి 34 4 ఆర్. టి. బర్కత్ పురా క్వార్టర్స్, హైదరాబాద్—27.

## ఆంధ్రుల కథ

గేయ కథనం. రచన శ్రీమతి పి. సరళ 70 పేజీలు వెల 3 రూపాయలు. ప్రతులకు ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమి 34 4 ఆర్ టి బర్కత్‌పురా క్వార్టర్సు, హైదరాబాద్— 27.

## కోతి తపస్సు

గేయ కథలు. రచన డా. మహీధర్ నళినీ మోహన్, 47 పేజీలు. వెల 3 రూపాయలు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి 34, 4. ఆర్. టి. బర్కత్‌పురా క్వార్టర్స్, హైదరాబాద్

## హృదయ భారతి

పద్యకావ్యం రచన శ్రీ ఆచార్య, తిరుమల, 53 పేజీలు, వెల 5 రూపాయలు. ప్రతులకు ఆచార్య తిరుమల, చైతన్య కళాశాల, హైదరాబాదు — 500 001.

## భాగవత ప్రభ

అనువాదకుడు శ్రీ పురాణపండ రాధాకృష్ణ మూర్తి, 32 పేజీలు వెల తెలియదు. ప్రతులకు అనువాదకుని పేర, జయశ్రీ టాకీస్ రోడ్, రాజమండ్రి—4 అన్న చిరునామాకు వ్రాయాలి.

## శ్రీ చందనము

రచన కీ శే. బొడ్డు బాపిరాజు, 82 పేజీలు, వెల 5 రూపాయలు. ప్రతులకు శ్రీ బొడ్డు ఉమేశబాబు, బొడ్డు బాపిరాజు శిల్క్ క్లాత్ షాపు, మెయిన్‌రోడ్, ఏలూరు.

## సింగినాదం జీలకర్ర

సామెతకథలు. సంకలనం శ్రీపర్వతనేనిగంగాధరరావు, 68 పేజీలు, వెల 3 రూపాయలు. ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బాలలఅకాడమి, 34. 4, ఆర్ టి బర్కత్ పురా క్వార్టర్సు, హైదరాబాద్ — 500027.

## రత్నమాల

రచన వేమరాజు నరసింహారాజు. పేజీలు 120. వెల 10 రూపాయలు. ప్రతులకు నవ్యనాటక సమితి. వై.ఎం సి ఏ. నారాయణగూడ, హైదరాబాదు— 500 029

## న్యూ ఎక్స్ రే

ఆధునిక కవితా వేదిక. సాలుచందా 6 రూపాయలు. 14 పేజీలు. ప్రతులకు 'ఎక్స్‌రే', కొల్లూరి హవుస్, అమలాపురం—533 202. ★

## డాక్టరు వాసు హిప్నాటిజం చికిత్స :

హిప్న అనే గ్రీక్ పదానికి సమానార్థక సంస్కృత పదం స్వప్న. హిప్నాటిజం అంటే స్థూలంగా స్వప్న జగత్తు అని మనం అర్థం చెప్పుకోవచ్చు. అంటే, మానవుణ్ణి సుషుప్త్యవస్థకు తీసుకువెళ్ళి, వాడిచేత వాడికి ఇష్టమైన పనులు, మనకు ఇష్టమైన పనులు చేయించడం. మెస్మరిజం, హిప్నాటిజం రెండూ అన్యోన్యాశ్రయా లంటారు డాక్టరు వాసు. మెస్మరిజమంటే మానవుడిలో వున్న అనంతమైన శక్తి, దైవత్వం. హిప్నాటిజం అంటే, ఆ దైవత్వాన్ని, శక్తిని, సామాన్యుడు కూడ సాధించేటట్టు చేసే సాధనం, శాస్త్రం. మెస్మరిజం అనడం కంటే, భారతీయ యోగ శాస్త్రం అంటే, ఈ సత్యానికి చాల దగ్గరగా చేరుకుంటాం. మెస్మరిజంగాని, హిప్నాటిజంగాని, పాశ్చాత్యవేషం వేసుకున్న యోగశాస్త్రం మాత్రమే—అంటారు డాక్టర్ వాసు. ఈ ప్రపంచానికి తనను గురించి, తను బ్రతుకుతున్న ప్రపంచం గురించి, శాశ్వత సత్యాలను తెలియజేసే, సూచించే మెస్మరిజం కావాలి. దీనిని ప్రపంచానికి అవగాహన అయేటట్లు సాధించడానికి హిప్నాటిజం కావాలి హిప్నాటిజం అంటే, మానవుడునేటివరకు సాధించినది, సాధించ గలిగినది మెస్మరిజం అంటే, మానవునిలోని అనంతశక్తి నిలెలియ జేసేది. హిప్నాటిజం అంటే పరిపూర్ణతపొందడానికిదారిచూపేది— అని ఆయన వివరణ డాక్టర్ మెస్మర్ అనే మన స్తత్వవేత్త పేర ప్రవర్తిల్లిన పద్ధతి మెస్మరిజం అని ప్రచారంలోకి వచ్చింది. హిప్నాటిజమంటే, ఏదో వశీకరణ శక్తి అని, దీనిని నేర్చుకుంటే, ఎదుటివారిని మన ఇష్టం వచ్చినట్టుగా ఆడించవచ్చునని ప్రజలలో వో అపోహ వుంది. కాని, ఇది నిజంకాదు. హిప్నాటిస్టు ఏవ్యక్తిచేతగాని, అతని ఆత్మగౌరవానికీ, ఆర్థిక ప్రయోజనానికీ వ్యతిరేకంగా ఏ పనీచేయించలేడు. ప్రతి వ్యక్తి మనస్సులోను ఏదో అద్భుతశక్తి నిగూఢంగా వుంది. హిప్నాటిజం ఈ శక్తిని బయటికి లాగి తెస్తుంది. హిప్నాటిజం నేర్చుకొన్న వ్యక్తి తనలోని శక్తిని బయటికి తేగలడు. ఇతరులలో వున్న శక్తిని గూడ బయటికి తెచ్చి, తానూ బాగుపడి, ఇతరులనూ బాగుపరచగలడు మంచికీ చెడుకూ, సుఖానికీ దుఃఖానికీ నిత్యమూ జరిగే పెద్ద పోరాటం జీవితం. ఈ పోరాటంలో మన శక్తిని పెంచుకొన్న కొలదీ మన ముందు చెడు తలవంచుతుంది, దుఃఖం దూరమవుతుంది. హిప్నాటిజం మనకీ శక్తినిస్తుంది. మూడు మాటలలో హిప్నాటిజమంటే మన నిజ స్వరూపం తెలుసుకొనే శాస్త్రం. దీనిని స్త్రీలు కూడ నేర్చుకొని, తమ జీవితాలతో పాటు తమ సంతానం భవిష్యత్తును గూడ తీర్చి దిద్దవచ్చు. స్త్రీలు, పురుషులూ కూడ, తమ ఇతరుల శరీరక రోగాలను, మానసిక రోగాలను పోగొట్టవచ్చు. ఈ విషయాలనే డాక్టర్ వాసు ఇటీవల బాగ్‌లింగంపల్లి (హైదరాబాద్—44) లోని తమ హోమియోపతి, యోగ, హిప్నొథెరపీ ఆస్పత్రిలో పెక్కు అద్భుతాల ద్వారా

# హైదరాబాద్ నోట్‌బుక్

నిరూపించారు. డాక్టర్ వాసు ఒక వింత మనిషి. ప్రపంచంలోని ప్రతి మనిషి తను గొప్ప వాడినని చెప్పుకోడానికి తహతహలాడుతాడు. కాని డాక్టర్ వాసు తన శిష్యులు, తన విద్యార్థులు తనను గొప్ప వాడిని చేశారంటారు. ఆయన శిష్యులు— స్త్రీలు, పురుషులు, బాలబాలికలు— చేసిన అద్భుత ప్రదర్శనాలు చూచి నాకు ఆయన పైనా, ఆయన శిష్యుల పైనా, సమానమైన ఆదరాభిమానాలు కలిగాయి. ఆయన ఐదు రోజులే హిప్నాటిజం పాఠాలు చెప్పి, పదేళ్ళ పిల్లలతో గొప్ప పనులు చేయిస్తున్నారంటే నేనే కాదు, ఎవరైనా ఆశ్చర్య పడరా మరి ? డాక్టర్ గొప్ప హోమియోపతి వైద్యులు, యోగశాస్త్రంలో చాల కాలం సాధన చేసిన వారు. హిప్నాటిజంతో పలువురి వ్యాధులు నయం చేసినవారు. మంచం మీద గంటల తరబడి కూర్చోడం, మధ్య ఏ ఆధారమూ లేక తల, కాళ్ళు కుర్చీ వీపులకు ఆనించి పడుకుని కొయ్యబారిన వారి పొట్టపై నిలబడడం, సుషుప్త్యవస్థలో వున్న వారి చేతులకు సూదులు పొడిచినా స్పర్శజ్ఞానం లేకపోవడం, సిగరెట్టు కాల్చి పెట్టడం, సుషుప్త్యవస్థలో కొయ్యబారిన వారు బరువు లెత్తడం వంటి పనులు ఇతరులకు అనుమానం ఆవంతయినా లేని ఆశ్చర్యం కలిగిస్తాయి. డాక్టర్ వాసు అన్నట్టు ఈ విద్యను ప్రతివారూ నేర్చుకొని ఆత్మ, పర ఉన్నతికి పాటుపడడం అవసరం. నేను చూచిన ప్రదర్శనలో పాల్గొన్నవారు రా. ప్రసాద్, శ్రీరాములు, శ్రీదేవి, హరిబాబు, సుబ్రహ్మణ్యం, రాంప్రసాద్, సత్యానంద్, హరిబాబు, ప్రసాద్‌రావు గార్లు.

## శ్రీ మల్లంపల్లి స్మారకోపన్యాసం :

ఆంధ్రదేశ చరిత్ర, శాసన, పురాతత్త్వ పరిశోధనకు జీవితాన్ని హారతి కర్పూరంగా వెలిగించిన కీర్తిశేషులు మల్లంపల్లి సోమశేఖరశర్మ స్మారకోపన్యాసం నవంబర్ 12న ఏర్పాటుచేసి, రాష్ట్ర పురాతత్త్వశాఖ గొప్ప వరవడి పెట్టింది. భారత పురాతత్త్వశాఖ ఆగ్నేయ మండలం సూపరింటెండింగ్ ఆర్కియాలజిస్ట్, టెంపుల్‌సర్వే సూపరింటెండింగు (మద్రాసు) డాక్టర్ ఐ. కార్తికేయశర్మ ఆంధ్రలో ప్రాచీన ప్రాకృత శాసనాలు— అనే విషయమై ప్రసంగించారు. సాలార్‌జంగ్‌మ్యూజియం డైరెక్టర్ డాక్టర్ నిగం అధ్యక్షత వహించారు. డాక్టర్ సీతాపతి (ఐ. ఏ. ఎస్) ముఖ్య అతిధిగా పురాతత్త్వశాఖ ప్రచురించిన అహోబల దేవాలయాలు, శ్రీశైలదేవాలయం కైఫీయత్తు, 1977—78 పురాతత్త్వశాఖ రిపోర్టు ఆవిష్కరించారు. డాక్టర్ నిగం తమ అధ్యక్ష ప్రసంగంలో దేశంలో పురాతత్త్వంలలో ఇంకా ఎక్కువ పరిశోధనలు జరుగాలని, దాన శాసనాలు, మత శాసనాలు పరిశోధకుల దృష్టికి వచ్చినంతగా, సెక్యులర్ శాసనాలు రాలేదని, పురాతత్త్వ పరిశోధన



హిప్నాటిజం ప్రదర్శనలో పడుకున్నవారు కుమారి మాధవి, ఆమె పొట్టపై నిలుచున్నవారు కుమారి శ్రీదేవి, ఆమె ఎడమచేయి పట్టుకున్నవారు హిప్నాటిస్ట్ డాక్టర్ వాసు.

## హైదరాబాద్ నోట్‌బుక్

విరివిగా జరిగినప్పుడే సమగ్ర దేశచరిత్ర రచన సాధ్యమని, చరిత్రఅంటే రాజుల, రాణుల దినచర్యలు కాదని, సంఘటనలు, ప్రజల ఆర్థికాభివృద్ధి పరిణామని, శాసనాల సాహిత్యం కూడ సంపుటాలుగా వెలువడాలనే అన్నారు. ప్రారంభంలో రాష్ట్ర పురాతత్త్వశాఖ డైరెక్టర్ డాక్టర్ కృష్ణశాస్త్రి స్వాగతం చెబుతూ, శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కేవలం తెలుగుదేశమే కాక, భారతదేశమంతా గర్వించదగిన మహాపరిశోధకులని, అలాటి గొప్పవ్యక్తి స్మారక సభ జరుపుతున్నందుకు తమ శాఖ ఆనందిస్తున్నదని అన్నారు. ఇటీవల తమశాఖ తెలంగాణాలో జరిపిన త్రవ్వకాల వివరాలను తెలియజేశారు. డాక్టర్ కార్తికేయశర్మ తమ ప్రసంగంలో పెక్కు నూతన విషయాలు తెలిపారు. పురాతత్త్వానికి ఆంధ్రప్రదేశ్ కాణాచి, పెద్దముడియంలో హరప్ప ముద్రలవంటిరెండు ముద్రలు హరప్పలిపి వంటి లిపితో వున్న సలకం, ఎద్దులు ఉన్నసలకం దొరికాయి ఇటీవలసుబ్రహ్మణ్యమలయాండి అనేవారు ఆంధ్రలో కమనేగ్రంథం రచించారు. దానిలో కర్నమడకల, కేతవరంలలో హరప్ప చిత్రలిపిని పోలిన లిపిగల శాసనాలు దొరికినట్టు తెలిపారు. వీటన్నిటిబట్టి హరప్ప సంబందం గల ప్రాంతీయ ఇతరత్రా దేశంలో ఉన్నాయని అనుమానించవలసి వస్తున్నది. అశోకుని శాసనాలు పాలరాతిలో కాకుండా నల్లరాతి గుండ్లపైన చెక్కించడం విశేషం. అమరావతిలో గార్ద్వ పటలాల్యు నల్లరాతిని, వాటిపై దాతలపేర్లుండడం విశేషం. అమరావతిలోనే తొలిసారిగా బుద్ధుని పాదాలు కనిపిస్తాయి. 9వదశాబ్దపుకాలచక్రమూలతంత్రంలో బుద్ధుడు దాన్య కటుకానికి వచ్చినట్టు వుంది. అమరావతిలో బుద్ధుని పాదాలు నిరంజనా నదికి దిగుతున్నట్టు ఉన చిత్రాన్నిబట్టి బుద్ధుడు కృష్ణానదిలోకి దిగుతున్నాడనే అభిప్రాయం కలుగుతుంది.

పూర్వం రాజులవెంట లిపికారులు కూడా వుండేవారు. అలాగేదేశమంతా అశోక శాసనాలు చెక్కినవారు ఆయనవెంట ఉన్న శిల్పులే కనుక అశోక శాసనాల లిపులలో తేడాలేదు. భట్టిప్రోలు కరండంపైనికుబేరకుని శాసనలిపిని స్థానికశిల్పిచెక్కాడు. ఆ శిల్పి స్థానికుడు తెలుగువాడు గనుక, స్థానికమైన ఉచ్చారణానుగుణంగా చెక్కినందువల్ల లిపిలో మార్పులువచ్చాయి. దీనిని భూలర్ మొదలయినవారు దక్షిణబ్రాహ్మి అని పొరపాటుగా భావించారు. తిరుమల రామచంద్రగారు కూడా ఆ అపోహతోనే తమ మనలిపి పుట్టుపూర్వాలు పుస్తకంలోనూ అదే విధంగా వ్రాశారు. గుణింతాల విషయంలోనూ ఆయనతో విబేదిస్తున్నాను. ఇటీవల లంకలో దొరికిన బ్రాహ్మి శాసనాలలో సిపవత విహార అనేమాట పెక్కుసార్లు కనిపించింది. కనుక శ్రీ పర్వతమనేది పర్వతశ్రేణికాదు. నిర్దిష్టమైన ఒకేఒక పర్వతం నాగార్జునకొండ. రాష్ట్రంలో అతి ప్రాచీన

ముద్రలు బుద్ధవరంలో దొరికాయి. ఇటీవల చైతన్యపురిలో దొరికిన విశేషాలు విష్ణుకుండిన గోవింద రాజుకు చెందినవి కావడం సంతోషించదగినవి. శాసనాలలో తొలిసంస్కృత శాసనం యజ్ఞశ్రీ శాతకర్ణిది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాగబు గురించి చాలా వ్రాశారు. అది ఆధారంగా తిరుమల రామచంద్రగారు తమ పుస్తకంలో తెలుగు ప్రథమా విభక్తి ప్రత్యాయాలు గురించి చర్చించారు నాగబు అనే పదం అంతటితో ఆగలేదు. ఇటీవల నాగబుధిత, నాగబుధినో అనే పదాలున్న శిలాఫలకాలు చాలా దొరికాయి. కనుక నాగబు పద అంతటిలో ఆగలేదనీ, దాని తర్వాత కూడా ఉందని, కనుక అది ప్రథమావిభక్తిపదం కాదని నా అభిప్రాయం. తర్వాత డాక్టర్ శర్మ శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి శ్రద్ధదీక్ష, మానవత్వం మొదలయిన విషయాలను గురించి తెలిపారు చివరన డాక్టర్ కృష్ణశాస్త్రి ధన్యవాదాలర్పిస్తూ, అశోకునికి ముందే తెలుగుదేశంలో బవుద్ధం వ్యాపించిందని తాను నమ్ముతున్నానని, ఉత్తరదేశంలో అశోకుని శాసనాలలో పియదస్సీ అనివుండగా, నిట్టూరు, మస్కిల లోని శాసనాలలో అశోకుని పేరువుండడం కొత్త ఆలోచనలకు అవకాశమిస్తున్నది. ఇవి కళింగాన్ని జయించిన హస్తికుని శాసనాలా అని అనుమానం కలుగుతున్నదనిఅన్నారు. ఆంధ్రప్రదేశ్ పురాతత్త్వశాఖకు అపారసేవ చేసిన డాక్టర్ రమేశన్ స్మారకోపన్యాసాలుకూడా ఏర్పాటు చేయనున్నామనిఅన్నారు.

ఈ ఎ శ్రీ. లి.

శ్రీ అబ్బాయికళ్లు అందంగా ఉన్నాయండీ అన్నారు చిరంజీవి ఉదయానసుడనే అబ్బాయికళ్లు చూచి ఒకరు. ఆ రెండున్నర సంవత్సరాల పసిపాపడు ఎవరో నేర్పినట్టుగా, వెంటనే "అందుకని నేను కళ్లజోడు ఏసో్కలే" అన్నాడు. ఆమాటలకు ఆశ్చర్యపడినవారిలో ఒకరు "నాయనా కళ్లు బాగున్నవాళ్లూ ఈ కాలంలో ఫ్యాషన్‌కోసం కళ్లజోడు వేసుకుంటున్నారు. నీ మాటలకు వాళ్లు సిగ్గుపడితే బాగుండును" అన్నారు.

—తిరుమల రామచంద్ర

## పచ్చదనం

మండు టెండలో
నిండు కుండలో
తన జీవం ఉడికిపోతున్నా
మరోజీవికి నీడనిచ్చె
వృక్షంలో అణువణువునా
ఎంతో పరోపకారబుద్ధి ఇమిడి ఉంది
— అందుకే తనకి
నిత్యం కళ కళ లాడే ఆ పచ్చదనం

– సుహాసిని













# ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

## నియమ పాలన

మానవ జీవితంలో అన్ని రంగాలలోను పురోగతిని సాధించడానికి నియమ పాలన అవసరం. పురోగతి వరకూ ఎందుకూ? నిత్యజీవితం సాగడానికి నియమ పాలన అతి ముఖ్యం. ఉదయాన్నే లేవడం, కాలకృత్యాలు స్నానాదులు జరపడం, ఆహార స్వీకరణ, నిద్రించడం మొదలైనవన్నీ ఒక నియమాన్ని ననుసరించి జరిగిపోతూఉంటాయి. అలవాటు ననుసరించి ఇవి అప్రయత్నంగానే సాగిపోతూ ఉంటాయి. ఆయా కాలనియమాలు తప్పి మన యిష్టం వచ్చినట్టు వీటిని జరిపితే దేహారోగ్యం చెడుతుంది.

ఈ విధంగానే నియమాన్ని అతిక్రమించి చేసిన పూజలవల్ల ప్రయోజనం ఉండదు. కొన్ని సమయాలలో కష్టాలు కూడా కలగడం కద్దు.

మహామునులు నియమాన్ని తప్పిపోకుండా తపస్సుచేసి అద్భుత శక్తులను సంపాదించేవారు. నియమానుసారం సమాధి నిష్ఠలో ఉండి పరబ్రహ్మను అంతర్దృష్టితో తిలకించేవారు. నియమానికి భంగం కలిగితే వారి తపస్సునకు భంగం కలిగేది. పిదప వారు తీవ్రమైన నియమాలను పాటించవలసివచ్చేది. ఈ విషయం మనకు పురాణాల వల్ల తెలుస్తూనే ఉన్నది.

మనకు విశిష్టమైన జ్ఞానం కలగడానికి నియమ పూర్వకంగా విద్యాభ్యాసం చెయ్యవలసి ఉన్నది. అలా లేని విద్యవల్ల మనకు కలిగే ప్రయోజనం స్వల్పం. ఏమీ ప్రయోజనం లేకుండా పోవచ్చును కూడా.

ప్రజా పరిపాలన చేసే ప్రభుత్వం పరిపాలనకు వివిధశాఖల్లో వాటి వాటికి తగినట్టుగా నియమాలను ఏర్పరచి, వాటిని అనుసరించే పరిపాలనను సాగిస్తుంది. దానికి విరుద్ధంగా ఉన్నప్పుడు ప్రజలు ప్రభుత్వాన్ని గౌరవించరు. అట్టి పరిపాలనలో ప్రజలు కష్టాలనే అనుభవించవలసి వస్తుంది.

చంద్రుడు, సూర్యుడు మున్నగు గ్రహాలు తమ తమ నియమాలను అతిక్రమించి ప్రవర్తించవు. సూర్యచంద్రుల నియమబద్ధ గమనం వల్లనే ఋతుధర్మాలు సక్రమంగా ఉండి ప్రజాజీవనం నిరాటంకంగా జరుగుతుంది. గ్రహాల గమనాలు నియమ పద్ధతి నుంచి కొంచెం సడలినప్పుడే గ్రహణం మున్నగునవి కలుగుతాయి. ప్రజలకు ఉపద్రవాలు సంభవిస్తూ ఉంటాయి.

మనం ఎట్టి శ్రమ పడకుండా ఉండటానికి నియమ పరిపాలనయే ప్రధానమైనది. ఆ పద్ధతి ననుసరించిన వారిని అందరూ మెచ్చుకుంటారు, ఎంతో గౌరవిస్తారు.

### సౌరశక్తి కారు!

సౌరశక్తితో నడిచే కారును పశ్చిమ జర్మనీలో తయారు చేశారు. దీని అత్యధిక వేగం గంటకు 25 కి.మీ. కారు పై భాగాన అమర్చిన సౌరశక్తి ఫలకం సహాయంతో ఇంజను పని చేయటానికి కావలసిన శక్తి లభిస్తుంది. ఇందులో ఇద్దరు మాత్రమే కూర్చోవచ్చు. ఈ కారు నిర్వహణ ఖర్చు చాలా తక్కువగా ఉంటుంది. పైగా ఇవి కారుచౌకగా లభిస్తాయి. వీటి వలన వాతావరణ కాలుష్యం ఏర్పడదు. దీనిని ఫ్రీబర్గ్‌లో వాతావరణ రక్షణ ప్రదర్శనలో ప్రదర్శించారు.

# వంటలు



## దోసగింజల పొడి

కావల్సిన వస్తువులు :— బాగా ఎండిన దోసగింజలు, ఆరు ఎండిమిరపకాయలు (అభిరుచిని బట్టి మిరపకాయల సంఖ్య పెంచుకోవచ్చు లేదా తగ్గించుకోవచ్చు ), తగినంత ఉప్పు.

చేసే విధానము :— ముందుగా ఎండిమిర్చిని ముక్కలుగా చేసికోవాలి. శుభ్రమైన బాణలిని స్టౌవ్ మీద వుంచి, బాణలి కాలిన తర్వాత దానిలో ఈ ఎండిన దోసగింజలు వేసి దోరగా వేయించాలి. దోరగా వేగిన తర్వాత ఈ గింజల్ని ఓ పళ్లెంలోకి తీసి, ఆ తర్వాత ఎండిమిర్చి ముక్కల్ని బాణలిలో వేసి బాగా వేయించాలి. ఈ వేగిన మిర్చి ముక్కల్ని కూడా గింజలున్న పళ్లెం లోకి తీసి, స్టౌవ్ ఆర్పేసుకోవచ్చు. ఇప్పుడీ గింజల్ని, వేగిన మిరపకాయల్ని మెత్తగా దంపాలి ఆఖర్న, తగినంత ఉప్పు వేసి మరో మారు మెత్తగా దంపాలి. మెత్తగా నలిగిన ఈ పొడిని ఓ డబ్బాలోకి తీసికొని మూత పెట్టుకోవాలి. ఈ పొడి నాల్గయిదురోజులు నిల్వవుంటుంది.

ఈ పొడిని వేడి అన్నంలో నెయ్యివేసుకొని కలుపుకి తింటే బాగుంటుంది. చల్లారిన అన్నంలో అయితే నూనె వేసికొని కలుపుకు తింటే బాగుంటుంది.

– వెలమకన్ని పద్మావతి

## చాకోలెట్

కావలసిన పదార్థాలు :— పాలు 2కప్పులు, చక్కెర 2 కప్పులు, డ్రింకింగ్ చాకోలెట్ పౌడర్ 1/4 కప్పు, బేకింగ్ పౌడర్ 1/4 కప్పు, కొంచెం నెయ్యి, కిస్‌మిస్, బాదంపప్పు, జీడిపప్పు కొంచెం కొంచెం.

తయారు చేసే విధానం :— పాలు, చక్కెర, చాకోలెట్ పౌడర్, బేకింగ్ పౌడర్ అన్నిటినీ ఒక మందంగా ఉండే పాత్రలో కలపాలి. తర్వాత, స్టవ్ మీద పెట్టి సన్నని మంటతగలనిస్తూ ఆ పదార్థం కొంచెం గట్టి పడేవరకు మరగనివ్వాలి. మధ్య మధ్య గరిటెతో కలుపుతూ ఉండటం అవసరం. ఆ పదార్థం కొంచెం గట్టిపడిన తర్వాత ముందుగానే నెయ్యి పూసి వుంచుకొన్న ఒక పళ్లెంలోకి వంపాలి ఆ తర్వాత కిస్మిస్ పళ్లను, చిన్న చిన్న ముక్కలు చేసిన బాదం, జీడిపప్పులను ఆ పదార్థం మీద చల్లాలి. చల్లారిన తర్వాత నక్షత్రంలా, డైమండ్‌లా, చతురస్రంలా మన మనసుకు నచ్చిన విధంగా ముక్కలు కోసుకోవచ్చు.

– అనసూర్యమ్మ

## స్పాంజి అడ

కావలసినవస్తువులు:- రాగిపిండి మూడు కప్పులు, కొబ్బరిపాలు ఒక కప్పు, అన్నం వుడికేటపుడు వంచిన గంజి ఒక కప్పు, బెల్లం 150 గ్రా, కొద్దిగా ఉప్పు, చిటికెడు వంటసోడా, తగినంత నెయ్యి.

తయారుచేయువిధము :— రేపు ఉదయం ఈ టిఫిన్ చేస్తామనగా ఈ రోజు రాత్రికే రాగిపిండిని బాగా జల్లించి రెండు ఉప్పురాళ్ళు వేసి, గంజిలోకిపోసి బాగా కలిపిపెట్టాలి. ఉదయానికి పిండి బాగా పులిసి వుంటుంది. ఇపుడు ఒక కప్పు కొబ్బరి పాలలోకి పొడిచేసిన బెల్లము, వంటసోడా వేసి బాగా కలపాలి ఈ మిశ్రమాన్ని పులిసిన రాగి పిండిలోకి పోసి దోసెల పిండివలె వుండేటట్లు బాగా కలపాలి. పొయ్యి పై దోసెల పెనం పెట్టి బాగా కాలాక నెయ్యి వేసి ఈ పిండిని గరిటతో ఎత్తి పెనం మధ్యలో పోయాలి. దోసెలా నెరపకూడదు ఒకవైపు కాలిన తర్వాత స్పాంజివలె పొంగుతుంది. అపుడు తిరగేసి, చుట్టూ నెయ్యివేయాలి. బాగా కాలాక తీసేయాలి ఇది రుచిగా వుండటమే కాకుండా పుష్టిని కలుగజేస్తుంది.

— గార్ల సరస్వతి








# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

## ధర్మం — రక్షణ

"ధర్మో రక్షతి రక్షిత" అన్నచిన్న నవలలో కథాకథన విధానం, సంభాషణ చాతుర్యం, పాత్ర పోషణమూ, హృదయంగమంగా ఉన్నాయి. చివరి వరకూ పఠితలలో ఉత్కంఠను రేకెత్తించినది "అయిపోయింద"న్న మాట చదివేసరికి 'అయ్యో, అప్పుడే అయిపోయిందా?' అనిపించింది. అయితే రచయిత శ్రీ ఆకెళ్ళవారీ నవలద్వారా లోకానికేమి చెప్పదలచుకొన్నారో తెలియదు. సంప్రదాయ బద్ధమైన ప్రాచీన ధార్మిక జీవన విధానాన్ని ఇప్పుడింకా అక్కడక్కడా కొన వూపిరితోఉన్న బ్రాహ్మణ జీవితంలో పవిత్రతనీ, ఇప్పుడిప్పుడు దానిలో జరుగుచున్న మార్పును మాత్రమే చెప్పదలచుకొంటే సంతోషం. "ధర్మో రక్షితి రక్షిత" అన్న శీర్షికకు నవల ముగింపు నిరాశనీ, నీరసాన్నీకల్గించింది. దీక్షితుల వారి అసిధారావ్రతం గల నియబద్ధ జీవనానికి ధన్యవాదాలు, కాని గౌతమానందునితపస్స మాధికి కుహనా వేషం వేయించి పూర్వప్రతిష్టితములూ, స్వయంభువములూ అయినదేవాలయాలన్నీఇల్లాంటి కపటయోగుల కృత్రిమ సృష్టేఅన్నభావం అర్వాచీనులలో కలుగుతుంది. వేద స్వరూపుడైన దీక్షితులు గారు తాము రక్షిస్తూ వచ్చిన ధర్మానికి, తన కొడుకే దేవద్రోహం ప్రజాద్రోహం చేయుచూ, ప్రజలను మోసగించుతూ, తనకి మనో వైకల్య ఫలాన్ని కలిగించినట్లు బాధ పడ్డాడు. వేద ధర్మ రక్షణకు ఫలితం దీక్షితులుగారు, పరమేశ్వరశాస్త్రీ, తిండికి మొగం వాచినట్లు రచన సాగింది. కపట యోగిగా గౌతముడు చేసిన మోసం ఫలితంగా ఆ కుటుంబం సుఖజీవనానికి తిరిగి అలవాటుపడడమూ, సంఘంలో గౌరవాన్ని సంపాదించడమూ, ఆకపటానికి ఫలితంగా, దేవాలయమూ, సంస్కృత వేద పాటశాలలూ, అనాధ శరణాలయమూ, దేశంనలుమూలల నుండి లెక్కలేనన్ని ధనరాసులు వర్షించడమూ జరిగింది. మందిరసోత్తరంగా సాగిన కథా, పవిత్రతా క్రొత్త మలుపుతిరిగి, ఆ అర్ధరాత్రి సంఘటన పరమేశ్వర శాస్త్రికంటపడిన దగ్గర నుండీ హేయమైన పుంతలుత్రొక్కి నవలలోని పరమప్రయోజనం నశించింది. వేద సంస్కృత పాటశాలలూ, అనాథాశ్రమమూ, దేవాలయమూ వెలయడానికి గౌతమానందునికి కళంకం ఆపాదించితే తప్ప పవిత్రత చివరివరకూ కొనసాగించడానికి మార్గం లేదా? కాని రచయిత కలం బుద్ధి పూర్వకంగానే అపమార్గంత్రొక్కినదనిపించును శ్రీరావ్‌ తాత్కాలిక బాధవల్ల వర్ణవైషమ్యం (ఎవరో ఆ మధ్య వ్రాసినట్లు భ్రమే తప్ప) నవలలో ఏమీలేదు. ముగింపు గౌతమానందుని పాత్ర యొక్క ఉదాత్తతను రక్షించుతూ పోతే ఈనాటికీ లోకానికి ఈ చిన్న నవలా రత్నం సర్వజన శిరోధార్యం అయి ఉండేది. ధర్మం ఎవరిని ఎలాగ రక్షించిందో తెలియగలదు కూడ

ఎస్ వి యస్. సుబ్రహ్మణ్యం (బొబ్బిలి)

## సమరం చాలించండి

ఈ దేశంలో ప్రతి పేదవాడు పైకి రావాలనే ఈ రిజర్వేషన్లు. అంటే బ్రాహ్మణులలో లేరని కాదు. ఉన్నారు. ఏ జాతిలో ఎక్కువ ఉన్నారు? ఏ జాతి బానిసబ్రతుకులు బ్రతుకుతున్నారు? ఏ జాతికి చేయూత నిస్తే ఆర్థికంగా సమానత్వం పెరుగుతుంది? అని దేశ నేతలు పరిశీలించి, పరిశోధించి ఈ రిజర్వేషనులను చట్టంలో చేర్చారు. "ఎప్పుడో బ్రాహ్మణులు ఇతరులను హీనంగా చూసి ఉండవచ్చునేమో"? అని గుర్రాజుగారు అన్నంతమాత్రాన ఈ రిజర్వేషన్లను తీసివేయకూడదు. మనం మనమే అని తెలియాలి అంటే, మన చిరునామాలో మన తండ్రి పేరు ఉంటుంది మన తండ్రి, మన తండ్రే అనటానికి మన తండ్రి చిరునామాలో, తన తండ్రి పేరుంటుంది అలాగే గతాన్ని బట్టి మన చిరునామా ఆధారపడి ఉంటుంది. అంటే మన జీవితమే, మన గతాన్ని బట్టి నడుస్తుంది. తన జాతిస్వార్థం కోసం ఇంతమంది బలి అవుతున్నారు అంటే అతిశయోక్తి కాదు. మిన్ను విరిగి మీద పడినట్లు బాధ పడకండి. మీరే గవర్నమెంటు ఆఫీస్‌నైనా పరిశీలించండి. ఏ అగ్ర కులాలకంటే, హరిజనులు తక్కువే వుంటారు. ఎందుకని? వాళ్ల బయుట జనాభా లేకా?.. .చదువు రాకా?. . . రెండూ కాదు. ఉన్న రిజర్వేషన్లను సరిగా అమలు జరుపకా, జరిపితే రిజర్వేషన్‌ల కోటా చాలక. కాబట్టి పిచ్చి వారు ఈ రిజర్వేషన్‌లను పెట్ట లేదని గ్రహించి ఈ ఉత్తరా సమరం చాలించమని ప్రార్థన.

ఎస్. వీరేశ్వరరావు (హైదరాబాదు)

## దసరా సంచిక

దసరా ప్రత్యేక సంచిక చదివాను. ముఖచిత్రం చాలా అందంగా ఉంది. మాకు భక్తి భావనను కలిగించింది. కేవలం వినాయకచవితిలా హాస్య కథలు వేస్తారేమో అనుకున్న మేము ఈ సంచికలోని మొదటి కథ పండుగలొస్తున్నాయి జాగ్రత్త చదివి ఆ అభిప్రాయం మార్చుకోవలసి వచ్చింది. ఈ సంచికలోని కార్టూనులు కూడాఎంతో హాస్యాన్ని అందించగలిగాయి.

ఈ సంచికలో శ్రీ బులుసు వెంకటరమణయ్య గారి వ్యాసం శ్రీ రామాయణ తత్వం మాకెంతో తృప్తినిచ్చింది. మాకు తెలియని శ్రీ రామాయణ పరమార్థాన్ని రచయిత బాగా తెలియజేశారు.

శేషు, ప్రసూన (గుంటూరు) ★

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S Radhakrishna.